

మెర్సీ చర్చి, బెంగుళూర్

ఫొటో: పి.ఎ.ప్రభాకరదత్

# సచిత్ర విచిత్రం



## బాల రోగులకి జంతు చికిత్స

లండన్‌లోని గయ్ హాస్పిటల్, చిన్న పిల్లల కోసం ప్రత్యేకంగా నడిపే హాస్పిటల్. 13 ఏళ్లలోపు పిల్లలకి ఆ హాస్పిటల్ ఇన్ పేషెంట్ హాస్పిటల్‌గా ఉపయోగిస్తోంది. అక్కడి పిల్లలు బోర్ కొట్టకుండా ఉండటానికి డిస్కవరీ ఛానల్‌నిఎక్కువగా చూస్తూండటం గమనించిన డాక్టర్ ఫీల్‌గుడ్‌కి ఓ ఆలోచన వచ్చింది. దాంతో జంతువులని హాస్పిటల్‌లోని వార్డ్‌లలో తిప్పి పిల్లలని వినోద పరిచే ప్రక్రియని చేపట్టాడు. 5 నెలల పులి పిల్లని, ఏనిమల్ హాండ్లర్ గైల్స్‌క్లార్క్‌ని చిత్రంలో చూడవచ్చు. ఇంకా ఏనుగు, సింహం, జిరాఫి లాంటి జంతువుల పిల్లల్ని కూడా ఇతను హేండిల్ చేస్తాడు.

# చతుర కతలు

## సుస్వాగతం

"ఈమధ్య నాకు రాత్రిళ్ళు నిద్రపట్టడంలేదయ్యా" అన్నాడు కుక్కుటేశ్వరరావు.

"అవును మరి! లక్షలుపోసి ఇల్లు కట్టించావుకదా! అంతో ఇంతో అప్పు చేసుంటావు. అది తీరేదాకా నిద్ర రాదుమరి" అన్నాను నేను.

"అబ్బెబ్బె! నా సంగతి తెలిసికూడా అంత చీప్‌గా మాట్లాడతావేమిటి?, అప్పుచేసే మనిషినా నేను. ఇన్నేళ్ళుగా పొదుపుచేసి... నానా అవస్థలు పడి... గడ్డితిని మరీ కట్టించాను తెలుసా? "

"అలాగా! అయితే నిద్రరాకపోవడానికి ఏదైనా అనారోగ్యం కారణం అయి ఉంటుంది. డాక్టర్ని చూడకపోయావా? "

"పాపం శమించుగాక! నాకనారోగ్యమేమిటయ్యా!"

"మరైతే నిద్ర ఎందుకు పట్టటంలేదో చెప్పి ఏడవచ్చు కదా మళ్ళీ నాకెందుకు పజిల్ పెట్టటం? " విసుగ్గా అన్నాను.

"ఆరులక్షలు పోసి ఇల్లు కట్టించానా. ప్రతివాడి కళ్ళూ నా యింటిమీదే! నాకేదో దిగులుగా ఉంది"

"ఇల్లు అందంగా ఉంది కదాని అందరూ ఓ క్షణం ఆగి చూస్తారు. దానికి దిగులెందుకు? "

"ఆ అందర్లో ఒకరో అరో దొంగలూ




ఉండొచ్చు. వాళ్ళు పగలు చూసి రాత్రికి కన్నం వేస్తారేమోననే గదా భయం"

"కన్నం వేయకుండా అదేదో అడ్వర్టయిజిమెంటులో చూపించే సిమెంటుతోనే ఇల్లుకట్టావు కదా" నవ్వుతూ అన్నాను.

"జోకులాపు! నా యింటికి దొంగలు పడకుండా ఉపాయం చెప్పు"

"గూర్ఖాను పెట్టుకో"

"తుప్పుపట్టిన తాళాన్నైనా నమ్ముతాను

కవర్ ఫొటోగ్రాఫర్: సంజీవి.

కానీ ఆరగుడుల మనిషిని మాత్రం నమ్మను. అదీగాక గూర్ఖాకు జీతం ఇచ్చేంత గొప్పవాడినా? " అన్నాడు కుక్కుటేశ్వర రావు.

"అయితే ఓ మంచి జాతికుక్కను పెంచుకో"

"అమ్మో! జాతికుక్కా? దాని తిండికయ్యే ఖర్చుతో కుటుంబం మొత్తం ముప్పూటలా భోంచెయ్యొచ్చు. నేను అలాంటివేం భరించ లేను"

"అయితే ఊరకుక్కను పెంచు, ఇంటి ముందు అలా పడుంటుంది"

"అది ఖర్మకాలి కరిస్తే పిచ్చిపడుతుంది. బొడ్డుచుట్టూ నూటొక్క సూదులు నేనెక్కడ పొడిపించుకునేది. వద్దు బాబూ!"

"చూడు! ఏ ప్రయత్నాలు చేయకు. ఓసారి దొంగలు పడనీ. అప్పుడయితే ఏదో ఒక నిర్ణయం స్పీడుగా తీసుకోవచ్చు" అన్నాను నేను సహనం చచ్చిపోయి ఎగతాళిగా!

"ఫ్రెండువికదాని మనసు విప్పిచెబితే ఎగతాళి చేస్తావా? సర్లే!... శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలన్నట్టు ఏదో ఒకటి ఆలోచించి అరేంజ్ చేస్తాను" అన్నాడు.

"దేనికీ ఒప్పుకోడు. ఏమిటి వీడు అరేంజ్ చేసేది వాడిబొంద!" అనుకున్నాను.

వారం తర్వాత కుక్కుటేశ్వరరావు నన్ను వాళ్ళ ఇంటికి పిలుచుకెళ్ళి "చూడు ఏం చేశానో" అంటూ గేటుకున్న బోర్డు చూపించాడు. పెద్ద బోర్డుమీద జీవం ఉట్టిపడేలా కుక్కబొమ్మ దానిపక్కనే "కుక్క ఉంది జాగ్రత్త" అని పెద్ద అక్షరాలతో రాసుంది.

'చాలాబాగుంది బోర్డు. చాలా కాస్ట్‌లీగా ఉంది' అనుకుని "ఎంతకు కొన్నావు" అన్నాను.

"దగ్గరుండి మరీ చేయించాను అయిదొందల రూపాయలయింది"

"కుక్కను చేయించడమా? " విస్తుపోయాను.

"బోర్డునయ్యా బాబూ!"

"అయితే కుక్క? ..."

"కుక్కా? నాబొందా? దొంగలు బోర్డును చూడగానే భయపడతారు. ఇక కుక్కెందుకు దండగ? ఎలా ఉంది నా అయిడియా? " అన్నాడు గర్వంగా కాలరెగరేస్తూ.

నాకురాని ఆలోచన అతనికొచ్చినందుకు నన్ను నేను తిట్టుకున్నాను. వాణ్ణి మనసారా అభినందించాను.

మరో వారంతర్వాత ఎదురైన కుక్కుటేశ్వరరావు దిగులుగా కనిపించాడు.

నా మనసేదో కీడు శంకించింది. కుక్కుటేశ్వరరావు జవాబు చెప్పేలోగానే ఏవేవో ఊహిస్తూ, "ఏమిటలా ఉన్నావు? " అన్నాను.

"కష్టపడి అయిదొందల రూపాయలు ఖర్చుపెట్టి బోర్డు చేయించానా? నిన్న రాత్రి ఆ బోర్డునెవరో దొంగలు ఎత్తుకుపోయారు" అన్నాడు.

"అంతేకదా! ఇల్లు కొల్లగొట్టిపోలేదుగా! వెధవ బోర్డు పోతేపోయింది. అంత దిగులెందుకు? " అన్నాను కాస్త కోపంగా.

"బోర్డు పోయినందుక్కాదు నా దిగులు. దానిస్థానంలో వాళ్ళు ఓ అట్టబోర్డు తగిలించి మరీ వెళ్ళారు. దానిమీద 'కుక్కలేదు. సుస్వాగతం' అని రాసుంది"

దిగులుగా అంటున్న కుక్కుటేశ్వరరావును చూసి నవ్వాపుకోలేకపోయాను!

—ఎ. జయలక్ష్మిరాజు

---

## మేడ్ ఫర్ ఈచ్ అదర్

ఆటో దిగిన గుర్నాధం నెమ్మదిగా నడుచుకుంటూ లోపలికెళ్ళి "నమస్కారం మేష్టారూ" అంటూ చటుక్కున పేరయ్య కాళ్ళు పట్టుకున్నాడు.

"శీఘ్రమేవ కళ్యాణ ప్రాప్తిరస్తు" అలవా

టుగా దీవించాడు పేరయ్య.

"అయ్యయ్యో... నాక్కాదు మేస్టారూ... నాకొడుక్కి" ఖాళీ రేకు డబ్బాలో కంకర రాళ్ళు పోసి గిలకరించినట్టు గలగలా నవ్వుతూ లేచి నిలబడ్డాడు గుర్నాథం.

"వార్నీ! మరి చెప్పవేమోయ్" అంటూ గుర్నాథం వీపుమీద చనువుగా ఒక్కటి చరుస్తూ పేరయ్య కూడా నవ్వాడు.

వెన్నుపూస విరిగినట్టనిపించిందేమో ఓసారి తన కుడిచేతిని వెనక్కి తిప్పి వెన్నె ముకని తడిమి చూసుకొని భారంగా నిట్టూర్చాడు గుర్నాథం.

"అబ్బాయ్ ఏంచేస్తుంటాడన్నావ్? "

"ఏమాత్రం సంపాదిస్తున్నాడేమిటి? " కొద్ది గ్యాప్ తరువాత మళ్ళీ తనే అడిగాడు.

"ఇండియన్ కరెన్సీ ప్రకారమయితే ఓ ముప్పై వేలుంటుందండి" గుర్నాథం కంఠం గర్వంగా మోగిందీసారి.

"ఏంటీ... నెలకే!" నోరు మూసుకోవడం మరిచిపోయి అలానే ఉంచేశాడు పేరయ్య.

మీరు మరీను మేష్టారూ... నెలక్కాక పోతే... రోజుకేంటండీ... ఆరోజులింకా రాలేదులెండి"

"సర్లేవోయ్... ఏదీ అబ్బాయ్ ఫొటో ఇలా గియ్యి" తనదైన ధోరణిలో నవ్వేస్తూ అడిగాడు.




"నేనేం అన్లేదు మేష్టారూ"

"నువ్వు భలే మాట్లాడతావోయ్" అంటూ చూపుడువేలుని అలవాటుగా పొట్టలో గుచ్చబోతే గుర్నాథం తెలివిగా తప్పించుకుని కాస్త దూరంగా జరిగి కూర్చున్నాడు.

"దుబాయ్‌లో ఉద్యోగం చేస్తున్నాడు మేష్టారూ"

"భేష్... మరింకేం" ఓ కితాబు విసిరాడు పేరయ్య.

తనకొడుకు రీసెంట్ స్టైల్లో లేటేస్ట్‌గా తీయించుకొని పంపిన ఫొటోని పేరయ్య చేతిలో పెట్టాడు గుర్నాథం.

"ఆహా! ఆ... చెవిపోగు... జులపాల జుట్టు... ఇంత అందగాడికి సంవత్సరం నుంచీ పిల్లే దొరకలేదటయ్యా" చేతిలో ఉన్న ఫొటోని అన్ని యాంగిల్స్‌లోనూ చూస్తూ అడిగాడు పేరయ్య.

"అందుకే కదండీ... మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చిందీ" దీర్ఘం తీశాడు గుర్నాథం.

"దేనికైనా టైమ్ రావాలయ్యా... అది

ఇవ్వాళ్టికొచ్చింది. ఇహ నువ్వు నిశ్చింతగా వుండు. నెల తిరక్కుండానే మీవాడిని ఓ ఇంటివాడిని చేసే బాధ్యత నాది" అభయ హస్తం చూపించాడు పేరయ్య.

"పిల్లమాత్రం రంభ, మేనక లెవెల్లో ఉండాలి మేష్టారూ. లేకుంటే మావాడు ఒప్పుకోడు. ఉద్యోగం చేసే అమ్మాయయితే మరీమంచిది. ఇద్దరూ నాలుగురాళ్ళు సంపాదించుకుంటారు"

"ఇంతకీ అబ్బాయి దుబాయ్‌లో చేసే ఉద్యోగం ఏమిటట..."

"హి...హి...హి... ఏదోలెండి" మొహమాటపడ్డాడు గుర్నాథం.

"ఫర్వాలేదు. చెప్పవయ్యా" మరోసారి చూపుడువేలుతో గుర్నాథం పొట్టలో పొడవబోయాడు. గానీ అందలేదు.

"వార్నీ!" పేరయ్య నోరు మరోసారి తెరుచుకుంది.

"మరి... మళ్ళీ ఎప్పుడు కలవమంటారు మేష్టారూ"

"అహహ... అక్కర్లేదు. అమ్మాయి రెడీగానే ఉంది. ఇదిగో ఈ ఫొటోచూడు" అంటూ ఓ ఫొటోని గుర్నాథం చేతిలో పెట్టాడు పేరయ్య.

"అమ్మాయి బావుంది మేష్టారూ... కట్నం ఎంతదాకా ఇస్తారో" సందేహం వెలిబుచ్చాడు.

"ఆ... కట్నందేముందయ్యా. పైగా అమ్మాయి కూడా ఉద్యోగం చేస్తోంది. ఇదే ఉద్యోగానికి దుబాయ్‌లో అయితే యాభైవేలు పైమాటే! పిల్ల నచ్చింది కాబట్టి ఏదో విధంగా ఖాయం చేసుకున్నావంటే ఇద్దరూ కలిసి ఇండియన్ కరెన్సీ ప్రకారం నెలకి ఎనభైవేలు సంపాయిస్తారయ్యా" కళ్ళు పెద్దవిచేస్తూ చెప్పాడు పేరయ్య.

"ఏమిటీ ఈ లెక్కన అమ్మాయి జీతం యాభైవేలా! మరి చెప్పరేం! మా అబ్బాయి కంటే రెండాకులు ఎక్కువే. అయితే వెంటనే మావాడికి కబురెట్టేస్తాను"

"అదీ... అలా అన్నావు బావుంది"

"ఇంతకీ... అమ్మాయి ఏం ఉద్యోగం చేస్తుందో చెప్పనేలేదు మేష్టారూ"

"ఏదీ నువ్వు చెప్పనిస్తేనా? "

"అంతేనంటారా... సరే! చెప్పండి" ముక్కుపొడుం తీసిన పేరయ్య సమాధానం కోసం ఆత్రంగా ఎదురుచూస్తున్నాడు గుర్నాథం.

"వంట బ్రహ్మాండంగా చేస్తుంది. అంట్లు కూడా తోముతుంది. ఈ పనులు చేసేవాళ్ళకి దుబాయ్‌లో చాలా గిరాకీ అట" నింపాదిగా చెప్పాడు పేరయ్య.

**– కె.గిరిజాలక్ష్మి**

## ఆ ఒక్కటీ అడక్కు

ఆ ఊళ్లో అదే చెట్టుకింద పదేళ్లనుంచీ వుంటూ చేతులు చూస్తూ భవిష్యత్తు చెప్తూ సైంటిఫిక్, కంప్యూటర్ జ్యోతిష్కులకి తానేమీ తీసిపోనని నిరూపించుకున్నాడు సాంబశివం.

చిరంజీవి, బాలు, నాగార్జున మరెందరో తన దగ్గరకి వస్తే వారి భవిష్యత్తు తానే చెప్పాననీ, తన మాట తప్పలేదనీ, వారందరూ ప్రముఖులలో ప్రముఖులు అయిపోయారనీ సాంబశివం చెప్తూ వుంటాడు.

అందులో నిజం వుందోలేదోకాని ఒక స్థాయి ప్రముఖులతో అతను కలసి తీయించుకున్న కలర్ ఫొటోలు మాత్రం సాంబశివం ప్రక్కనే ఖరీదైన ఫ్రేముల్లో చెట్టు కింద వుంటాయి.

వరల్డ్ కప్ క్రికెట్ పోటీలలో భారత దేశం పాకిస్తాన్‌ని ఓడిస్తుందనీ, సూపర్‌సిక్స్‌లో ప్రవేశిస్తుందనీ సాంబశివం క్రికెట్ అభిమానులకి చెప్పి ఆ వర్గం వారి అభిమానాన్ని, ఆదరణనీ సంపాదించాడు.

అలాగే చిరంజీవి ఒక ఫెయిల్యూర్ తర్వాత మూడు సూపర్‌డూపర్ హిట్లు ఇస్తాడనీ, చిరంజీవి అభిమాన సంఘాల



వారికి చెప్పి అలాగే జరగడంతో వారి అభిమాన జ్యోతిష్యుడుగా మారిపోయాడు.

బిజెపి ప్రభుత్వం కూలిపోతుందనీ, పాకిస్తాన్, భారతదేశాల మధ్య వాతావరణం మారుతుందని సరియైన సమాధానాలు చెప్తూ సాంబశివం తన స్థానాన్ని పెంచుకుంటూ వచ్చాడు.

అలా అలా సాంబశివం పేరు మారుమ్రోగిపోతూ వుంటే ఒక పెద్ద సమస్య ఎదుర్కుంటున్న సుబ్బారావు సాంబశివం దగ్గరకు వచ్చాడు. సుబ్బారావు ఎంటర్‌టెయిన్‌మెంట్ పురుగు. పుస్తకాల పురుగుకి విభిన్నమైన పురుగు ఇది.

తన జీవితాన్ని టీవీకే అంకితం చేసుకున్న అల్ప సంతోషి సుబ్బారావు. అయితే పదమూడు ఎపిసోడ్‌లలో పూర్తయ్యే సీరియల్స్‌లోనే అసలైన పసవుందని నమ్మే సుబ్బారావుకి దూ.ద. ప్రసారం చేస్తున్న ఒక సీరియల్ పెద్ద సమస్యే తెచ్చిపెట్టింది. అందుకే సాంబశివం దగ్గరకు తప్పనిసరై వచ్చాడు.

తన దగ్గరకు వచ్చిన సుబ్బారావుని సాంబశివం "కూర్చోండి" అంటూ చాప చూపించాడు. చెప్పులు పక్కన పెట్టి సుబ్బారావు చాపమీద కూర్చున్నాడు.

"ఏమిటి విషయం" సాంబశివం అడిగాడు.

"ఆ ఏముంది. అసలు విషయానికే వస్తాను. మా పాప పుట్టినప్పటినుంచీ దూ.ద.లో ప్రేమ ప్రవాహం సీరియల్ ప్రసారం అవుతోంది. మా పాప ఈమధ్యనే పెద్ద మనిషి అయింది. ప్రేమప్రవాహం ఇంకా సాగుతూనే వుంది" అంటూ మొదలు పెట్టాడు సుబ్బారావు.



"అయితే? " అడిగాడు సాంబశివం.

"అదే ఆ ప్రేమప్రవాహం ఎప్పుడు పూర్తవుతుంది" అని అడగవలసినది అడిగాడు సుబ్బారావు.

"అయ్యా సుబ్బారావుగారూ మీరే ప్రశ్నలయినా అడగండి. దేని భవిష్యత్తయినా అడగండి చెప్తాను. కాని దూ.ద. ప్రసారం చేస్తున్న సీరియల్స్ గురించి మాత్రం అడగకండి" అంటూ సుబ్బారావుకి చేతులెత్తి నమస్కరించాడు సాంబశివం.

ఆ మర్నాడు "ఇక్కడ చేతులు చూడబడును. జోస్యం చెప్పబడును. భవిష్యత్తు వివరించబడును" అని వున్న బోర్డుతోనే

అనుబంధంగా ఓ కొత్త మాట "దూ.ద. వారి సీరియల్స్ గురించి మటుకు అడగ రాదు" అని రాయించాడు సాంబశివం.

–తాజీ ప్రసాద్

---

## వేగం

అంతర్జాతీయ బాలల దినోత్సవం సందర్భంగా అనేక దేశాలనించి తొమ్మిది ఏళ్ళ వయసుగల పిల్లలు అమెరికా రాజధాని వాషింగ్టన్ డి.సి.కి వెళ్ళారు.

ఇండియానించి రాజేష్ అనే తొమ్మిదేళ్ళ పిల్లవాడిని ఎన్నిక చేశారు. అతని తండ్రి ఇలాంటి సాంస్కృతిక వ్యవహారాలు చూసే శాఖలో ఉద్యోగంలో ఉండబట్టే రాజేష్ తేలికగా ఎన్నికయాడు. రాజేష్ వారం రోజులపాటు వాషింగ్టన్‌లో ఉండటానికి చిన్న సూట్‌కేస్‌తో చేరుకున్నాడు. అతన్ని వాషింగ్టన్ ఏర్‌పోర్ట్‌లో ఓ యువతి రిసీవ్ చేసుకుంది.

ఆరోజు సాయంత్రం వివిధ దేశాలనించి వచ్చిన పిల్లలందరికీ ఓ టాపిక్ ఇచ్చి దాని మీద మాట్లాడమన్నారు.

ఆ టాపిక్ 'మా నాన్నగారు ఎందుకు గొప్పవారంటే'. చైనానించి వచ్చిన చిన్‌లున్ అనే పిల్లవాడు మైక్ ముందుకి వెళ్ళి ఇలా మాట్లాడాడు.

"మా నాన్నగారు అత్యంత వేగంగా పరిగెత్తగలరు. ఎంత వేగంగా అంటే ఆయన బాణంవేసి, పరిగెత్తుకెళ్ళి, అది గుచ్చుకునే చోటికి, ఆ బాణంకన్నా ముందే చేరుకోగలరు"

తర్వాత ఆస్ట్రేలియా నించి వచ్చిన ఆల్బర్ట్ అనే పిల్లవాడు చెప్పాడు.

"మా నాన్నగారు కూడా పరిగెత్తే విషయంలో గొప్పవారు. ఆయన తుపాకిని పేల్చి, పరిగెత్తుకెళ్ళి, ఆ గుండు గుచ్చుకునేలోగా ఆ చోటుకి చేరుకోగలరు"

ఇండియానించి వచ్చిన రాజేష్ వంతు వచ్చింది. మైక్ ముందు నిలబడి రాజేష్ ఇలా చెప్పాడు.




"మా నాన్నగారు ఇంకా వేగం. ఆయన ఆఫీస్ టైం సాయంత్రం అయిదు గంటల వరకూ ఆఫీసులో ఉండి కూడా మా ఇంటికి రోజూ ఖచ్చితంగా నాలుగు గంటలకల్లా చేరుకోగలరు"

–డి. పద్మజ



# చతుర

సంపుటి: 22 ★ సంచిక: 9 ★ అక్టోబర్ 1999

"భారతం పంచమవేదం. మనిషి ఎలా వ్యవహరించాలి...? దేని ఫలితం ఎలా వుంటుందీ...? అనే ఎన్నో ధర్మసూత్రాల్ని అలవోకగా జాతికందించింది.

అంధుడైన ధృతరాష్ట్రుడు పుత్రుడిపై అంధప్రేమతోనే వ్యవహరించి వారి దుశ్చర్యలను సమర్థించి, కౌరవకుల నాశనానికి కారకుడయ్యాడు. అటువంటి వాడికి... కడుపున పుట్టిన కొడుకులకే చితిపెట్టాల్సిన దౌర్భాగ్యం ఏర్పడుతుంది..."

గీతోపన్యాసం అలా మహా ప్రవాహంలా సాగిపోతూంటే... వింటున్న ఆ వృద్ధుడి హృదయం అతివేగంగా కొట్టుకుని... దాహంగా అనిపించసాగింది. ఎక్కడో దూరానవున్న కొడుకు జ్ఞప్తికివచ్చాడు.

కన్నకొడుకు అభివృద్ధికోసం కడుపు కట్టుకుని శ్రమించిన ఆ తండ్రి... జీవితంలో మర్చిపోయిన మామూలు ధర్మాలు ఎలాంటివి?

తన ఉద్యోగరంగానికే తలమానికంగా ఎదిగిన ఆ కొడుకు... తండ్రికిచ్చిన ప్రతిఫలం ఏమిటి? ఆధునిక మానవుడు డబ్బుకోసం పెట్టే అందని పరుగులకు అక్షరరూపం ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

## సింహప్రసాద్

# 'డాలర్...! డాలర్...!'

ఆకాశంలోని ఎరుపురంగు మెల్లమెల్లగా పడమటికొండల వెనక్కి జారుతోంది.

ఆనందాశ్వాన్ని అధిరోహించి ఇంటికొచ్చాడు ముకుందం.

అతడికి చెప్పలేనంత సంబరంగా, గొప్ప పెన్నిధి లభ్యమైనట్టుగా వుంది.

యౌవనపు తొలిసంధ్యలో వున్నాడతడి కొడుకు.

కొడుక్కి తన కాంక్షల్ని, స్వప్నాల్నీ విశదీకరించాలనుకుంటున్నాడు చాలారోజులుగా. కాని అక్షరీకరించడమెలాగో తెలీటంలేదు బాబుకి అర్థమయ్యేట్లు ఎలా విప్పి చెప్పాలో, మరెలా ఆవిష్కరించాలో తోచక ఇన్నాళ్ళూ సతమతమవుతున్నాడు.

అలాటిదివాళ అనుకోకుండా నెరవేరింది. రంగురంగుల పోస్టర్ల షాపుకి వెళ్ళాడారోజు ఒక ఫ్రెండ్ వెంట!

అక్కడి ఒక చిత్రం అతడ్ని బాగా ఆకర్షించింది.

తన ఆశలకి, ఆకాంక్షలకి రంగూ, రుచీ వాసనలిచ్చి రూపం ఏర్పడి జీవం పోసుకున్నట్టుగా వుంది.

దాన్ని కొని తెచ్చేశాడు.

"దొరబాబూ..."

ఇంట్లో అడుగు పెడుతూనే పిలిచాడు ముకుందం. అతడి గొంతులో చిత్రమైన ఆనందరాగాలు పలికాయి.

"ఏం డాడీ?"

"ఇలా రారా. నీ కోసం అపూర్వమైంది తెచ్చాను చూడు"

తన గదిలోంచి ఉత్సాహంగా వచ్చాడు బాబు.

"మన బంగారుకొండ కోసం ఏం తెచ్చారండీ" అంటూ వచ్చిందతడి భార్య పార్వతి.

కొనితెచ్చిన రంగుల ఛాయాచిత్రాన్ని ముందుగదిలోని గోడకి అతికించసాగాడు ముకుందం.

"చార్టా!" నిరుత్సాహంగా అంది పార్వతి.

"అలా తీసిపారెయ్యకు మరి. ఇది కేవలం ఒక పోస్టరో, ఫొటోనో కాదు"

"మరి?"

"చెబుతానుండు. బాబూ నిశితంగా చూడరా"

తల్లీకొడుకులు ఆసక్తిగా చూశారు.

ఒక పెద్ద భవనం. పోర్టికోలో ఏసీ కారు. మరోపక్క స్విమ్మింగ్‌పూల్. బిల్డింగు చుట్టూ గార్డెన్. కాంపౌండ్‌వాల్. గేటుపక్కన గూర్ఖా. పోస్టర్‌పైన "దిస్ హెవెన్ ఈజ్ యువర్స్" అని రాసివుంది.

"అబ్బ! ఎంత బావుందండీ. ఇలాటి భవంతుల్లో నివసించేవాళ్ళెంత అదృష్టవంతులోకదా!" అంది పార్వతి.

"అలాంటి అదృష్టం మన బాబుకి పట్టాలన్నదే నా కోరిక, ధ్యేయం"

ఆమె పొంగిపోతూ మురుస్తోన్న కళ్ళతో కొడుకు వంక చూసింది.

బాబు నిర్లిప్తంగా చూస్తున్నాడు. అతడికి లోలోన ఉద్వేగం సెలవేస్తోంది.

"ఎలా వుందిరా?"

"బావుంది"

"గట్టిగా, ధీమాగా చెప్పరా. ఈ స్వర్గం నీదే అంటున్నారు. స్వంతం చేసుకోవాలన్పించట్లేదూ?"

బాబు మాట్లాడలేదు.

"ఇదెందుకు కొనితెచ్చానో, ముందు గదిలో ఎందుకు అతికించానో తెలుసా?"

తల అడ్డంగా ఊపాడు.

"నీ లక్ష్యాన్ని తెలియజెప్పడానికి. అనుక్షణం నీ గమ్యమేమిటో నీకు గుర్తు చెయ్యడానికి. ఒక్కముక్కలో చెప్పాలంటే నీ పథనిర్దేశకర్త ఈ పోస్టర్. ఇవన్నీ నువ్వు సాధించాలి. గొప్పవాడివి కావాలి. తరగని సంప





దలు నీ స్వంతం కావాలి. ఈ భూమ్మీద అరుదైన అదృష్టవంతుల్లో నువ్వొకడివి కావాలి"

"మన బాబు అదృష్టజాతకుడండీ. తప్పకుండా గొప్పవాడవుతాడు"

"టెన్త్‌లో, ఇంటర్లో, ఎమ్సెట్‌లో ర్యాంకులు సాధించాలి. ఇంజినీరింగులో గోల్డ్ మెడల్ సంపాదించాలి. అమెరికా వెళ్ళాలి. ఉన్నత విద్యనభ్యసించి అక్కడే గొప్ప ఉద్యోగం చేపట్టాలి. కోట్లకి పడగెత్తాలి. నీ వయస్సువాళ్ళకెవరికీ సాధ్యంకానివన్నీ సాధించాలి. చెప్పరా బాబూ. ఇవన్నీ సాధిస్తావుకదూ. నా స్వప్నాలని సత్యాలు చేస్తావుకదూ. చెప్పరా చెప్పు" ఉద్వేగంతో వూగిపోతూ అడిగాడు ముకుందం.

పార్వతి కలవరపడింది. "ఇప్పుడవన్నీ ఎందుకండీ"

"నువ్వుండు. బాబూ... చెప్పరా నేతెచ్చిన ఇలాంటి స్వర్గాన్ని నీ స్వంతం చేసుకుంటానని చేతిలో చెయ్యి వెయ్యరా. అది సాధించడానికి రాత్రింబవళ్ళు కృషి చేస్తానని చెప్పరా. నిద్ర, సుఖం, సంతోషం, సెంటిమెంట్లు అన్నిట్నీ పక్కన పెడతానని చెప్పరా. చెప్పు..."

అయోమయంగా చూశాడు బాబు.

కాంక్షతో కంపిస్తోన్న తండ్రిని చూస్తోంటే భయం వేసిందతనికి. రక్తంతోపాటే ఆందోళన శరీరంలోని అణువణువులోకీ పాకుతోంది. నోటమాట లేక సన్నగా కంపిస్తూ దిగులుగా, భయంగా తండ్రివంక చూశాడు.

కానదేం పట్టించుకునే స్థితిలో లేడు ముకుందం.

"నా చేతిలో చెయ్యి వెయ్యి. నిన్ను అంతా అసూయపడేంత గొప్పవాడిగా తీర్చిదిద్దుతాను. అందనంత ఎత్తులకి తీసుకుపోతాను. నా ఆశలు, ఆశయాలు, తపనలు, కలలూ నీలో మూర్తీభవించాలి. వాటిని నెరవేర్చాల్సింది, సాధించాల్సింది నువ్వేరా. చెప్పరా... చెప్పు..."

తండ్రీ కొడుకుల వంక భయంభయంగా చూస్తూ ప్రతిమలా వుండిపోయింది పార్వతి. ఇదెక్కడికి దారితీస్తుందోనని గాబరాగా వుందామెకి.

ఒక నిశ్చయానికొచ్చినట్టు కదిలి తండ్రి చేతిలో చేయి వేశాడు బాబు.

ముకుందం ఆనందోద్వేగంతో ఊగిపోతున్నాడు. ఉత్సాహంతో పొంగిపోతున్నాడు. బాబు చేతులు పట్టుకుని కుదిపేసి భుజం చరిచి అభినందనలతో ముంచెత్తాడు.

"ఇకనుంచి ఒక్కక్షణం కూడా వృథా చెయ్యొద్దురా. అనుక్షణం చదువు! చదువు! చదువు! అంతే. చదువు తప్ప మరేంవద్దు. పూర్వం ఋషులు సర్వసుఖాలూ త్యజించి అడవులకెళ్ళి తపస్సు చేసుకునేవారు. నువ్వూ అలాగే అన్నిటినీ వదులుకుని విద్యా తపస్సు చెయ్యరా. నీ మోక్షం నేను నిర్దేశించిన లక్ష్యసాధనలో వుంది. అది నీకు దక్కేలా నేను చూస్తాను. వెళ్ళరా. వెళ్ళి నీ గదిలోకెళ్ళి చదువుకో. ఆల్ ది బెస్ట్ మైడియర్ బోయ్!"

మెల్లగా అడుగులేస్తూ వెళ్ళిపోయాడు దొరబాబు.

మాటల్లో వర్ణించలేనంత ఆనందంగా వుంది ముకుందానికి. "అయామ్ ఎ గ్రేట్ గ్రేట్ ఫాదర్" అని పాడుతూ ఆనందతాండవ మాడాలని వుంది.

మరో లోకంలో తేలిపోతున్నట్టుగా నడుస్తూ ఇంటి ముందున్న మామిడిచెట్టు దగ్గరికెళ్ళాడు.

ఆ చెట్టు పచ్చగా, నిండుగా కొమ్మలు చాచి విస్తరించి కల్పవృక్షంలా వుంది. ఆప్యాయతలకీ, అనుబంధాలకీ సాక్షీభూతంగా వుంది.

దొరబాబుకి అక్షరాభ్యాసం చేసిన రోజునే



అంటుమామిడి మొక్కని తెచ్చి ఇంటి ముందు పాతాడతడు. బాబు చదువులో ఒక్కో మెట్టూ ఎక్కుతూ టెన్త్‌క్లాసులో కొచ్చాడు. చెట్టు ఎదిగి శాఖోపశాఖలుగా విస్తరించి ప్రతిఏటా మామిడి విరగకాస్తోంది. అదనపు ఆదాయాన్ని చేకూరుస్తోంది. ఆ చిన్న ఇంటికి చల్లదనాన్నీ పచ్చదనాన్ని పంచుతోంది.

ఆ చెట్టులాగే బాబు విద్య కూడా విస్తరిస్తుందని చక్కని ఫలాలని లెక్కకు మిక్కిలిగా ఇస్తుందనీ అతడి ఆశ. ఆరాటం!

పడక్కుర్చీ తెచ్చివేసింది పార్వతి.

చెట్టుకింద కుర్చీలో కూర్చుని కలలు కనసాగాడు ముకుందం.

బాబు ఏం చేస్తున్నాడోనని అతడి గదిలోకి తొంగిచూసింది పార్వతి.

పుస్తకాలు ముందేసుకున్నాడన్న మాటేగాని చూపులు వాటిమీద లేవు. ఎటో చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. ఎంతో డల్‌గా నిరాశగా వున్నట్టన్పించింది.

"అలాగున్నావేం నాన్నా"

ఉలిక్కిపడ్డాడు బాబు. "ఏంలేదు మమ్మీ"

"మీ డాడీ మాటలకా? "

బాబు బదులివ్వలేదు.

"ఆయనేం చెప్పినా నీ బాగుకే కదా. ఏంచేసినా నీ ఉన్నతి కోసమేరా. నీ సంగతి తప్ప మరేదీ పట్టదాయనకి" కొడుకు జుట్టులోకి వేళ్లు పోనిస్తూ అంది.

తండ్రి మాట తల్లికి వేదవాక్కు. ఆయనేం చేస్తే అదే మంచిదని భావిస్తుందామె. ఆయనకి ఎదురుచెప్పదు సరికదా అన్నిటా ఆయన్ని సమర్థిస్తుంది. అక్షరాలా ఆయన అడుగుల్లో అడుగువేసి నడుస్తుంది.

ఆ సంగతి బాబుకి బాగా తెలుసు. అందుకే మౌనంగా వుండిపోయాడు.

"పోనీ కాస్సేపలా తిరిగొస్తావా? "

"డాడీ కోప్పడతారు"

ఇంట్లో ఉక్కిరి బిక్కిరిగా ఊపిరాడనట్టుగా వుంది బాబుకి. ఒక్కసారి అందులోంచి బయటపడితే బావుణ్ణని వుంది.

ఓ క్షణం ఆలోచించి అంది. "సరస్వతీ ఆంటీ ఉసిరిపచ్చడి అడిగింది. కాస్త పెట్టిస్తాను ఇచ్చిరా"

ఎగిరి గంతేశాడు బాబు.

వాళ్ళింటికి తప్ప ఇంకెక్కడికీ వెళ్ళనీడు తండ్రి. రామారావు అంకుల్, తన తండ్రీ స్నేహితులు. పక్కవీధిలోనే వుంటారు. వాళ్ళిల్లు చిన్నపాటి స్వర్గంలా అన్పిస్తుంటుంది. ఆ ఇంట్లోని వాళ్ళంతా బాబుకిష్టమే. ముఖ్యంగా సుస్మిత మరీ ఇష్టం.

సుస్మి బావుంటుంది. చక్రాల్లాంటి కళ్ళు మరీ బావుంటాయి. వెన్నెల కురిసినట్టుగా వుండే ఆమె నవ్వు మరీ మరీ బావుంటుంది. ఆమె తన ఈడుదే. తనతోబాటే యస్సెస్సీ చదువుతోంది. తనకన్నా మార్కులు తక్కువ వస్తాయి. అయినా ఆరిందాలా మాట్లాడుతుంది. ఆమె తన కన్నా తెలివైందనీ అదృష్టవంతురాలనీ భావిస్తాడు బాబు.

టిఫిన్ బాక్సులో పచ్చడి పెట్టిచ్చింది పార్వతి.

బాబు వెళ్తోంటే, "ఎక్కడికిరా" అనడిగాడు ముకుందం.

"రామారావు అన్నయ్యగారింటికి. నేనే పంపిస్తున్నాను"

"వాడికి పనులు చెప్పొద్దన్నాగా. చదువు పాడవదూ. సరిసరే. త్వరగా వచ్చెయ్యిరా"

తలాడించి బయటపడ్డాడు.

ఇంటి పరిసరాలు దాటాక 'హమ్మయ్య' అనుకుని నిటారుగా అయ్యాడు. ఎంతో





ఫ్రీగా ఫీలయ్యాడు బాబు.



రామారావుగారింట్లోంచి వీణానాదం విన్పిస్తోంటే గుమ్మంలో ఆగాడు బాబు.

మనసున మల్లెల మాలలూగినట్టుగా అన్పించింది. చప్పుడు చేయకుండా లోపలికెళ్ళాడు.

సరస్వతి పద్మాసనం వేసుక్కూర్చుని వీణ వాయిస్తోంది.

సుస్మితా ఆమె తమ్ముడు శ్రీనూ బుద్ధిగా కూర్చుని ఆలకిస్తున్నారు.

బాబుని చూసి కళ్ళతోనే ఆహ్వానించిందామె.

వెళ్ళి సుస్మితకి దగ్గరగా కూర్చున్నాడు. సుస్మిత పూలరేకుల పెదాలు విడీవిడకుండా నవ్వాయి. కళ్ళు పలకరించాయి. తనూ బదులుగా నవ్వాడు.

త్యాగరాజకీర్తనని సుమధురంగా వీణ మీద పలికిస్తోంటే అభినందనగా చూస్తూ వింటూండిపోయాడు.

"ఇక చాలు" వీణ పక్కన పెడుతూ అందామె.

"ఆంటీ... నీకు వీణ వాయించడం వస్తుందని సరస్వతి అని పేరు పెట్టారా లేక ఆ పేరు పెట్టారని వీణ నేర్చుకున్నావా? "

బాబు ప్రశ్నకి ఆనందంగా నవ్విందామె.

"ప్రతివారికీ ఏదో ఒక కళలో ప్రతిభ గాకపోయినా కనీసం ప్రవేశం వుండితీరాలంటారు మా నాన్నగారు. అందుకని సంగీతం నేర్చుకున్నాను"

"ఆయనేం చేస్తారు? "

"కవి, పండితులు" అంటూ లేచి "మీరు మాట్లాడుతూండండి. హార్లిక్స్ కలిపి తెస్తాను" అంది.

"మమ్మీ పచ్చడి పంపించింది"

"ఉసిరిపచ్చడి మీ అంకుల్‌కెంతో ఇష్టం. మీ అమ్మ పెట్టిన పచ్చడి మరీ రుచిగా వుంటుంది"

సుస్మి వెనకే ఆమె స్టడీరూంలోకెళ్ళాడు.

ఆమె గది గదికాదు చిన్న వసారా. అయితేనేం ఎంతో చక్కగా వుంది. గోడలకి ప్రకృతి దృశ్యాల పెయింటింగులు. అలమారలో చక్కగా అమర్చిన పుస్తకాలు. మంచం మీద ఎంబ్రాయిడరీ చేసిన దుప్పటి. పక్కనే కుర్చీ టేబులూ. దానిమీద టేబుల్‌లైటు. గూట్లో టేప్‌రికార్డర్.

అసలామె గదిని చూసి తన గదినీ అలా అమర్చుకోవాలనుకున్నాడు బాబు. అలంకరించడానికి యత్నించాడు కూడా. కాని తండ్రి పెదవి విరిచేశాడు. క్లాసు పుస్తకాలు తప్ప మరేవీ గదిలో వుంచుకోవద్దన్నాడు. ఏకాగ్రత చెదిరిపోతుందన్నాడు. ఆయనకి చెప్పి కన్విన్స్ చెయ్యలేక రాజీపడిపోయాడు.

చిన్నగా నిట్టూర్చాడు.

వెనుదిరిగి వింతగా చూసింది సుస్మిత!

తడబడ్డాడు "మళ్ళీ ఏమైనా పెయింటింగ్స్ వేశావా సుస్మీ"

తలాడించి వాటర్‌కలర్స్‌తో వేసిన చిన్న పెయింటింగ్ చూపించింది.

కొమ్మమీద రెండు పక్షులు. అందులో ఒకటి తల్లిపక్షి. రెండోది పిల్లపక్షి. తల్లిపక్షి ఎక్కడ్నుంచో తెచ్చిన ఆహారాన్ని ముక్కుతో బిడ్డనోటి కందిస్తోంది. నోరు తెరచి అందు కొంటోంది పిల్లపక్షి.

చిత్రానికేం పేరు పెట్టిందోనని చూశాడు.

అమ్మ.

"బావుంది సుస్మీ. బొమ్మ బావుంది. పేరూ బావుంది. అమ్మ ఎవర్కైనా అమ్మే"

ఆమె పొంగిపోయింది. అతడి ప్రశంస లామెని ఉత్తేజపరుస్తుంటాయి. అందుకే ప్రతి పెయింటింగూ అతడికి చూపిస్తుంది. తన భావావేశాన్ని అతడ్తో చర్చిస్తుంది. అప్పుడుగాని ఆమెకి సంతుష్టిగా అన్పిం చదు.

ఇద్దరూ క్లాస్‌మేట్స్ గనుక చదువు గురించి మాట్లాడుకుంటున్నారనుకుంటారు పెద్దవాళ్ళు కాని నిజానికి అది తప్ప మిగతా అన్నిటిని గురించి మాట్లాడుకుం టారు వాళ్ళు!

"నువ్వేమైనా రాశావా? "

సిగ్గుపడుతూనే ఎవ్వరూ తనని గమనిం చడంలేదని నిర్ధారణ చేసుకున్నాక జేబు లోంచి చిన్న కాగితం తీసిచ్చాడు.

అందులో వున్న చిన్న కవితని రాగబ ద్ధంగా చదివింది.

"ఆమె నేత్రాలు నా మనోనేత్రాలకి దృష్టి దాతలు

ఆమె నవ్వులు నా హృది తోటకి జీవన దాతలు"

కాస్సేపు ఆలోచించి అంది. "కవిత బాగానే వుందిగాని ఏం చెప్పదలచుకున్నావో అది తెలీటంలేదు"

"ఏదో ఒక ఊహ వచ్చింది. రాసేశాను" తప్పు చేసిన కుర్రాడిలా అన్నాడు బాబు.





"కళ రాళ్ళని సైతం కదిలిస్తుంది. కరిగి స్తుంది. అంత శక్తివంతమైన కళకి ఓ అర్థం పరమార్థం వుండాలంటాను"

"ఓకే సుస్మీ. ఈసారి ప్రయత్నిస్తాను"

"మీ డాడీకి తెలిస్తే? "

"ఇల్లు పీకి పందిరేసేస్తారు" నవ్వేడు.

"ఏహోయ్ దొరబాబూ" అంటూ వచ్చాడు రామారావు.

"నమస్తే అంకుల్"

"వూవూం... చదువెలా సాగుతోంది? "

"బాగుంది అంకుల్"

"నీకు ర్యాంకు రావాలి మరి. మీ నాన్న నీమీద బోల్డన్ని ఆశలు పెట్టుకున్నాడు. వాటిని నెరవేర్చాల్సిన బాధ్యత నీమీదుంది"

తలొంచుకుని మౌనంగా వుండిపో యాడు.

"మీ నాన్నేమంటున్నాడేవిటి. తను పట్టిన కుందేటికి మూడే కాళ్ళంటున్నాడా" బిగ్గరగా నవ్వేశాడు.

సరస్వతి హార్లిక్స్ తీసుకొచ్చి ఇస్తూ "మీ నవ్వుకి ఇంటికప్పు ఎగిరిపోయేటట్టుంది" అంది.

"మా ముకుందం భలే చిత్రమైన మని షోయ్! ఊరందరిదీ ఓదారైతే ఉలిపికట్టెదొ కదారన్నట్టు ఉంటాడనుకో"

"ఒక్కడే కొడుకాయె. ఆశలన్నీ అతడి మీద పెట్టుకోవడంలో ఆశ్చర్యమేముంది."

"తను తండ్రిమాట వినడు. తన కొడుకు మాత్రం తనమాట వినాలి!"

"ఈ రోజుల్లో అంతా అలాగే వుంటున్నా రులెండి. పెట్టాల్సి వచ్చినప్పుడు ఒకరకంగా, పుచ్చుకోవాల్సి వచ్చినప్పుడు ఇంకోరకంగా"

"ఏమిటి సరసూ! నీమాటల్లో ద్వంద్వార్థం ఉందేమోనని భయమేస్తోంది. నన్ను ఎత్తి పొడవట్లేదు కదా!"

"మిమ్మల్నంటే పడతారా. మీదపడి రక్కే

సినంత పనిచెయ్యరూ? లోకంతీరు చెబుతు న్నానంతే"

"అలా అయితే ఫర్లేదు. అంతేకదోయ్ దొరబాబూ? "

తలాడించాడు బాబు.

"ముకుందం అంకుల్ బాబుకి అలాంటి పేరు పెట్టారేంటి నాన్నా? " సుస్మి అడి గింది.

"అబ్బో అదో పెద్ద కథ"

"గొప్పలు చెప్పకండి. అదేం పెద్దకథ కాదు" సరస్వతి సరదాగా నవ్వుతూ అడ్డొ చ్చింది.

"సరే చిన్న కథ. నామకరణోత్సవం రోజున ముకుందం ఎంత హడావిడి చేశా డనీ! అప్పుడు వీడి తాతలిద్దరూ వచ్చారు. బంధువులూ వచ్చారు. ఇద్దర్లో ఎవరి పేరు పెడతారోనన్నది చర్చనీయాంశమయ్యింది. ఇద్దరి పేర్లూ కలిసొచ్చేలా పెడతాడనుకు న్నాను. కాని అందర్నీ విస్మయపరుస్తూ దొరబాబు అని పేరు పెట్టాడు"

"మరీ పాతవాసనేస్తోందిగా"

"పాయింటే. కాని దొరలంటే అదేదో పెద్ద గొప్పదన్న భావం ముకుందంలో నాటుకు పోయింది. అందుకని అలా పెట్టాడు. చాలా గొప్పవాడవ్వాలని, దొరలా బతకాలని వాడి ఉద్దేశం"

"ఒకవేళలా అవ్వకపోతే? "

"ముకుందం పిచ్చివాడైపోడూ!"

అనాలోచితంగా అన్న రామారావు మాట లకి అంతా అదిరిపడ్డారు.

వాడి బాణం దెబ్బతిన్న పక్షికూనలా చూశాడు బాబు.

"అయ్యో! అవేం అశుభం మాటలండీ" నొచ్చుకుంది సరస్వతి.

తన తప్పు తెలిసిరాగా నాలిక్కరచుకు న్నాడు "ఏదో సరదాగా అన్నానంతే"

కానప్పటికే జరక్కూడనిది జరిగిపో యింది.

పొంగివస్తోన్న కన్నీటిని నిగ్రహించుకోలేక విసవిసా బయటికెళ్ళిపోయాడు బాబు.

ప్రమాన్పడిపోయారంతా.

★ ★ ★

మదపుటేనుగులా ఫీంకరిస్తూ దూసుకొ స్తోంది రైలు.

అతడు ఒంటిమీది దుస్తుల్ని చింపు కుంటూ రైలుకభిముఖంగా వేగంగా వెళ్తు న్నాడు.

విసవిసా కసకసా నడుస్తున్నాడు. నవ్వుతూ ఏడుస్తూ తిట్టుకుంటూ వెళ్తు న్నాడు.

ఆ దృశ్యం చూసిన బాటసారులు అదిరి పడిచూశారు. నమ్మలేనట్లు చూశారు.

"అరెరె... అతడెవరయ్యా, ఆపండయ్యా"

"మనం గొంతు చించుకుని అరిచినా విన్పించుకునేలా లేడు"

"అయ్యయ్యో. అన్యాయమైపోతాడయ్యా. అరె అతడు ముకుందంలా వున్నాడే"

"లావుండటం కాదు ముకుందమే"

"మరెందుకలా పిచ్చిపట్టినట్టు రైలుచక్రా ల్లోకి దూసుకుపోతున్నాడు? "

"మీకు తెలీదా? ఇంతక్రితమే యస్సెస్సీ రిజల్ట్సు వచ్చాయి. వాళ్ళబ్బాయికి ర్యాంక్ వస్తుందని ఆత్రంగా చూస్తే ఏ వుందీ అసలా కుర్రాడి నెంబరే కన్పించలేదు. దాంతో పిచ్చెక్కింది"

"అయ్యో పాపం!"

"అలాటి కొరగాని కొడుకుల్ని కన్నవా ళ్ళంతా అలా అంతమైపోవాల్సిందే"

రైలు హెడ్‌లైట్ కాంతి కళ్ళముందు మిరుమిట్లు గొల్పింది. కళ్ళు మూసుకుని కసిగా ఎదురెళ్ళాడు.

క్షణాల్లో అతడి శరీరం ఛిద్రమైంది. ఒక ఆర్తనాదం ఆ ప్రదేశాన్ని కుదిపేసింది.

★ ★ ★

"డాడీ!" ఇల్లు అదిరేలా అరిచి లేచాడు దొరబాబు.

ఇంతింత కళ్లు చేసుకుని చుట్టూ భయం భయంగా చూడసాగాడు. అతడి దుస్తులన్నీ ముచ్చెమటలకి తడిసి ముద్దయిపోతు న్నాయి. గుండె వేగంగా కొట్టుకుంటున్న శబ్దం స్పష్టంగా వినిపిస్తోంది.

పార్వతీ, ముకుందం పరుగున వచ్చారు.

"ఏంనాన్నా, ఏవయ్యిందిరా కన్నా?" తల్లి పేగు తల్లడిల్లింది.

తండ్రి వంక వెర్రిగా చూశాడు. అపనమ్మ కంగా చూశాడు. ఆ పిమ్మట బావురుమని ఏడ్చేశాడు. తల్లి ఒడిలో తలదూర్చి వెక్కి వెక్కి ఏడ్చాడు.



"ఏమైంది నాన్నా, ఏమైనా పీడకల వచ్చిందా? మా నాన్నవికదూ, చెప్పు బాబూ"

"డాడీ"

"మీకేదో అయినట్టు పీడకల కన్నట్టున్నాడండీ"

"నాకేం కాలేదురా. నిక్షేపంలా వున్నాను. బాబూ! ఇటు చూడు. నిన్ను కళ్ళు చెదిరేంత గొప్పవాడ్ని చేసేవరకూ నాకేం కాదు గాని ధైర్యంగా వుండు. మరీ ఇంతగా పిరికి పాలు తాగితే ఎలారా. లే... మై డియర్ బోయ్ గెటప్"

తండ్రి మాటలకి కొంచెంగా స్థిమితపడ్డాడు. ఏడుపాపి కళ్లు తుడుచుకున్నాడు. కాని డొక్కలింకా ఎగిసిపడుతూనే వున్నాయి.

"ఆంజనేయస్వామి బొట్టు పెడతానుండు. గాలీ ధూళీ నీ నీడని కూడా తాకవు" అంటూ వెళ్ళి పూజామందిరంలోని కుంకుమ భరిణెలోంచి త్రిచూర్ణం తెచ్చి పెద్ద బొట్టు పెట్టింది.

"నిశ్చింతగా పడుకోబాబూ. కలలో జరిగితే ఇలలో జరగవురా. పీడకలలింక రావులే. ఆంజనేయస్వామి బొట్టు పెట్టానుగా. ఆంజనేయ దండకం చదువుకుంటూ పడుకో. నీకేం కాదు నాన్నా. నేన్లేనూ? !"

బాబుని పడుకోబెట్టి జోకొడుతూ అంది పార్వతి.

ఆమె చేతుల్ని గట్టిగా పట్టుకుని కళ్లు మూసుకున్నాడు.

"ఎక్కడో జడుసుకున్నట్టున్నాడు బిడ్డ" బాబు నిద్రపోయాక అంది పార్వతి.

"జడుసుకోవడమూ కాదు ఏమీకాదు. టీవీలో ఏ హారర్ షోయో చూసుంటాడు. ఆ దెయ్యాలు కలలో కన్పించి వుంటాయంతే"

"మీదంతా చోద్యంగాకపోతే టీవీ ఎక్కడ చూస్తున్నాడండీ"

"మనింట్లో టీవీ లేకపోవచ్చు బయట చూడలేదనేవిటి. ఈ కాలపు కుర్రాళ్ళని నమ్మలేం. పనికిరాని సినిమాలూ క్రికెట్టూ వుంటే చాలు తిండీ తిప్పలూ అక్కర్లేదు"

"మన బాబు అలాటివాడు కాదండీ"

"ఇంతవరకూ కాలేదంటే నేను తీసుకున్న కట్టుదిట్టమైన చర్యలే అందుక్కారణం. మన కట్టు దాటాడంటే చేయిదాటిపోతాడు"

"నా దొరబాబు అలాటివాడు కాదు. లక్షల్లో ఒకడు. పిల్లల్లో ఆణిముత్యం. నాకంటి దీపం"

బాబుని ముద్దు పెట్టుకుంది.

"అలాగని మరీ నెత్తికెక్కించుకుని గారం చెయ్యకు"

"సరేలెండి, ఎప్పుడెలా మాట్లాడాలో కూడా మీకు తెలీదు"

"నస వద్దుగాని పడుకోనీ. పొద్దుటే అయిదింటికి లేచి చదువుకోవాలి"

ఆ రాత్రంతా పార్వతి కొడుకు మంచం పక్కనే వుంది. మధ్య మధ్య ఉలిక్కిపడుతూనే కలతనిద్ర పోయాడు బాబు!

మర్నాటికి ఫెళ్ళున జ్వరం వచ్చేసింది.

రెండ్రోజులు చదువు పాడని విసుక్కుంటూ డాక్టర్ దగ్గరకి తీసుకెళ్ళాడు ముకుందం.

దేవీ ఉపాసకుడి దగ్గరకి బాబుని తీసుకెళ్ళి తాయెత్తు కట్టించింది పార్వతి.

"అవన్నీ వట్టి మూఢనమ్మకాలు" అంటూ వారించబోయిన భర్తని ప్రథమంగా ఎదిరించింది.

"నమ్మకమో మూఢనమ్మకమో ఏదో ఒకటి. నా పిచ్చిలో నన్నుండనీండి. నా కడుపున కాచిన ఒక్కగానొక్క కాయండీ వీడూ. వీడికేమైనా అయితే నేను బతకను గాక బతకను" అని తెగేసి చెప్పేసరికి మరి

మాట్లాడలేకపోయాడు ముకుందం.

అవాళ్టి నుంచి ప్రతి మంగళవారం ఉపవాసముంటానని ఆంజనేయస్వామికి మొక్కుకుందామె.

డాక్టర్ మందులో, తల్లి పూజలో, కట్టించిన తాయెత్తులో వేటి ప్రభావమోగానీ జ్వరం తగ్గింది. రెండ్రోజులకి బాగా పుంజుకున్నాడు.

బాబుకి ఒంట్లో బాగోలేదని తెలిసి సుస్మీ సరస్వతీ వచ్చారు.

సుస్మిని చూసి సిగ్గుపడ్డాడు. తనని పిరికి మనస్కుడిగా భావిస్తుందేమోననుకున్నాడు.

కానామె ఆ వూసే ఎత్తలేదు. పాఠాల గురించే మాట్లాడింది. అతడు ఏకసంధాగ్రాహి అనీ, అతడి ప్రతిభ అమోఘమనీ పొగిడింది. అతడికి తన శక్తి తెలిసేట్లు పరోక్షంగా చెప్పింది.

"ఏవిటయ్యా, పరీక్షల గురించి భయపడ్డావా? రిజల్ట్స్ గురించి భయపడ్డావా?" అడిగింది సరస్వతి.

"అబ్బే అలాటి భయాలేం లేవు వదినా. నిద్రలో లేపి అడిగినా గడగడా చెప్పేస్తాడు. ఎక్కడో జడుసుకునుంటాడు బిడ్డ. తాయెత్తు కట్టించానుగా ఇంకేమీ దరిచేరవు" అంది పార్వతి.

సరస్వతి మాటలు విన్న ముకుందం అన్నాడు, "పరీక్షలంటే భయం వుండాలమ్మా. ఇవి మామూలు పరీక్షలు కాదు. పబ్లిక్ పరీక్షలు. యస్సెస్సీలో వచ్చే ర్యాంకు కుర్రాడి భవిష్యత్తు చెబుతుంది. అతడి పునాది గట్టితనమెంతో చెబుతుంది. అందుకని భయపడాలి. మరింత కష్టపడి చదవాలి. అంతేగాని ధీమాగా కాలర్ ఎగరేసి కూర్చుంటే ఏమైనా జరగొచ్చు"

"బాబు చాలా తెలివైనవాడు. మంచి మార్కులు తెచ్చుకోవడం ఖాయం. ఆత్మవిశ్వాసాన్ని పెంచాలిగాని భయపెడ్తే ఎలా అన్నయ్యగారూ. మధ్యమధ్య ఆటవిడుపూ ఇస్తూండాలిగాని ఇరవైనాలుగ్గంటలూ చదవాలంటే ఎలాగా!" అంది సరస్వతి.

"నువ్వు పూర్వకాలపు చదువుల గురించి చెబుతున్నావు. అవన్నీ వానాకాలపు చదువులు. ఇప్పుడు కావాల్సింది ర్యాంకులు. విపరీతమైన పోటీలోంచి నెగ్గుకురావాలి. సర్వశక్తుల్నీ కేంద్రీకరించినప్పుడే అది సాధ్యమవుతుంది. ఇంజినీరో డాక్టరో కాగలుగుతారు"

"అవేకాదు ఇంకా చాలా కోర్సులున్నాయి. ఇంకా ఎన్నో ఉపాధిమార్గాలున్నాయి. ఎమ్సెట్‌లో సీటు రాకపోతే బతుకే లేనట్టు నూరిపోయడం సబబు కాదనుకుంటాను"

"నా దృష్ట్యా అంతేనమ్మా. ఇంజినీరన్నా కావాలి. డాక్టరన్నా కావాలి. అంతే... ఇంకేమైనా అయ్యేకన్నా కిళ్లీ కొట్టు పెట్టుకోవడం ఉత్తమం. చక్కని భవిష్యత్తు, సంతోషకరమైన జీవితం, కోరిందల్లా అనుభవించగల భాగ్యం కావాలంటే ప్రొఫెషనల్ కోర్సులో సీటు సంపాదించాల్సిందే. సంపాదించలేనివాడి చదువువేస్ట్. డబ్బు వేస్ట్ బతుకు వేస్ట్"

బల్లగుద్ది మరీ చెబుతున్న ముకుందం వంక వింతగా చూసింది. ఏవిటీయన మనస్తత్వం అని విస్తుబోయింది సరస్వతి.

వారి సంభాషణ విన్న సుస్మి తనే బాబుకి మానసిక స్థైర్యాన్నివ్వాలనీ టెన్షన్స్‌కి లోనుకాకుండా చూడాలనీ అనుకుంది. స్నేహితురాలిగా అది తన బాధ్యత అనీ అనుకుంది.

★ ★ ★

వార్త తెలిసి పల్లెనుంచి ముకుందం తల్లీ తండ్రీ పరుగెత్తుకొచ్చారు. పెద్ద ఆసరా లభించినట్టు పొంగిపోయింది.

బాబు స్కూలునుంచింకా రాలేదు. జరిగిందంతా పార్వతే ఏకరువు పెట్టింది.

ఆమెకి ధైర్యం చెప్పి చెట్టుకింద కూర్చున్న ముకుందాన్ని సమీపించారు నాంచా

రయ్య.

"ఎలా వున్నావురా అబ్బాయ్"

"ఏదో ఇలా వున్నాను. ఇంతకంటే బాగా ఎలా వుండగలం. నువ్వు రాసిన రాతకి"

"మధ్యలో నేనేం చేశాన్రా"

"ఏం చేశావో నీకు తెలీదూ. అన్నయ్యని పెద్ద ఆఫీసర్ని చేశావు. నన్ను గుమస్తాగా మార్చావు"

"అది వాడి అదృష్టం"

"ఇది నా దురదృష్టం అంటావ్. నాకు తెలుసు. మీకు పెద్ద కొడుకంటేనే ఇష్టం. అతడే మీ కొడుకు. నేను కాదు. సరే అలాగే కానివ్వండి. నాకూ ఓ రోజు రాక పోదు. అవాళ నేనేమిటో చూపించకపోను" లేచెళ్లిపోయాడు ముకుందం.

నిస్సహాయంగా బాధగా చూస్తుండిపో యారు నాంచారయ్య.

ఆయనకి ఇద్దరు కొడుకులూ ఒక కూతు రూనూ. వ్యవసాయమే జీవనాధారం. ఒకో సారి పండి మరోసారి పండక ఏదోలా సంసారం ఈడ్చుకొచ్చారు.

పెద్దవాడు కృష్ణారావు. డిగ్రీ చదువుతూం డగా రైల్వేలో ఉద్యోగం వచ్చింది. తర్వా తేవో పరీక్షలు పాసై ఆఫీసరయ్యాడు.

చిన్నవాడు ముకుందం. ఇద్దరి మధ్యా అమ్మాయి. ముకుందం ఎదిగొచ్చేసరికి అమ్మాయి పెళ్లి దృష్ట్యా ఆర్థిక ఇబ్బందుల్లో పడ్డారు నాంచారయ్య.

పరిస్థితంతా వివరించి యస్సెస్సెల్సీ అవ్వగానే టీచర్ ట్రెయినింగుకి వెళ్లమ న్నారు. వెంటనే అంగీకరించాడు ముకుందం. మాస్టారుద్యోగంకన్నా ముందు సమీప టౌన్లో మున్సిపల్ ఆఫీసులో గుమాస్తా ఉద్యోగం రావడంతో అందులో చేరిపోయాడు.

కృష్ణారావు అంచెలంచెలుగా ఎదిగిపో యాడు.

ముకుందం అదే సీటుకి అదే కుర్చీకి అతుక్కుపోయాడు. తన బతుకు గొర్రెతోక కావడానిక్కారణం తండ్రేనని ముకుందం విశ్వాసం. అన్నగారంటే ఇష్టం గనుకే కాలే జీలో చదివించారని అతడి భావన. దాంతో తండ్రంటే విముఖత ఏర్పడింది. సరిగ్గా మాట్లాడడు కూడా.

ఆ సంగతి గ్రహించి తనకి బిడ్డలంతా సమానమేనని నాంచారయ్య పదేపదే చెప్పా లని యత్నిస్తూంటారు. కానతడు వినడు. విన్పించుకోడు.

గాఢంగా నిట్టూర్చారాయన.

సైకిల్ మీద స్కూలునుంచొచ్చాడు బాబు. తాత కన్పించేసరికతడి మొహం వికసిం చింది.

"మీరెప్పుడొచ్చారు తాతయ్యా. నానమ్మ కులాసానా"

"మాకేంరా నిక్షేపంలా వున్నాం. మీ నానమ్మ కూడా వచ్చింది గానీ ఏవిట్రా ఒంట్లో బావోలేదుట. మొన్నేదో హడావిడి చేశావుట"

"ఏం లేదు తాతయ్యా! పాడుకల వచ్చి అరిస్తే మమ్మీ నానారాద్ధాంతం చేసేసింది"

తరచి అడిగేసరికి "డాడీకి యాక్సిడెంట్ జరిగిందని కల..." అని చెప్పేశాడు.

కళ్లు చెమ్మగిల్లగా "నీలాటి కొడుకు లభిం చడం మీ నాన్న అదృష్టంరా" అన్నారు. అయోమయంగా చూశాడు బాబు.

బాబు మాట విన్పించి కనకమ్మ "ఒరే బాబూ" అంటూ వచ్చింది.

"నీ ఆరోగ్యం ఎలావుంది నానమ్మా"

"నాకేవిట్రా కాటికి కాళ్లు చాచుకున్నదాన్ని. కాస్త నీ సంగతి పట్టించుకోరా. చదువు గుండెల్నార్పేస్తుంది. అందుకే చిక్కి సగమై పోయావు చూడు. బలానికేదైనా వాడాలి. మీ నాన్నకి చదువుగోల తప్ప మరేమీ





పట్టదు. రోజూ పొద్దుటే కోడిగుడ్డూ పాలూ తాగరా నాన్నా. తాగుతావా"

"నువ్వు చెబితే కాదంటానా నానమ్మా"

"మా నాయనే మా తండ్రే" మురిసిపోయిందావిడ.

★ ★ ★

"నీతో కథలు చెప్పించుకుని చానాళ్లయింది నానమ్మా. ఇవాళ పేదరాశి పెద్దమ్మ కథ చెప్పాలి" రాత్రి భోజనాలయ్యాక అన్నాడు బాబు.

నవ్విందావిడ. పిల్లలకి కథలు చెప్పడం, కథాకార్యాలకి హారతి పాటలు పాడటం ఆవిడకెంతో ఇష్టం.

"నీకిప్పుడు కావాల్సింది అలాటి కథలుకాదురా. రామాయణ మహాభారతాలు. అందుకనే అవి కొని తెచ్చాను. ఖాళీగా వున్నప్పుడు చదువుకో. మీ నాన్న చూశాడంటే నిన్నూ నన్నూ తిట్టిపోస్తాడు సుమా" అంటూ ఆ రెండు గ్రంధాలూ పెట్టెలోంచి తీసిచ్చింది.

పరమానందపడిపోయాడు బాబు.

"తండ్రిమాట కోసం అడవులకెళ్లి అష్టకష్టాలు పడిన పుణ్యధాముడైన కొడుకు కథ రామాయణం. కొడుకు దుశ్చర్యలు చూసి కూడా చూడనట్టు కళ్లు మూసుకుని కులనాశనానికీ సంతాన వినాశనానికీ కారకుడైన తండ్రి కథ భారతం.."

సరిగ్గా అప్పుడొచ్చాడు ముకుందం. ఆ పుస్తకాలు చూసేసరికి వెర్రికోపం వచ్చేసింది.

"నువ్వు చదవాల్సింది ఇలాంటి పాత చింతకాయ పచ్చళ్లూ, సెంటిమెంట్ల కథలూ కాదురా. చెంఘీజ్ ఖాన్‌ని చదువు. జగజ్జేత అలెగ్జాండర్ గురించి చదువు అంతే" అంటూ ఆ గ్రంధాలని అటకమీదకి విసిరేశాడు.

శిలా ప్రతిమలయ్యారంతా.

"అయ్యో అయ్యో అదేం పనిరా అబ్బాయ్" ముందుగా తేరుకున్న కనకమ్మ అంది గుండెలు బాదుకుంటూ.

పార్వతి కూడా కలవరపడుతూ చూసింది. ఇలా జరిగిందేవిటా అని బాధగా చూసింది. ఏం అశుభం జరుగుతుందోనని ఆందోళన పడింది.

దొరబాబు నిశ్చేష్టుడై తండ్రివంక వింతగా చూస్తుండిపోయాడు. రామాయణ భారతాలు ఆయనకి నచ్చకపోవచ్చు అలా అని చెప్పొచ్చు కానంతగా ఆవేశపడి వాటిని విసిరెయ్యడం ఎందుకో బోధపళ్లేదు వాడికి.

ఏం జరిగిందంటూ వచ్చిన నాంచారయ్య సంగతి విని, "అది మంచి పనికాదురా. రామాయణ భారతాలు నిత్యమూ పారాయణం చేయాల్సిన పవిత్ర గ్రంధాలురా" అన్నారు బాధగా.

"ఇది విల్లంబుల గదల కాలం కాదు. ఇప్పటి కాలానిక్కావాల్సినవి అలాటి పుక్కిటి పురాణాలు కాదు" అన్నాడు ముకుందం.

"యుగ ధర్మాన్నిబట్టి ఆయుధాలు మారి వుండొచ్చు వ్యవస్థలు మారి వుండొచ్చు కాని మానవ సంబంధాలు మారలేదురా. అందుకే అనేక వందల ఏళ్లుగా అవి జనం గుండెల్లో పాదుకుపోయాయి. తండ్రితో, కొడుకుతో, తల్లితో, భార్యతో, సోదరుడితో, స్నేహితునితో, సేవకుడితో ఎలావుండాలో, ఎలా మెలగాలో ఎప్పటికీ విలువైన సత్యాలని తెలియజెప్పాయిరా. మనిషి బతుక్కో అర్థం పరమార్థం కల్పించుకోవడం ఎలాగో కథల రూపంలో వివరించాయిరా"

నవ్వేడు ముకుందం. "ఇది కంప్యూటర్ యుగం. హైటెక్ ప్రపంచం. ఇక్కడ కావాల్సిందీ సాధించాల్సిందీ ఆధునిక సాంకేతిక విజ్ఞానాన్నీ ప్రగతినీను. పెళ్లాం గొడవలూ భూమి గొడవలూ కాదు. కంప్యూటర్ విజర్డ్ బిల్ గేట్స్ రోజు సంపాదన కొన్ని వందల

కోట్లు తెలుసా? "

"డబ్బే పరమావధి అనుకుంటే ఎలారా. డబ్బుతో అన్నీ సాధించుకోగలమనుకోవటం కేవలం భ్రమ. శోధించే కొద్దీ జీవిత సత్యాలు బయటపడే అపూర్వ నిధుల్ని పట్టుకుని అలా మాట్లాట్టం ఏం బావోలే దురా అబ్బాయి"

"మీవన్నీ కాలంచెల్లిన ఆలోచనలు. బూజుపట్టిన భావాలు, అవి మాకక్కర్లేదు. అలాటివి మా అబ్బాయికి సోకడానికి కూడా ఇష్టపడను. మా బాబు దొరబాబు కావాలి. ఎవరూ అధిరోహించని ఎత్తులు ఎక్కాలి. కోటీశ్వరుడు కావాలి..."

"మేం కోరుకునేదీ అదేరా. అలాగని..."

"ఇంకేం చెప్పొద్దు. వాడిది అగ్నిపథం. ఆ పథంనుంచి ప్రక్కకి మళ్ళించే ఎలాంటి చిన్నపనినీ సలహానీ సంఘటననీ కూడా నేను సహించను. ఇష్టంలేనివాళ్ళు తమ భావాలని తమలోనే దాచుకుంటే మంచిది" అనేసి వెళ్ళిపోయాడు ముకుందం.

"ఎందుకిలా ఎవరికీ అర్థంకానంతగా మారిపోతున్నాడు? " అని మథనపడ్డా రంతా.

ఆ సంఘటన పార్వతిలో ఎన్నెన్నో భయాల్ని రేపింది.

భర్త లేకుండా చూసి రామాయణ, భారత గ్రంథాలని అటకమీంచి బయటికి తీసింది. వాటిని పసుపు గుడ్డతో మూట కట్టి కళ్ళకద్దుకుని పాత చెక్కపెట్టె అడుగున దాచేసింది.

"ఈ ఇంటినెలాంటి అరిష్టమూ చుట్టుకో కుండా కాపాడు తండ్రీ" అని దేవుడ్ని ప్రార్థించిందామె.

మరోరోజు వుండి కనకమ్మ, నాంచారయ్య వెళ్ళిపోయారు.





ఆ ఘటన తాలూకు ప్రభావం నుంచి బయటపడ్డానికి బాబుకి మూడు రోజులు పట్టింది. అదైతే మరచిపోయాడుగాని ఏవో తెలీని వింత భయాలు అతడ్ని పూర్తిగా వదల్లేదు.

"ఏదో పోగొట్టుకున్నట్టు దిగులుగా వున్నావేం బాబూ" అనడిగింది సుస్మి.

"అలాటిదేం లేదే"

"మొహం మనస్సుకి అద్దం అంటారు. నీ మొహంలోని భావాలు ఏదో జరిగిందని చెబుతుంటే ఏంజరగలేదని బుకాయిస్తావెం దుకు? నాకు చెప్పకూడదా? "

క్షణకాలం తటపటాయించి జరిగిందంతా చెప్పేశాడు.

సుస్మీ, సరస్వతీ కూడా విస్తుబోయారు.

"అంకుల్ చిత్రమైన మనిషి" అని వ్యాఖ్యానించింది సుస్మి.

"బాబు ఎంతో తెలివైనవాడు. తప్పకుండా ఒక మేధావిగా రూపుదిద్దుకోవడం ఖాయం. కాని అలాటి తండ్రి శల్యసారథ్యంలో ఏమ వుతాడో! పిచ్చివాడి చేతిలోని రాయి ఎటు పడుతుందో తెలీదు. అలాగే ముకుందం చెక్కుతోన్న ఈ చిన్నారి శిల్పం ఏరూపం దిద్దుకుంటుందో ఏమో!" అని భయపడింది సరస్వతి.

తన భయాలు కప్పిపుచ్చుకుని మొహానికి నవ్వు పులుముకుని అంది "కోపంలో గ్రంథాలు విసిరేశారని అంత ఇదవడం అన వసరం. టెన్త్ ఎగ్జామ్స్ దగ్గర పడుతు న్నాయి కదా. మిగతా పుస్తకాలతో కాల క్షేపం చెయ్యకూడదని అంకుల్ ఉద్దేశ్యం. ఏ తల్లి అయినా ఏ తండ్రి అయినా సరే తమ బిడ్డలు ఎంతో గొప్పవారు కావాలనీ కీర్తి ప్రతిష్ఠల్ని ఆర్జించాలనీ కోరుకుంటారు. అందులో అసహజమేమీ లేదుగానీ అలాటి అల్ప విషయాలకి అధిక విలువనిచ్చి విలు వైన సమయాన్ని వృధా చేయకండి"

బాబుమీద ఆ మాటలు బాగా ప్రభావం

చూపాయి. మళ్ళీ మళ్ళీ ఆ దృక్కోణం నుంచి ఆలోచించాడు. సబబే అనిపించింది. మనసు దూదిపింజె అయింది. తేలిగ్గా నిట్టూర్చి రొటీన్లో పడిపోయాడు.

★ ★ ★

బాబు చదువుతోన్న స్కూల్ కెళ్ళి టీచర్లందరినీ కలిసి వచ్చాడు ముకుందం.

అంతా బాబు ర్యాంక్ హోల్డర్ అనీ అతడి వల్ల తమ స్కూలుకి మంచి పేరొస్తుందనీ భావిస్తున్నట్టు చెప్పారు.

మరింతగా సాన బెట్టడానికి సూచనలూ, సలహాలూ ఇమ్మన్నాడు. రిఫరెన్స్ బుక్స్ ఎక్కువగా చదవమనీ ఒక పద్ధతి ప్రకారం చదివించమనీ చెప్పారు.

దొరబాబు దినచర్యని ముకుందమే రూపొందించాడు.

ఉదయం అయిదు గంటలకి లేస్తాడు బాబు. ఒక గంట సేపు చదువుకుంటాడు. ఆరింటికి కాలకృత్యాలు తీర్చుకుని కోడి గుడ్డు, పాలు తాగి ఆరున్నరకి మేథ్స్ ప్రయివేట్ కెడతాడు. తొమ్మిదింటికొచ్చి ఆదరాబాదరా టిఫిన్ చేసి స్కూల్ కెడతాడు.

మధ్యాహ్నం వచ్చి భోంచేసి వెళ్ళి అయిదింటికొస్తాడు. ఆరింటివరకూ విశ్రాంతి. ఆరింటినుంచి ఏడింటివరకూ ముకుందం సేకరించి తెచ్చిన రకరకాల నోట్సులూ మెటీరియల్సూ తిరగేస్తాడు. మంచి పాయింట్లు నోట్ చేసుకుంటాడు. ఏడుగంటలకి భోంచేసి పదింటివరకూ చదువుకుంటాడు. మధ్యలో వేడివేడి పాలు తెచ్చిస్తుంది తల్లి. పదింటికి పడుకుంటాడు.

బాబుని ముకుందం, పార్వతీ కూడా కంటికి రెప్పలా కాపాడుతున్నారు. అతడికేం కావలిస్తే అది అందిస్తున్నారు. అతడు చదువుకున్నంతసేపూ మేల్కొని వుంటున్నారు.

తనకోసం తల్లీ తండ్రీ చేస్తోన్న సేవకి, పడుతోన్న తపనకి చలించిపోతున్నాడు బాబు. వాళ్ళ ఋణం తీర్చుకోలేనిదనీ వారి ప్రేమ అపూర్వమనీ విశ్వసిస్తున్నాడు.

అంతేకాదు, తనకి ర్యాంక్ రావాలన్న వారి పట్టుదల చూస్తోంటే అతడికెంతో భయంగా వుంటోంది. 'ఒకవేళ వారి ఆశల్ని నెరవెర్చలేకపోతే?' అని ప్రశ్నించుకుని తల్లడిల్లిపోతున్నాడు.

ఒక్కోరోజు ఆ ఆలోచనలో నిద్రపట్టదు. అటువంటప్పుడు మెదడులోంచి 'చదువు'ని పక్కన బెట్టడానిగ్గాను సుస్మితని తలచుకుంటాడు.

ఆమెని తలచుకుంటే చాలు పిల్ల తెమ్మెర సోకినట్టు తనువూ మనస్సూ కూడా ఆహ్లాదపడతాయి. ఆమె స్నేహాన్నీ మాటల్నీ మళ్లీ మళ్లీ తలచుకుంటూ ప్రశాంతంగా నిద్రపోతాడు. ఆమెతో కలసి నదిమీద బోటులో అందమైన సాయంకాలాలు షికారెళ్లినట్టూ, సూర్యాస్తమయ సమయాన భూమ్యాకాశాల సరిహద్దు రేఖవరకూ చేయీ చేయీ పట్టుకుని నడిచినట్టూ, చందమామకి వూయల వేలాడదీసి వూగినట్టూ కలలు కంటూ వుంటాడు.

చదువువల్ల ఎంత బిజీగా వున్నా మధ్య మధ్య రామారావు అంకుల్ ఇంటికెళ్తూనే వున్నాడు బాబు. ఆడుతూ పాడుతూ చదువుతూ కూడా సుస్మి చక్కని మార్కులెలా తెచ్చుకొంటోందో టెన్షన్ లేకుండా ఎలా వుండగల్గుతోందో అర్థంగాక ప్రతిసారీ ఆశ్చర్యంగా చూస్తుంటాడామెని.

రోజులు వేగంగా దొర్లిపోయాయి.

యస్సెస్సీ పరీక్షలొచ్చేశాయి. ఆ మర్నాటి నుంచే పరీక్షలు ప్రారంభం.

విపరీతమైన మానసిక ఒత్తిడికి లోనవుతున్నాడు బాబు. ముకుందం పరిస్థితీ

అలాగే వుంది. పూజలూ మొక్కులూ ఎక్కువ చేసింది పార్వతి.

★ ★ ★

హఠాత్తుగా వాతావరణం మారిపోయింది. బంగాళాఖాతంలో వాయుగుండం ఏర్పడింది. కోస్తా అంతటా వర్షాలు భారీగా కురవచ్చుని టీవీలో చెప్పేరు.

వర్షం పెద్దగా రావట్లేదుగాని విపరీత వేగంతో గాలులు హోరుమంటూ వీస్తున్నాయి. ప్రకృతిని కుదిపేస్తున్నాయి.

ఇంటిముందున్న మామిడిచెట్టు కొమ్మలు దెయ్యం పట్టినట్టు వూగిపోతున్నాయి. గాలీ వానా చెట్టాపట్టాలేసుకుని వూపేస్తున్నాయి.

ఆ దృశ్యం చూసిన ముకుందం గుండెలు గుభిల్లుమన్నాయి. మామిడి పిందెలూ ఆకులూ రాలిపడుతున్నాయి.

"అకాలవర్షమేమిటో ఈ పెనుగాలులేమిటో అర్థం కావట్లేదు. ఎన్నడూ లేనిది మామిడి పిందెలన్నీ రాలిపోతున్నాయి. ఏదో అరిష్టం రాబోతోందన్పిస్తోంది"

ముకుందం మాటలకి పార్వతి గుండెలు ఝల్లుమన్నాయి. రామాయణ, భారత గ్రంధాలని ఆయన కోపంగా విసిరెయ్యడం గుర్తొచ్చింది. అందుకు ప్రతిగా ఇలా జరగటం లేదు కదాని తల్లడిల్లింది.

మెరుపు మెరిసింది. ఆ వెలుగులో చెట్టు క్రిందపడి వున్న పిందెల్ని చూసి నీరసంగా కూర్చుండిపోయాడు.

"అలా అయిపోయారేవండీ" కళవళపడింది పార్వతి.

"పంటకి చాలా నష్టం వాటిల్లినట్లే. ఎప్పుడూ ఇలా జరగలేదు. అబ్బాయి పరీక్షలెలా రాస్తాడో"

"దానికీ దీనికీ సంబంధం ఏవిటండీ"

"ఏదో సంబంధ బాంధవ్యం వుందనే అన్పిస్తోంది. మామిడి కాపు బాగా కాసిన ప్రతిసారీ మన పరిస్థితి బాగుంది గుర్తుచేసుకో"

"ఆ చెట్టు నాటినప్పట్నుంచీ మన ఆర్థిక పరిస్థితి బాగున్నమాట నిజమే. బాబుకి అక్షరాభ్యాసం చేసిన రోజునే బజార్నుంచి అంటుమామిడి మొక్కని కొనుక్కొచ్చి బాబు చేత నాటించారు. బాబులానే దినదిన ప్రవర్ధమానమవుతూ ఎదిగింది. నాలుగేళ్లకే కాపుకొచ్చింది"

"మన చెట్టు పళ్లు ఎంతో బావుంటాయని రామారావు కూడా అంటూంటాడు"

"కాయలన్నీ రాలిపోయాయంటారా? "

"అలాగే వుంది మరి!"

ఇంతలో రామారావు గొడుగువేసుకొచ్చాడు. "ఏవిట్రా వర్షంలో వచ్చావేంటీ" ముకుందం అడిగాడు.

"మా సుస్మి వచ్చిందా? "

"రాలేదే... ఏం ఇక్కడికెళ్తున్నానని చెప్పిందా? "

"ఫ్రెండింట్లో నోట్సు వుండిపోయింది తెచ్చుకుంటానని వెళ్లింది. ఇంతలో వర్షం మొదలవడంతో ఎక్కడో ఆగిపోయి వుంటుంది. ఇక్కడుందేమో తీసుకెళ్దామనొచ్చాను"

లోపల చదువుకుంటున్న బాబు చెవిలో పడ్డాయా మాటలు. గబుక్కున లేచొచ్చాడు. "లహరి వాళ్లింటికెళ్లుంటుంది అంకుల్. వాళ్లిల్లు నాకు తెలుసు. నేనొచ్చి చూపించనా"

ముకుందం ఇబ్బందిగా చూశాడు. "వచ్చేస్తుందిలేరా. తనకి ఇంకొకరు చెప్పక్కర్లేదు. నువ్వెళ్లి చదువుకో నాన్నా. తెల్లారితే పరీక్ష కదా"

"సుస్మికి కూడా పరీక్షేకదా డాడీ. పాపం ఎక్కడో చిక్కడిపోయి వుంటుంది. తన ప్రిపరేషన్ దెబ్బతింటుంది"

"ఏం ప్రిపరేషన్ లేహోయ్. పరీక్షలూ పద్ధ




తులూ చూస్తోంటే విరక్తి పుడుతోందనుకో"

రామారావు మాటలకి ముకుందం "ఇప్పుడేవయ్యిందిరా" అనడిగాడు.

"అయితే నీకింకా తెలీలేదా? టెన్త్ పేపర్లు లీకయ్యాయి"

"నిజం? " తుళ్లిపడ్డాడు.

"నిజంరా, యమ్మెల్యేగారి బామ్మర్ది కొడుకు టెన్త్ పరీక్ష రాస్తున్నాళ్లే. ఏదో ట్యుటోరియల్ కాలేజీద్వారా విజయవాడ నుంచి కొనుక్కొచ్చాట్ట"

"పార్వతీ! నా చొక్కా గొడుగూ అందుకో"

"ఇప్పుడెక్కడికిరా? పోలీసు రిపోర్టు ఇస్తావా? వాళ్లూ వాళ్లూ ఒకటేలే. ఏమీ పట్టించుకోరు"

"అందుక్కాదు, యమ్మెల్యేగారి బామ్మర్ది ఇంటికి"

"మొద్దు స్వరూపాలగ్గాని మీ వాడికెందుకు? "

"ర్యాంక్ మరొకరు తన్నుకుపోకూడదు. అందుగ్గాను ఆ ప్రశ్నలేవిటో మనకీ తెలియాలి"

"అయితే మాత్రం ఇలా అడ్డదారి తొక్కాలా? "

"ఎలా సాధించామన్నది ముఖ్యంకాదు. సాధించడమే ముఖ్యం. ఇదీ యుద్ధంలాంటిదేరా. విజయమే దీని గీటురాయి"

చీకట్లోకి గాలినీ వాననీ చీల్చుకుంటూ దూసుకెళ్లిపోయాడు ముకుందం.

మామిడి చెట్టు జాలిగా చూస్తుండిపోయింది.

★ ★ ★

వర్షంలో నిలువునా తడిసిపోతూ వచ్చాడు ముకుందం.

అయితేనేం అతడి మొఖం దేదీప్యమానంగా వెలిగిపోతోంది.

బనీనుక్రింద మైకా సంచిలో పెట్టి దాచిన పరీక్ష పేపర్లని బయటికి తీసిచ్చాడు.

అమితాశ్చర్యంగా చూశాడు దొరబాబు.

"లీకైన పేపర్లురా. అతి కష్టంమీద తెచ్చాను. ఇవే చదువు"

"నాకన్నీ వచ్చు డాడీ"

"వస్తే చాలదురా వున్నదున్నట్టు కాగితం మీద పెట్టాలికదా! కొన్నే చదివినప్పుడు అక్షరం కూడా వదలకుండా రాయొచ్చు అంచేత వీటికే జవాబులు చదువు"

"ముందు బట్టలు విప్పి తలతుడుచుకోండి జలుబుచేస్తుంది" టవల్ అందిస్తూ అంది పార్వతి.

"నాకేం చేసినా ఫర్లేదు. బాబుకి స్టేట్ ర్యాంక్ రావాలి. వచ్చి తీరుతుంది చూస్తూండు"

బట్టలు మార్చుకుని తల తుడుచుకుంటూ వచ్చి కొడుకు దగ్గర కూర్చున్నాడు.

దొరబాబు ఎంతో నీరసంగా నిరుత్సాహంగా చదువుకొంటున్నాడు. ఏదో దొంగతనం చేసినట్టు గిల్టీగా వుంది వాడికి.

ఇద్దరికీ వేడివేడి టీ తెచ్చిచ్చింది పార్వతి.

హఠాత్తుగా ఏదో ఆలోచన రాగా అన్నాడు బాబు, "ఈ ప్రశ్నలు సుస్మికి కూడా చెప్పొస్తాను డాడీ"

"నోర్ముయ్!" విపరీతమైన కోపం రాగా అరిచాడు.

బిక్కమొఖం పెట్టేడు బాబు.

తననితాను సంబాళించుకుంటూ అన్నాడు, "ఎంతో బ్రతిమాలి ప్రాధేయపడి ఎవరికీ చెప్పనని మాట ఇచ్చి తీసుకొచ్చాన్రా. అలా కానీ వాళ్లందరికీ చూపిస్తానంటావేంటి"

బాబు మొఖం ఎర్రబడింది. తలొంచేసుకున్నాడు. వాడి మనస్సు గాయపడిందని విలవిల్లాడింది తల్లి.




"సుస్మిత మనింట్లోని అమ్మాయిలాటిది. పోనీ చెబితే"

"ష్... ఎవరికీ చెప్పేదిలేదు. ఇది పోటీ ప్రపంచమే. ఎక్కడో వున్న వాళ్లతోనే కాదు పక్కనున్న వాళ్లతోనూ పోటీయే. ఆ సంగతి మరచిపోవద్దు"

మరెవరూ మాట్లాడ సాహసించలేకపో యారు.

మర్నాడు బాబుని సైకిలు మీద పరీక్ష హాలుకి తీసుకెళ్లాడు ముకుందం. ఎన్నో జాగ్రత్తలు చెప్పి పంపేడు.

అతడు తిరిగొచ్చేవరకూ గేటు దగ్గరే తచ్చాడుతూండిపోయాడు.

బెల్ కొట్టారు.

ఒక్కొక్కరూ బయటికొస్తోంటే ఆత్రంగా చూస్తూ నిలబడ్డాడు. బాబు కంటబడగానే గబగబా ముందుకెళ్లి "నూటికి నూరూ వస్తాయికదా" అనడిగాడు.

బాబు తలాడించగానే తృప్తిగా నిట్టూర్చి, "అవే వచ్చాయికదూ" అనడిగాడు.

మళ్లీ తలాడించగా, "నాకు తెలుసురా. మన గురించే లీకయ్యింది" అన్నాడు పర మానందపడిపోతూ.

నాలుగు పరీక్షలయ్యాయి. లీకైన పేపర్లే వచ్చాయి. బాబు వాటిని మరెవరికీ లీక్ చెయ్యకుండా ఒకరకంగా కాపలాగా వున్నాడు ముకుందం.

హఠాత్తుగా పేపర్లు అవుటయిన సంగతి బయటపడింది. జరిగిన పరీక్షల్ని రద్దుచే శారు. ఎలా లీక్ అయ్యాయో దర్యాప్తు చెయ్యమని ప్రభుత్వం ఆదేశాలిచ్చింది.

బాబు చాలా సంతోషించాడు. కాని ముకుందం హతాసుడయ్యాడు. కాయలు రాలిన మామిడి చెట్టు కింద దిగులుగా బాధగా నిధిని పోగొట్టుకున్న వాడిలా కూర్చుండిపోయాడు.

కాస్సేపటికొకతను పరుగునొచ్చాడు. అతణ్ని గుర్తుపట్టాడు ముకుందం.

యమ్మెల్యేగారి బామ్మర్ది దగ్గర పనిచే స్తూంటాడతడు.

"ఏవిటిలా వచ్చారు? "

"నీకోసమేనయ్యా బాబూ. అవతల కొంప లంటుకున్నాయి. లోపలికి పద చెబుతాను"

ఇంట్లోకెళ్లి తలుపు వేసి "ఈ గోడలకి చెవుల్లేవుకదా" అన్నాడు అనుమానంగా చుట్టూ చూస్తూ.

"మా స్వంత ఇల్లయ్యా..." అనింకేదో అనబోతోంటే కట్ చేశాడతడు "లీకైన పేపర్ల కాపీలు నీ దగ్గరున్నాయిగా. వాటిని వెంటనే తగలబెట్టు చెబుతా"

ఏదో జరక్కూడనిది జరిగిందని అర్థమై పోగా గబగబా ఆ పేపర్లన్నీ తెచ్చి మండు తోన్న పొయ్యిలో పెట్టేశాడు ముకుందం.

పార్వతి అయోమయంగా చూస్తూండిపో యింది.

"దర్యాప్తు గట్టిగా చేస్తున్నారు. జాగ్రత్తగా వుండాలి"

ముచ్చెమటలు పోస్తోంటే తలాడించాడు.

"లీకేజి కేసుని యాంటీగూండా స్క్వాడ్ వాళ్లు దర్యాప్తు చేస్తున్నారు. నిల్చున్న పళాన అరెస్టు చేసి తీసుకుపోయే అధికారం వాళ్ల కుంది. వాళ్లెవరైనా నిన్ను ప్రశ్నిస్తే యమ్మె ల్యేగారి బామ్మర్ది పేరు బయటపెట్టొద్దని మరీమరీ చెప్పమన్నారు"

"అలాగలాగే"

"ఓ పది రోజులపాటు మీరు ఏ మారు మూల ప్రదేశానికైనా వెళ్లి దాక్కుంటే మంచిది. లేకపోతే ప్రమాదం ఎట్నుంచైనా రావచ్చు ఎటు తిరిగి ఎటొచ్చినా సరే మా అయ్యగారి పేరు మాత్రం బయటికి రాకూ డదు జాగ్రత్త" చిన్నసైజు హెచ్చరిక చేసి వెళ్లిపోయాడు.

ఒకవేళ విషయం తెలిసి పోలీసులొచ్చి

తననీ బాబునీ అరెస్టు చేస్తే?

బాబు బంగారు భవిష్యత్తు కాస్తా...!?

విపరీతమైన భయంతో వణికిపోయాడు.

మరో అరగంటలో భార్యాబిడ్డల్ని తీసుకుని బస్సెక్కేశాడు ముకుందం.

★ ★ ★

పలుకూపత్రం లేకుండా వూడిపడిన కొడుకూ కోడళ్లని చూసి ఆశ్చర్యచకితులయ్యారు నాంచారయ్యా కనకమ్మా.

కాళ్లు కడుక్కోడానికి నీళ్లిచ్చి, "బాబూ... పరీక్షలు బాగా రాశావుట్రా" అనడిగింది కనకమ్మ.

"మా పరీక్షలు వాయిదాపడ్డాయి నానమ్మా" జవాబిచ్చాడు బాబు.

"సరిగ్గా పరీక్షలు నిర్వహించడం కూడా చాతకాదు. ఇంకేం పరిపాలిస్తారో జనాన్నేం ఉద్ధరిస్తారో ఆ భగవంతుడికే తెలియాలి" అన్నారు నాంచారయ్య. ఆ వెంటనే "అసలెందుకు వాయిదా వేశార్టరా" అనడిగాడు కొడుకుని.

"కొన్ని పేపర్లు అవుటయ్యాయిట"

"అదీ అయ్యిందీ... ఇలాటివెన్నడూ వినెరగం. అంతా కలికాల మహిమ. డబ్బుకి నీతీనిజాయితీల్ని అమ్ముకునే వాళ్లెక్కువైపోయారు. నన్నడిగితే అవుట్ చేసినవారిని కాదుగాని వాటిని కొన్నవారిని కఠినంగా దండించాలంటాను"

మొఖాన గంటుపెట్టుకుని "ఆ గొడవలు మనకెందుకులెద్దూ" అని లోపలికెళ్లిపోయాడు ముకుందం.

నానమ్మ ఇచ్చిన పాలు తాగి ఊరుమీద పడ్డాడు బాబు.

బాబుకి పల్లెటూళ్లంటే ఎంతో ఇష్టం. పచ్చని పొలాలు, పండ్ల తోటలు, పరుగెత్తే కాలువలు, చెమటోడ్చే జనం, పాటలు పాడే పక్షులు, ఆప్యాయంగా పలకరించే మనుషులు అదీఇదీ అనిలేదు అన్నీ ఎంతగానో నచ్చుతాయి. చిన్నప్పట్నుంచీ కూడా వీలు చిక్కినప్పుడల్లా తాతగారి పల్లెకి వెళ్లాలని చూసేవాడు. చాలాసార్లు కుదరనిచ్చేవాడు కాదు తండ్రి.

ఊరంతా ఓ రౌండు కొట్టి అదే వూళ్లో వుంటోన్న మేనత్త ఇంటికెళ్లాడు. బాబుని చూసెంతో మురిసిపోయిందావిడ.

ఊళ్లోకి వచ్చి రెండు గంటలైనా తమ్ముడు తొంగిచూడనందుకు నొచ్చుకుంటూనే "నువ్వయినా మేనత్తని గుర్తు పెట్టుకున్నావు. అదే పదివేలు" అంది.

అప్పటికప్పుడు నెయ్యి కాచి సున్నుండలు చేసి పెట్టింది.

మేనత్త కూతురు కాత్యాయిని బావని చూసి సిగ్గుపడి దాక్కుండిపోయింది. అతడున్నంతసేపూ బయటికే రాలేదు. సిగ్గుగా నవ్వుకున్నాడు బాబు.

కాస్సేపుండి కబుర్లు చెప్పి ఇంటికొచ్చేశాడు.

"బలాదూర్లు తిరగటానికొచ్చావా ఇక్కడికి? వెళ్లు, వెళ్లి పుస్తకాలు తియ్యి. పరీక్షలింకా అవ్వలేదని మర్చిపోకు" అన్నాడు కోపంగా ముకుందం.

"ఇంతక్రితమే కదుట్రా వచ్చిందీ. రేపట్నుంచి చదువుకుంటాళ్లే" అని నాంచారయ్య కల్పించుకున్నా విన్లేదు.

మొఖం మాడ్చుకుని పుస్తకం తీసుకుని కూర్చున్నాడు బాబు.

కాస్సేపటికి ముకుందం బావ కామేశ్వర్రావు వచ్చారు. వస్తూనే "ఇన్నాళ్లకీ పల్లెటూరు గుర్తొచ్చిందన్నమాట. మా అల్లుడేడి ఎక్కడా కన్పించడేం" అన్నారు బాబునుద్దేశించి.

"ఇప్పట్నుంచీ అలా వరుసలు కలపడం నాకిష్టంలేదు బావా"





ముకుందం మాటలకి ప్రాన్పడిపోయాడా యన. తేరుకుని నవ్వేస్తూ, "పైకి అన్నా అన కపోయినా వరసవరసేకదా" అన్నాడు.

"అలా ఆశలు కల్పించడం నాకిష్టంలేదు"

కామేశ్వర్రావు మొఖం పాలిపోయింది. మారుమాట్లాడకుండా పైపంచె దులిపి లేచి వెళ్లిపోయారు.

"అవేం మాటల్రా అబ్బాయ్. వరసైనవా డని ఏదో అంటే..." అంది తల్లి.

"ఇవాళలాగే అంటారు. రేపు పెళ్ళీడొ చ్చాక చిన్నప్పట్నుంచీ అనుకుంటున్న సంబంధం అంటూ పీక పట్టుకుంటారు. నాకిలాటివి నచ్చవు"

"కాత్యాయిని కూడా చదువుకొంటోంది. బావ పరిస్థితి బాగానే వుంది..." అనింకేదో నాంచారయ్య చెప్పబోతోంటే అడ్డుకున్నాడు ముకుందం.

"వాళ్ళెంత ఎదిగినా నాతో సరితూగలేరు. బాబు దొరబాబు నాన్నా. దొరల్ని మించిపో తాడు. విదేశాలకెళ్ళి కళ్ళు మిరుమిట్లు గొల్పేంతగా వెలిగిపోతాడు. అప్పుడు వాడ్ని చూట్టానికి రెండుకళ్ళూ చాలవనుకో. అలా టివాడికి ఈ పల్లెటూరి సంబంధం చేస్తానా? ఛస్తే చెయ్యను"

ఒక మహాస్వప్నం తన కళ్ళముందు ఆవి ష్కరింపబడుతోంటే సంభ్రమంగా ఆనందో ద్వేగంతో చెప్పాడు ముకుందం.

అతడివంక వింతగా భయంగా చూస్తుం డిపోయారంతా.

★ ★ ★

యస్సెస్సీ ఫలితాలొచ్చాయి.

దొరబాబూ, సుస్మితా ప్రథమశ్రేణిలో పాసయ్యారు.

ర్యాంక్ విద్యార్థుల పేర్లలో దొరబాబు పేరు కన్పిస్తుందేమోనని కళ్లల్లో కాగడాలు వెలిగించుకొని మరీ వెదికాడు ముకుందం. ఎక్కడా కన్పించకపోయేసరికి సర్వం కోల్పో యినవాడిలా అయిపోయాడు నిస్త్రాణగా కుర్చీకు జేరబడ్డాడు.

"అలా అయిపోయారేవండీ" ఆందోళనప డింది పార్వతి. "అబ్బాయి ఫస్ట్‌క్లాస్‌లో పాస య్యాడుగా" అని కూడా అంది.

పేలవంగా నవ్వాడు.

"ఇదిగో ఈ నాలుగు పేజీల్లోనూ వున్న నెంబర్ల వాళ్ళంతా ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యారు. ఇది మన జిల్లా రిజల్ట్స్ మాత్రమే. రాష్ట్రం మొత్తంమీద కొన్ని లక్షలమంది ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యుంటారు. నా కొడుకు వాళ్ళలో ఒక్కడు మాత్రమే"

ఆమె మరి మాట్లాడలేకపోయింది.

"చాలా బాగా రాశాను డాడీ. మార్కులు బాగా వస్తాయి" అన్నాడు దొరబాబు.

ర్యాంక్ రాకపోయినా మార్కులు బాగా వచ్చాయేమో?

ఏదో ఆశ ఆశపెట్టగా హైదరాబాద్‌లో వున్న బంధువులకీ మిత్రులకీ మార్కుల వివరాలు కనుక్కోమని ఉత్తరాలు రాశాడు. ఫోన్లు చేశాడు.

కానీలోగానే స్కూల్ వాళ్ళు వివరాలు సేక రించారు. 545 మార్కుల్తో జిల్లాకి ప్రథము డిగా వచ్చాడు దొరబాబు. వెంటనే ఫలానా స్కూలువిద్యార్థి జిల్లాకి ఫస్ట్ వచ్చాడంటూ పత్రికలకి వార్తనందించారు.

దొరబాబు ఫొటోతోపాటు అన్ని పత్రి కలూ ఆ వార్తని ప్రముఖంగా ప్రచురిం చాయి.

పేపర్లో కొడుకు ఫొటోచూసి పరమానంద పడిపోయింది పార్వతి.

సుస్మితా, రామారావూ వచ్చి బాబుని ప్రత్యేకంగా అభినందించారు.

"కొంచెంలో మిస్సయివుంటుంది. లేక పోతే స్టేట్ ర్యాంక్ వచ్చేదే. ఇప్పుడైనా

మొదటి ర్యాంకుల్లో తప్పకుండా నీపేరు వుండివుంటుంది" అంది సుస్మిత.

"మీ అమ్మానాన్నా మీ స్కూలువాళ్ళూ మాత్రమే కాదోయ్ ఈ ఊరివాళ్ళందరమూ కూడా నీ విజయానికి గర్విస్తున్నాం. వుయార్ ప్రౌడ్ ఆఫ్ యూ. మున్ముందు నువ్వు సాధించబోయే విజయాలకిది నాంది అని భావిస్తున్నాం" అన్నారు రామారావు.

బాబు ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయ్యాడు.

ముకుందం మాత్రం మౌనంగా వారి మాటలు వింటూండిపోయాడు.

వాళ్ళెళ్ళాక అన్నాడు, "వాళ్ళ పొగడ్తలకి ఉబ్బితబ్బిబ్బవ్వాల్సిన పనిలేదురా. అవి రొటీన్ అభినందనలు. నాకు మాత్రం గొప్పగా లేదు. నీకు చిత్రంగా అనిపించొచ్చు కానది నిజం. నేను యాంబిషస్ మేన్‌ని. నా కొడుకు చాలా ఎత్తులకి ఎవరూ ఎక్కలేనంత ఉన్నత శిఖరాలకి చేరుకోవాలన్నది నా ఆశ, ఆకాంక్ష, ఆరాటం. అందుకు అరంగుళం తక్కువ సాధించినా నాకు తృప్తి కలగదు"

బాబు ఖిన్నుడయ్యాడు. "ఈసారి తప్పకుండా మీ ఆశల్ని నెరవేరుస్తాను డాడీ"

అతడి ముఖం వెలిగిందొక్కసారే. "శుభం. ఇప్పుడు నువ్వు నాకు నచ్చావురా. రా... మామిడిచెట్టుకింద కూర్చుందాం"

రెండుకుర్చీలు తీసుకెళ్ళి చెట్టునీడలో వేసుక్కూర్చున్నారు.

చెట్టు కాండాన్నీ కొమ్మనీ ఆకుల్నీ అభిమానంగా చూస్తూ అన్నాడు, "ఈ చెట్టుని నీకు అక్షరాభ్యాసం చేసిన రోజున పాతేనురా. అంటే నీ చదువుతోబాటే ఎదుగుతోందన్న మాట. నువ్వు హైస్కూల్లో అడుగుపెట్టినప్పుడు తొలి కాయకాసింది. చిత్రమేమిటంటే మొదట్నుంచీ నువ్వు ప్రతి క్లాసులోనూ ఫస్టో సెకండో వస్తున్నావు. మామిడి కాపు కూడా బాగుంటోంది. ఈసారి తుఫాను రావడంతో కాపు దెబ్బతింది. పేపర్లు లీకవడం, రద్దవడం మళ్ళీ జరగటంవల్ల స్టేట్ ర్యాంక్ కొద్దిలో తప్పిపోయింది. అంటే ఒకరకంగా నీచదువుకీ నా ఆకాంక్షకీ ఈ చెట్టు ప్రతీకనుకో"

బాబు మాట్లాడలేదు. ఈ ఉపోద్ఘాతం దేనికో అని ఎదురు చూస్తున్నాడు.

"ఈ వర్షాకాలం ఎరువులూ పేడావేసి చెట్టుకి బలం చేకూర్చాలి" అన్నారు. "నువ్వు కూడా రెట్టింపు కష్టపడాలి. రాత్రీపగలూ కూడా పఠించాల్సిన తారకమంత్రం ఒకటే. చదువు చదువు చదువు.... అది తప్ప మరేధ్యాసా వుండకూడదు. మరెటూ నీ దృష్టి మరల్చకూడదు. అలా చేస్తానని నాకు ప్రామిస్ చెయ్యి"

భయంగా చూస్తూ అదుర్తోన్న గుండెల్తో తండ్రిచేతిలో చేయి వేశాడు బాబు.

★ ★ ★

సుస్మితా వాళ్ళింటికెళ్ళాడు బాబు.

"ఏమోయ్ హీరో. ఏ కాలేజీలో చేర్తున్నావు" సరస్వతి అడిగింది.

పేపర్లో అతడి ఫొటో వచ్చినప్పట్నుంచీ ఆమె అలాగే పిలుస్తోంది. సిగ్గుపడ్తూ, "డాడీ ఇంకా డిసైడ్ చెయ్యలేదు ఆంటీ" అన్నాడు.

కాలేజీలో అడ్మిషన్‌కి అప్లికేషన్ ఫాం పూర్తిచేస్తోన్న సుస్మిత అతడ్ని చూసి పలకరింపుగా నవ్వింది.

"నేను బైపిసి గ్రూపు తీసుకుంటున్నాను. నువ్వు? "

"మా డాడీ ఏమీ చెప్పలేదు"

"కాలేజ్‌కొచ్చాక కూడా డాడీ కూచివేనా. నీకు దేనిమీద ఆసక్తివుంటే అందులో చేరు" అంది సరస్వతి ప్లేటులో ఇన్ని చేగోడీలు వేసి తెచ్చిస్తూ.

ఆవిడెళ్ళాక "నీకే గ్రూపు తీసుకోవాలనుంది" అనడిగింది సుస్మిత.




# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

ఎడిటర్:

# చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

# చతుర సమీక్ష



ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలుబడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాదు-500 082 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ.100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

## కూపన్

అక్టోబర్ చతుర నవల *డాలర్...! డాలర్...!*

సమీక్షకుని పేరు : ______________________

చిరునామా ______________________

______________________

______________________

"నాకూ బైపీసీయే ఇష్టం. బోటనీ మరీ మరీ ఇష్టం. కానీ డాడీ ఏమంటారోమరి"

"ఇంజనీరు కావాలంటే యంపీసీ, డాక్టర్ కావాలంటే బైపీసీ తీసుకోవాలి. నాకు డాక్టర్ కావాలనుంది. అందుకే బైపీసీ తీసుకుంటున్నాను. డాక్టరైతే ఎందరికో సాయపడొచ్చు పైగా ప్రాణాలు పోసే డాక్టర్లు దేవుళ్ళతో సమానంకదా. అందుకని డాక్టర్ని కావాలనుకుంటున్నాను. మరి నువ్వు? "

బాబు జవాబివ్వలేదు. నిజానికా రకంగా ఆలోచించలేదెప్పుడూ. ఇప్పుడాలోచిస్తోంటే తనకీ డాక్టరైతే బావుణ్ణనిపిస్తోంది.

"ఏవిటాలోచిస్తున్నావు? "

"నాక్కూడా డాక్టరైతే మంచిదనిపిస్తోంది"

"ఇంకొకళ్ళు చేరారనో మరెవరో చెప్పారనో మనం చేరకూడదు. మనకేది ఇష్టమో మనం ఎటు ప్రయాణించదలిచామో బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రావాలి. ఇవ్వాల్టి మన నిర్ణయం మీద మన భవిష్యత్తూ, వృత్తీ, ఉద్యోగం, సేవ, సంపాదన అన్నీ ఆధారపడి వుంటాయి. అంచేత అన్నివిధాలా ఆలోచించి సరైన మార్గాన్ని, మనకిష్టమైన మార్గాన్ని ఎంచుకోవాలి"

ఆమె వంక అబ్బురంగా చూశాడు. ఆమె ఇంత చక్కగా ఎలా ఆలోచించగలదని అచ్చెరువొందాడు.

"ప్రతీదీ ఇంత బాగా ఎలా విశ్లేషించగలుగుతావు? "

మందహాసం చేసింది.

."అది మా అమ్మానాన్నల పెంపకమహత్యం. మొదట్నుంచీ కూడా మా అభిప్రాయాలని గౌరవిస్తూ వ్యక్తిత్వాన్ని ప్రోత్సహిస్తూ ప్రతీదాని గురించీ తార్కికంగా ఆలోచించేట్లు నేర్పగలిగారు. బైపీసీ గ్రూపు తీసుకునే సంగతే చూడు. నేనా గ్రూపు తీసుకుంటాననగానే 'ఎందుకు ఏవిటి ఎలా అదే ఎందుకు యంపీసీ ఎందుక్కాదు' అంటూ ప్రశ్నలు గుప్పించారు. వాటికి సమాధానాలు నాకోణం నుంచి చెప్పాను. మధ్య మధ్య సూచనలూ సలహాలూ ఇస్తూ నా ఆలోచనలని సరిదిద్దారు. ఒకదారిలో పెట్టారు. కడకి నా అభిప్రాయాలని బట్టీ ఆకాంక్షల దృష్ట్యానూ డాక్టరీ చెయ్యడమే మంచిదని అంగీకరించారు"

"యూ ఆర్ లక్కీ"

"అవున్నిజమే. ఎక్కడో చదివాను. పదేళ్ళ దాకా పిల్లల్ని యువరాజులా పెంచాలిట. ఆ తర్వాత పదిహేనేళ్ళు వచ్చేదాకా బానిసలా చూడాలిట. అటు పిమ్మట స్నేహితుళ్ళా ఆదరించాలట. మా పేరెంట్స్ అచ్చం అలాగే వుంటారు"

"నేను కూడా మా డాడీతో మాట్లాడి ఒప్పిస్తాను. ఇవాళే కాలేజీకెళ్ళి అప్లికేషన్ తెచ్చుకుంటాను" అన్నాడు.

ఇంటికెళ్ళి భోంచేస్తూ "సుస్మిత డాక్టరవుతుందిట. నేనూ డాక్టర్ని అవుతాను మమ్మీ" అన్నాడు తల్లితో.

"బాగానే వుంటుందనుకో. కానీ మీ డాడీ మనస్సులో ఏముందో మరి. నీ గురించి అన్ని పథకాలూ ముందే సిద్ధంచేసుకుంటారాయన"

కాస్సేపటికొచ్చాడు ముకుందం.

కొడుకు ఆలోచన గురించి పార్వతి చెప్పింది.

"అదేం లాభంలేదురా. ఇదివరకు విదేశాలకెళ్ళడానికి డాక్టర్లకెక్కువ అవకాశం వుండేదన్న మాట నిజమే. కానిప్పుడు వారికి డిమాండ్ లేదు. వారి సంపాదనా పడిపోయింది. ఇక్కడే చూస్తున్నావుగా సందుకో డాక్టర్ వుంటున్నాడు. ఈగలు తోలుకుంటూ కూర్చునేవాళ్ళే ఎక్కువ. అంచేత నువ్వు ఇంజనీరువి కావాలని ఎప్పుడో నిర్ణయించేశాను"

దెబ్బతిన్నట్టు చూశాడు బాబు. కళ్ళల్లో

అంతులేని నిరాశ తొంగిచూసింది. సన్నని కన్నీటి పొర లీలగా కదిలింది. తలొంచేసు కున్నాడు.

అతనిలో చెలరేగుతున్న భావసంచల నాన్ని పట్టించుకోలేదు ముకుందం.

"ఈజీగా అమెరికా వెళ్ళాలన్నా, తక్కువ కాలంలో కోట్లకి పడగెత్తాలన్నా అది ఇంజి నీరింగు వల్లనే సాధ్యంరా. రాబోయే కాల మంతా ఎలక్ట్రానిక్స్‌దేరా. నువ్వు ఎలక్ట్రానిక్స్ ఇంజినీరువి అయి తీరాల్సిందే. ఇంకెలాంటి వెధవాలోచనలూ పెట్టుకోకు" తెగేసి చెప్పే శాడు.

"మీ డాడీకన్నీ బాగా తెలుసురా. ఆయన చెప్పినట్టు విను" అంది తల్లి.

"అంతేకాదు. వచ్చేవారమే ప్రయాణం. గుంటూర్లోని రెసిడెన్షియల్ కాలేజీలో చేరు స్తున్నాను"

తుళ్ళిపడ్డారు తల్లీకొడుకులు.

"ఇక్కడా మంచి కాలేజీలే వున్నాయిక దండీ"

"ఇవన్నీ వానాకాలపు చదువులు చెప్పే కాలేజీలు. ఇవేం లాభంలేదు. బాబుకి బెస్ట్ ఎడ్యుకేషన్ ఇప్పించాలంటే గుంటూర్లో చేర్చాల్సిందే. రెసిడెన్షియల్ కాలేజీల్లో చదివి నవాళ్ళకే ర్యాంకులొస్తాయి. వాళ్ళు తీసుకునే శ్రద్ధాసక్తులలాటివి"

నీరసంగా కూలబడింది పార్వతి. "బాబుని విడిచి వుండలేనండి..."

"బాబుకి గొప్ప భవిష్యత్ వుండాలంటే ఇలాంటివి భరించక తప్పదు"

మరి బదులివ్వలేదు. కొడుకు తల నిమురుతూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

తల్లినీ తండ్రినీ సుస్మినీ స్నేహితుల్నీ ఊరునీ విడిచి దూరంగా వెళ్ళాలనిలేదు బాబుకు. హాస్టల్లో బిక్కుబిక్కుమంటూ వుండాలంటేనే ఎంతో భయంగా అన్పి స్తోంది!

అయినా పెదవి విప్పలేదు బాబు. ఎప్పి ప్రయోజనం వుండదని తెలుసు.



**బా**బుని గుంటూర్లోని రెసిడెన్షియల్ కాలేజీలో చేర్చి వచ్చాడు ముకుందం.

హాస్టల్లో వుండటానికావల్సిన సామాగ్రిని కొనిచ్చి వచ్చేస్తోంటే బేలగా చూశాడు బాబు.

"బాబూ! నువ్విప్పుడు హైస్కూలు కుర్రా డివికాదురా. కాలేజీ యువకుడివి. దొరబా బులా ఫోజులు కొడుతూ వుండాలిగానీ అత్తింటికెళ్ళే ఆడపిల్లలా కన్నీళ్ళు పెడతా వేంట్రా. షేమ్ షేమ్!"

కళ్ళు తుడిచేసుకున్నాడు బాబు.

"భేష్. అదీ పైకొచ్చేవాడి లక్షణం. ఇవ్వా ళ రేపు ఒంటరిగా వుండాల్సొచ్చినందుకు దిగులుగా వుంటుంది. ఆ తర్వాత వీళ్ళంతా స్నేహితులైపోతారు. మమ్మల్ని మర్చిపో తావు. వీళ్ళంతా నీలా అమ్మానాన్నల్ని వదిలి వచ్చినవాళ్ళేకదా"

క్యాంపస్‌లోని విద్యార్థినీ విద్యార్థుల్ని చూసి ధైర్యం తెచ్చుకోడానికి ప్రయత్నిం చాడు.




"ఒక్క సంగతి నువ్వెప్పుడూ జ్ఞాపకం పెట్టుకోవాలి. వీళ్ళంతా రాష్ట్రం నలుమూలల్నుండీ వచ్చారు. ఎమ్సెట్‌లో ర్యాంక్ సంపాదించడమే వీళ్ళందరి ఏకైక ధ్యేయం. వీళ్ళంతా నీకూ నువ్వు వీళ్ళకీ పోటీయే. మీరంతా ఇప్పుడు కేవలం సైనికులు. మీలోని కొందరే యుద్ధంలో గెలిచి విజేతలవుతారు. కొందరే ఎందుకవుతారన్నది బాగా ఆలోచించాల్సిన ప్రశ్న..."

ఆగి ఏమంటావన్నట్లు చూశాడు. బాబులోని ఆసక్తి చూసి సంతృప్తిపడ్డాడు.

'కఠోర పరిశ్రమ, ఏకాగ్రత ఈ రెండే నిత్యం పదును పెట్టాల్సిన ఆయుధాలు. వాటిని అస్త్రశస్త్రాలుగా ధరించినవారే లక్ష్య సాధన చెయ్యగల్గుతారు. విజేతలూ జగజ్జేతలూ కాగలరు"

అర్థమైనట్టు తలాడించాడు బాబు. మరిన్ని జాగ్రత్తలు చెప్పి వచ్చేశాడు.

ఇంట్లోంచి ఒక్కసారే ఎంతోమంది వెళ్ళిపోయినట్టు అన్పించింది ముకుందం దంపతులకి. మామిడిచెట్టు కూడా దిగులుగా కన్పించింది.

లేని ఉత్సాహం తెచ్చుకుంటూ వూరంతా తిరిగి వచ్చాడు ముకుందం. కన్పించినవారి కల్లా తన కొడుకుని గుంటూర్లో చేర్పడం ఓ ఘనకార్యంలా వర్ణించి చెప్పాడు.

"తర్వాతెలాగూ హాస్టల్లో వుంచి చదివించ కతప్పదు. ఇప్పట్నుంచీ అనవసరపు ఖర్చు కదా" అన్నాడు రామారావు.

నవ్వేశాడు ముకుందం. "ఖర్చే కానీ అవసరమైన ఖర్చు. ర్యాంకులు రావాలంటే తప్పదు మరి. మా వాడు జిల్లాకి ఫస్టొచ్చాడని కొంచెం ఫీజు రాయితీ కూడా ఇచ్చార్లే"

"ఎందుకివ్వరు. బాబులాంటి వాళ్ళే ఆ కాలేజీల కీర్తికీ తద్వారా వ్యాపారాభివృద్ధికీ లాభాలకీ అసలు సిసలు పెట్టుబడి. బాబు అక్కడేకాదు ఇక్కడ చదివినా ర్యాంకు వస్తుంది"

"అలాంటి రిస్కు తీసుకోదలచలేదు"

"కానీ ఆర్థికంగా నీకు చాలా బరువవుతుంది కదా"

"అన్నిటికీ ఆ భగవంతుడే వున్నాడు. నువ్వేమీ అనుకోనంటే నాదో సలహా"

"చెప్పరా"

"సుస్మితని బైపీసీలో చేర్పావటకదా. అది శుద్ధవేస్ట్. మెడిసిన్లో సీట్లు తక్కువ. పోటీ బాగా ఎక్కువ. ఇంతా చేసి మెడిసిన్ పూర్తి చేసినా సరైన ఉద్యోగమూ రాదు. వచ్చినా చాలినంత సంపాదన వుండదు. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. నా మాటవిని ఎంపీసీలోకి మార్పించెయ్యి"

"సుస్మితకి డాక్టరవ్వాలని కోరికగా వుంది"

"పిల్లకాకికేం తెలుసు వుండేలు దెబ్బ?"

"వాళ్ళు పిల్లలుకాదు, కాకులూ కాదు, ఎదిగిన యువతీయువకులు"

"నీ ఇష్టం మరి. ఆనక విచారిస్తావు" అనేసి ఇంటిముఖం పట్టాడు.

"అదోలా వున్నారేవిటీ" నూతిదగ్గర కాళ్ళు కడుక్కొంటోంటే అడిగింది పార్వతి.

"దారిలో రామారావు కన్పించాళ్ళే. అనవసరపు ఖర్చు భుజానికెత్తుకున్నానంటున్నాడు"

"ఇంతదాకా అయిన ఖర్చు చూస్తోంటే అలాగే అన్పిస్తోందండీ. ప్రావిడెంటుఫండు సొమ్ము తీసుకున్నారు. కూడబెట్టిన సొమ్మూ అయిపోయింది. ఇక నెలనెలా ఖర్చులకి అప్పు చెయ్యాలేమో!"

"బాబు చదువు పూర్తయ్యేవరకూ మనం సగానికి సగం ఖర్చు తగ్గించెయ్యాలి. ఎలా తగ్గిస్తావో ఏంచేస్తావో నీ ఇష్టం. తగ్గటమే నాక్కావాలి. ఇది కావాలి అది కావాలని కోరకు. అనవసరపు ఆడంబరాలకి, పెట్టుపో



తలకి పోకు. ఇప్పుడు పచ్చడి మెతుకులు తిన్నా ఫర్లేదే రేపు బాబు ప్రయోజకుడ య్యాక పంచభక్ష్యపరమాన్నాలు తినొచ్చే"

అతడి కళ్ళల్లో మెరిసిన మెరుపులు చూసి ఆమె కూడా పొంగిపోయింది.



"ప్లీజ్ కమ్ ఇమీడియట్లీ"

హాస్టల్ వార్డెన్ ఇచ్చిన టెలిగ్రాం చూసి కలవరపడ్డాడు ముకుందం.

"నా బాబుకేమయ్యిందండీ" అంటూ ఏడ్చే సింది పార్వతి. అంతటితో వూరుకోలేదు. "బలవంతంగా మీరే వాడ్ని నానుండి దూరం చేశారు. నా కడుపులో చిచ్చుపె ట్టారు. ఇప్పుడు నేనేం చెయ్యన్రా దేవుడా"

"వూరుకోవే. ఇప్పుడేవయ్యిందనే ఆ శోకాలు" ఎర్రబడ్డ ముఖంతో అన్నాడు.

"ఇంకా ఏంకావాలండీ. వెంటనే రమ్మని టెలిగ్రాం ఇచ్చారంటే నా బాబుకేదో అయ్యే వుంటుంది. ఏడుకొండల వెంకటస్వామీ! నడిచి నీ కొండకొస్తానయ్యా. నా బిడ్డకేం కాకుండా చూడు తండ్రీ"

"అంత భయపడాల్సినంత ఇదిగా ఇందులో రాయలేదే"

"అయితే టెలిగ్రాం ఎందుకిస్తారు? "

"ఎందుకంటే ఏంచెప్పను. సరైన కారణ మేదీ నాకూ తోచటంలేదు. నే వెళ్ళి కనుక్కొ స్తాగా. మన బాబుకేమీ కాదు. వాడు నా ప్రాణమే. నువ్వు నిశ్చింతగా వుండు చెబుతా"

"నేనూ వస్తాను. బాబుని చూడకుండా ఒక్కక్షణం వుండలేను"

భార్యవంక చూశాడు. ఆమె పరిస్థితి ఏ క్షణాన్నైనా పగలటానికి సిద్ధంగా వున్న ట్టుగా వుంది.





"సరే, వెళ్దాంపద"

ఎందుకైనా మంచిదని రామారావు నడిగి రెండువేలు తీసుకున్నాడు ముకుందం.

ఇద్దరూ రైలెక్కి గుంటూరెళ్ళారు.

తిన్నగా వార్డెన్‌ని కలిశారు.

"దొరబాబు పేరంట్సుం. మా బాబుకేమ య్యిందండీ" కంపితస్వరంతో అడిగాడు ముకుందం.

పైకి బింకంగా వున్నాడన్నమాటేగానీ అతడి గుండెలు ఆందోళనతో వేగిపోతు న్నాయి.

"కొన్ని డేస్‌గా హెల్త్ బావోట్లేదు. మా డాక్టర్ ట్రీట్‌మెంట్ ఇస్తున్నాడు. వర్రీ కాన క్కర్లేదు. ఎందుకైనా బెటర్‌కదాని మీకు తెలియబర్చాను. బాబు క్లాసుకి వెళ్ళలేదు. రూంలోనే రెస్టు తీసుకుంటున్నాడు. వెళ్ళి మీటవ్వండి" అంటూ ఒక స్టూడెంట్‌ని తోడిచ్చి పంపాడు వార్డెన్.

మంచంమీద నీరసంగా పడుకుని వున్నాడు బాబు. కళ్ళు లోతుకుపోయి బక్క చిక్కి వున్నాడు. దగ్గూ రొంపల్తో బాధపడు తున్నాడు. తల్లిని చూసి ఏడ్చినంత పనిచే శాడు.

"ఎలా వుందిరా కన్నా" అంటూ అక్కున చేర్చుకుంది పార్వతి. ఆమె కళ్ళనుంచి కన్నీ టిబొట్లు జలజలా రాలిపడ్డాయి.

"అసలు సుస్తీ ఏవిట్రా" ముకుందం అడి గాడు.

"కడుపులో నొప్పి వస్తోంది. ఒక్కోసారి భరించలేనంతగా వస్తోంది. డాక్టర్‌గారు చాలా మందులిస్తున్నారు గానీ తగ్గడం లేదు. ఇంటికెళ్ళిపోతానంటే ఒప్పుకోవట్లేదు. నాకు భయంగా వుంది డాడీ"

"భోజనం ఎలా వుంటోంది? కారం మసాలా ఎక్కువగా ఉపయోగిస్తున్నారా? "

"కొంచెం కారంగానే వుంటోంది"

"ఎలాంటి బియ్యం వండుతున్నారో"

అంది పార్వతి.

వార్డెన్ పర్మిషన్ తీసుకుని స్థానిక నర్సిం గ్‌హోంకెళ్ళారు.

బ్లడ్, మోషన్, యూరిన్ పరీక్షించారు. ఎక్సరే తీశారు. అన్ని రిపోర్టులూ చూసి బాబునొక్కడ్నీ అయిదు నిమిషాలపాటు ప్రశ్నించాడు డాక్టర్. అనంతరం అతడ్ని బయట కూర్చోమని చెప్పి ముకుందం దంప తుల్ని పిలిచాడు.

"మా అబ్బాయికెలా వుంది డాక్టర్" ఆందోళనస్వరంతో అడిగాడు.

"కంగారుపడాల్సిన పనిలేదు. రిపోర్టులు చూశాను. ఎపెండిసైటిస్ నొప్పికాదు. కొంచెంగా అమీబియాసిస్ వుంది గానీ అది లెక్కలోనిది కాదు. నీళ్ళ గురించి శ్రద్ధ తీసు కుంటే ఆరోగ్యం చక్కబడిపోతుంది. మీ అబ్బాయి ఇదివరకెప్పుడూ మిమ్మల్ని విడిచి వుండలేదుకదూ"

"మాకు ఒక్కగానొక్కడేనండి. నన్ను విడిచి క్షణం వుండెరగడు బిడ్డ. ఇదిగో ఈయనే ఈ చదువంటూ ఇక్కడ పడేశారు" కళ్ళు తుడుచుకుంది పార్వతి.

తల పంకించాడు డాక్టర్.

"కొత్తగా హాస్టల్లో చేరిన కుర్రాళ్ళు ఇంటికె ళ్ళిపోడానికి అక్కడ నొప్పి ఇక్కడ నొప్పి అని వంకలు పెడుతూంటారు. దాన్ని హోంసిక్ అంటాం. మీ అబ్బాయి కూడా అంతే. ఇంటికి తీసుకెళ్ళి నాలుగురోజులుం చుకుని పంపెయ్యండి. అన్నీ సర్దుకుం టాయి"

ముకుందం ముఖం గంభీరంగా మారింది.

కృతజ్ఞతలు చెప్పి వచ్చేశారు.

"డాక్టరేమన్నాడు డాడీ" అనడిగాడు బాబు.

"ఇప్పుడేం చేద్దామండీ" పార్వతి అడి గింది.

ఎవరికీ జవాబివ్వలేదు ముకుందం.

హాస్టల్‌కెళ్ళాక "నీ బట్టలవీ సర్దుకోరా ఇంటికెళ్దాం" అన్నాడు.

బాబు మోము వెలిగింది. గబగబా పెట్టె తీసి బట్టలు సర్దటం మొదలెట్టాడు.

"ఆ పని మమ్మీ చేస్తుందిలేగానీ నువ్వొచ్చి ఇలా మంచంమీద కూర్చో మాట్లాడాలి"

అనుమానంగా చూస్తూ వచ్చి కూర్చు న్నాడు బాబు. పార్వతెళ్లి బట్టలు సర్దసా గింది.

"ఇక్కడ్నుంచెళ్ళిపోయి మనూరి కాలేజీలో చేరతానంటావా? "

"అవును డాడీ. అక్కడా బాగానే చెబు తారు. నేను బాగా కష్టపడి చదువుకుం టాను. రాత్రుళ్ళు అస్సలు నిద్రపోను. అన్నంతినటం కూడా మాని చదువుకుం టాను డాడీ. ప్లీజ్ ఇక్కడుండలేను డాడీ" ఏడుపు స్వరంతో అన్నాడు.

కొడుకువంక సాలోచనగా చూసి అన్నాడు ముకుందం.

"సరేలే... అలాగే వెళ్ళిపోదాం. అక్కడ చదువెలా చెబితేనేంలే అక్కడే చదువుదువు గాని. మనింటి చూరు పట్టుకుని వేలాట్టమే కదా మనక్కావాల్సింది. అత్తెసరు మార్కులే వస్తాయంటావా రానియ్యి. నాలాగా ఏదో చిన్నదో చిటికెదో గుమస్తా ఉద్యోగం రాక పోదు. ముక్కుతూ మూల్గుతూ బతకలేక పోవు. ఏదోలా ఈసురోమంటూ బతుకు బండి ఈడ్చెయ్యొచ్చులేరా. వెళ్ళిపోదాం పద"

అదిరిపడి అపనమ్మకంగా చూశాడు బాబు. కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లుతోంటే చూశాడు.

పార్వతి కూడా చేస్తోన్నపనినాపి బొమ్మలా చూస్తుండిపోయింది.

"రాజభవనంలాటి బంగళా... అందమైన భార్య... ఇంటిముందు బారులు తీరిన కార్లు... చేతినిండా డబ్బు... ఇంటినిండా

నౌకర్లూ... నగరంలో హోదా, పలుకుబడి, గౌరవం... ఇవన్నీ వుండే ధగద్ధగాయమాన మైన భవిష్యత్ వద్దు బడుగు బతుకు చాలు నాకు అనంటావా సరేరా. అలాగే కానియ్. వెళ్ళిపోదాంలే. ఏమంటావురా? "

"డాడీ!" బాబు కళ్ళల్లో కన్నీటి అల బద్ద లైంది.

"నీ ఇష్టంరా. ఇందులో నా బలవంతం ఏంలేదు. ఆ భవిష్యత్ కావాలో ఈ బతు క్కావాలో నువ్వే తేల్చుకో. నీమాట ప్రకా రమే కానిస్తాను"

వెక్కిళ్ళు పెడుతూ అన్నాడు, "ఇక్కడే వుంటాను డాడీ"

"అదిరా మొనగాడి తనమంటే. ఛాలెం జీల్ని ఎదుర్కొన్నవాడే హీరోరా. నువ్వో మహాప్రస్థానం సాగిస్తున్నావు. దారిలో ముళ్ళూ గుట్టలూ సెలయేళ్ళూ ఎన్నో వుండొచ్చు ఎన్నో అడ్డంకులూ ఆపదలూ రావచ్చు అమ్మా నాన్నా అంటే ప్రేమ వుంటుంది. అభిమానం వుంటుంది. అలా గని వాళ్ళమీద మరీ సెంటిమెంటు పెంచు కుంటే అవి కాళ్ళకి బంధాలయ్యే ప్రమాదం వుంది. వాటన్నిట్నీ ఎదుర్కొని వజ్రసంక ల్పంతో స్థిరచిత్తంతో ముందుకి మున్ముం దుకి సాగిపోవాల్రా. అప్పుడే నీ లక్ష్యాన్ని ఛేధించగలవు. కోరిన జీవితాన్ని అందుకోగ లవు. సరేనా? "

తలాడించాడు బాబు.

ఆనందభాష్పాలు రాలుస్తూ కొడుకు భుజం తట్టాడు ముకుందం.

పిచ్చిగా చూస్తుండిపోయింది పార్వతి.

★ ★ ★

సంక్రాంతి శలవులకి ఇంటికొచ్చాడు దొర బాబు.

మనిషి కొంచెం చిక్కాడు. కొంచెంగా సాగాడు. ఇంటికొచ్చినందున కాబోలు చాలా హుషారుగా వున్నాడు.

తల్లి కళ్ళకి మరీ చిక్కినట్టు అన్పించింది. "ఏవిట్రా అలా చిక్కిసగమయ్యావు. నల్లబ డ్డావు కూడానూ. భోజనం అదీ బావుం టోంది కదా. మళ్ళీ నొప్పిరాలేదుకదా" అంటూ ఆత్రంగా అడిగింది పార్వతి.

"బాగానే వున్నాను కదా మమ్మీ" అని నవ్వాడు.

"ఏం బాగుండటమో ఏమో. ఇంచక్కా ఇంటిపట్టున వుండి చదువుకోనివ్వక ఆ వన వాసాలెందుకంటే మీ నాన్న వినరు. తనకి తోచిందే సత్యం అంటారు. తను పట్టిన కుందేటికి మూడే కాళ్ళంటారు"

ఇంతలో ముకుందం రావడంతో మాట మార్చేసిందావిడ.

"ఏంరా ఎలా సాగుతోంది చదువు. మార్కులెలా వస్తున్నాయి" వస్తూనే అడి గాడు ముకుందం.

"బాగా వస్తున్నాయి డాడీ. మాలో బాగా చదువుతోన్న ఇరవైమందిని విడదీసి ప్రత్యేక శిక్షణ ఇస్తున్నారు. మొదటి అయిదుగుర్లో నేనూ వుంటున్నాను"

ముకుందం ముఖం వికసించింది. "నాకు తెలుసురా. ర్యాంకర్స్‌కి వాళ్ళు స్పెషల్ ఇంటెన్సివ్ కోచింగ్ ఇస్తారు. వాళ్ళకే ర్యాంకులొస్తాయి. నా అంచనా ఎప్పుడూ తప్పుకాదురా" అని గర్వంగా నవ్వాడు.

"సాయంత్రం ఏమైనా సినిమాకి వెళ్ళాలని పిస్తే వెళ్ళు" అంటూ డబ్బిచ్చాడు.

బాబుకిష్టమైన గారెలు వండి పాయసం చేసి వడ్డిస్తూ, "తాతయ్య నిన్ను చూడాల నుందని కబురు మీద కబురు పెడుతు న్నార్రా. ఒకసారి వూరికెళ్ళొస్తావేంటి? " అంది పార్వతి.

"డాడీ ఒప్పుకుంటే రేపు పొద్దుటే బయల్దేరి వెళ్ళి సాయంత్రానికల్లా తిరిగొచ్చేస్తాను"




"ఎందుకొచ్చిన తిరుగుళ్ళురా.. చదువు పాడవుతుంది" అన్నాడు ముకుందం.

తరచూ పల్లెకెళ్తే మేనత్త వలలో పడిపో తాడేమో కాత్యాయిని మీద అభిమానం పెంచుకుంటాడేమోనన్న అనుమానం అతడి చేతలా మాట్లాడించింది.

"శలవులేకదా. ఒక్కరోజులో వెళ్ళొచ్చేస్తా డులెండి. వాడికీ కాస్త ఆటవిడుపుగా వుంటుంది. అందర్నీ చూసొచ్చినట్టూ వుంటుంది"

"సాయంత్రానికల్లా వచ్చేసేట్టయితే వెళ్ళిరా" అయిష్టంగానే అంగీకరించాడు.

భోంచేసి సుస్మితా వాళ్ళింటికెళ్ళాడు బాబు.

"ఎప్పుడొచ్చావోయ్ గుంటూరు హీరో" అంటూ పలకరించింది గుమ్మంలోనే ఎదురైన సరస్వతి.

"పొద్దుటొచ్చాను ఆంటీ"

"పొద్దుటనగా వచ్చి ఇప్పుడా మా ఇంటికి రావటం"

"భోంచేసేదాకా మమ్మీ ఎక్కడికీ కదల్నివ్వలేదు"

అతడి గొంతు వింటూనే లోపల్నుంచి వచ్చింది సుస్మిత.

ఇదివరక్కన్నా పొడుగ్గైంది. కొత్త అందాలొచ్చి చేరటంతో మరింత అందంగా వుంది. ఆరోగ్యంతో కళకళలాడుతోంది.

"హాయ్" అంటూ పలకరించాడు.

"ఎప్పుడొచ్చావ్. లోపలికిరా"

ఆమె వెంట స్టడీరూంలో కెళ్తోంటే హాల్లో సుస్మిత తమ్ముడు శ్రీను "నిధి చాల సుఖమా రాముని సన్నిధి సుఖమా..." అంటూ ఓ కీర్తనని సాధన చేస్తూ కన్పించాడు.

"శ్రీను బాగానే పాడుతున్నాడే"

"సంగీతమంటే వాడికెంతో ఇష్టం. మొన్నామధ్య రేడియోలో కూడా పాడాడు. అప్పట్నుంచి సాధన మరింత ఎక్కువైంది"

"నీ చిత్రకళ ఎలావుంది? "

"కుంటుతోంది. సైన్సు రికార్డులకే సరిపోతోంది టైమంతా. మీ కాలేజీ ఎలా వుంది? "

"బావుంది. ప్రాక్టికల్స్ వుండవసలు. అంతా థియరీయే. కంఠస్థ పట్టించడం రోజూ పరీక్షలు పెట్టడం... వ్యక్తిగత శ్రద్ధ తీసుకుంటారు"

"కవిత్వం రాస్తున్నావా అటకెక్కించేశావా? "

"రాత్రుళ్ళు అంతా పడుకున్నప్పుడు నిద్రపట్టక ఏదో గీకుతూంటాను" అంటూ జేబులోంచో నాలుగు కాగితాలు తీసి ఇచ్చాడు.

సుస్మి వాటిని చదువుతోంటే ఇద్దరికీ పాలు తెచ్చిఇచ్చింది సరస్వతి.

జగమంతా నిద్రిస్తున్నప్పుడు నిశీధిని చీల్చుకుంటూ నింగికెగిరి నక్షత్ర మండలంలో స్వేచ్ఛగా విహరించాలనుందని ఒక కవితలో పేర్కొన్నాడు. అనేకానేక భయాలు మూకుమ్మడిగా చుట్టుముట్టాయనీ ఎటువెళ్ళాలో ఏం చెయ్యాలో తెలీక దారికానక తల్లడిల్లుతున్నానంటూ మరో కవిత రాశాడు.

ఒంటరితనంతో బాధపడుతూ ఇంట్రోవర్ట్‌గా మారుతున్నట్టన్పించింది సుస్మికి.

"రూమ్మేట్స్ వున్నారుగా. వారితో స్నేహం పెరగలేదా? "

"చదువు గురించి తప్ప మరి దేనిగురించీ మాట్లాడుకోం. కొందరు సినిమాల గురించీ, క్రికెట్టు గురించీ మాట్లాడుతూంటారు. నాకవి అంతగా ఇష్టం వుండవు. అంతకు మించి సరదాగా గడిపే సమయంగానీ వీలుగానీ వుండదు. ఒకరకంగా జైలు పక్షులమనుకో" అంటూ నవ్వాడు బాబు. ఆ నవ్వు



పేలవంగా వుంది. ఎగరాల్సిన వయస్సులో పక్షిరెక్కలు కత్తిరించారని బాధపడింది.

ఆమె గీసిన చిత్రాలు చూసి మెచ్చుకున్నాడు.

పిమ్మట ఎన్నెన్నో విషయాలగురించి కబుర్లు చెప్పుకున్నారు. అన్ని కబుర్లు ఎక్కడ్నుంచొచ్చాయో వాళ్ళకే తెలీదు.

బాబు తేటబడిన మనస్సుతో కొంగొత్త వుత్సాహంతో ఇంటికెళ్ళాడు. రీచార్జి చేసిన బ్యాటరీలా వున్న కొడుకుని చూసి ఆశ్చర్యపడుతూనే ఆనందించింది.

"సుస్మి అంటే బాబుకెంతో ఇష్టం" అనుకుంది. మనసులో సుస్మి తన కోడలైతే బాగుణ్ణన్న చిన్నవిత్తనం వేరూనింది! మర్నాడు ఉదయమే బయల్దేరి పల్లెకెళ్ళాడు బాబు. తాతకిష్టమైన కేకులు తీసుకెళ్ళాడు.

మనవడ్ని చూసి మురిసిపోయారు నాంచారయ్యా, కనకమ్మా.

"పెళ్ళీడుకొచ్చేశాడే" అని ఇరుగమ్మ అందో లేదో ఆవిడమీద పడి కరిచినంత పనిచేసింది కనకమ్మ.

"బొడ్డూడని పిల్లాడ్ని పట్టుకుని అవేం మాటలే" అని మండిపడింది. ఇంత ఉప్పూ మిరపకాయలూ దిష్టితీసి పారేసింది.

"మీ నాన్న ఏవంటున్నాడ్రా" అడిగారు నాంచారయ్య.

"ఎప్పుడూ పాడేపాటే. చదువు తపస్సు చెయ్యాలంటారు. మరో ధ్యాస వుండకూడదంటారు. క్షణం కూడా ఖాళీగా వుండరాదంటారు" అంటూ చిన్నగా నవ్వాడు.

"అదంతా నీ బాగుకోరే కదుట్రా. తను ఎక్కలేని ఎత్తుల్ని నీద్వారా ఎక్కాలని, తను సాధించలేనివి నీద్వారా సాధించాలని, తన కలల్ని కోరికల్ని నీద్వారా నిజం చేసుకోవాలని ఆ తండ్రి ఆరాటంరా. మీ నాన్నని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించరా" అన్నారాయన.

అలాగే అన్చెప్పి మేనత్త ఇంటికెళ్ళాడు.

"నన్ను గుర్తుపెట్టుకుని చూట్టానికొచ్చావు. మాబాబే మానాన్నే" అంటూ మురిసిపోయిందావిడ.

"మీ నాన్న ఎన్నడూ ముఖమైనా చూపించడురా. తోడబుట్టిందాన్నన్న ఇదేలేదు. తనేవిటో తన ధోరణి ఏమిటో అంతే" అంది.

కాత్యాయిని సిగ్గుపడ్తూనే వచ్చింది.

"ఇది పెద్దమనిషైనప్పుడు బంతి వేస్తూ పిలిస్తే మీ అమ్మని పంపాడు గానీ మీ నాన్న మాత్రం రాలేదు" అంది మేనత్త.

"ఏం చదువుతున్నావు" బాబు అడిగాడు.

"సైన్స్" వంకర్లు తిరిగిపోతూ చెప్పింది.

"నీలాగే మంచిమార్కులు తెచ్చుకోవాలనుకుంటూ వుంటుంది. ప్రతీదీ నీతోనే పోల్చుకుంటుందనుకో"

"బాగా చదువుకో. టెన్త్‌లో స్టేట్ ర్యాంక్ తెచ్చుకుని నన్ను మించిపోవాలి"

పొంగిపోయి తలాడించింది కాత్యాయిని.

మధ్యాహ్నం దాకా రెండుచోట్లా గడిపి ఇంటికి తిరిగొచ్చేశాడు బాబు.

రగుల్తోన్న రాక్షసిబొగ్గులా వున్న తండ్రిని చూసి ఉలిక్కిపడ్డాడు.

"ఇవేమిట్రా" అంటూ కొన్ని కాగితాలు బాబుమీదకి విసిరాడు.

వాటిని చూడగానే అర్థమైపోయింది. తను రాసిన కవితలు. నిన్న సుస్మికి చూపించి పొరబాటున జేబులో మరిచిపోయాడు.

ఒళ్ళంతా తడిసి ముద్దవుతోంటే కంపిస్తూ చూశాడు.

"ఇంకెప్పుడూ అలా చెయ్యడులెండి. ఈసారికి వదిలెయ్యండి" అర్థింపుగా అంది పార్వతి.

భార్యవంక కోపంగా చూశాడు. ఆమె నోరు మూతపడింది.




"ఈ పిచ్చి రాతలేవిట్రా. నువ్వేదో చదువుకుని ఉద్ధరిస్తావని కడుపు మాడ్చుకుని డబ్బు పంపిస్తోంటే నువ్వక్కడ వెలగబెడుతున్న భాగోతం ఇదిట్రా? " ఆగ్రహోద్రేకంతో వూగిపోతూ ప్రశ్నించాడు.

తండ్రి రూపం చూసి వణికాడు బాబు.

"ఏమీ తోచనప్పుడు... రాత్రుళ్ళు..."

"తోచక పోవడం ఏవిటి? పుస్తకాలు చదువు కోవచ్చుగా"

తలొంచుకున్నాడు.

"మళ్ళీ ఇలాంటి పిచ్చిపిచ్చి వేషాలేస్తే ఒళ్ళు చీరేస్తాను జాగ్రత్త!"

గబగబా ఆ కాగితాన్ని పరపరా చింపేసి తీసుకెళ్ళి మండుతోన్న పొయ్యిలో వేసేశాడు ముకుందం.

తన గుండెనెవరో కాలుస్తున్నట్టుగా విలవిల్లాడాడు బాబు.

★ ★ ★

మే నెల. **వేసవి శలవులు**

ముకుందం అన్నగారు కృష్ణారావు సకుటుంబంగా వచ్చాడు.

ముకుందం ఉదాసీనంగా వుండిపోయాడు. పార్వతి మాత్రం అగ్గగ్గలాడుతూ బావగారికీ **తోడికోడలికీ** వారి పిల్లలకీ మర్యాదలు చేసింది. రకరకాల పిండివంటలు చేసింది. ఆమె చేతివంటని బహుధా ప్రశంసించారంతా.

బాబుని గుంటూరు కాలేజీలో చేర్చినందుకు "వైజ్ డెసిషన్" అంటూ తమ్ముడ్ని అభినందించాడు కృష్ణారావు.

నవ్వి వూరుకున్నాడు తప్ప మాటలు పొడిగించలేదు.

"రైల్వే సర్వీసు కమీషన్‌కి రాసే ఉద్దేశ్యం వుంటే ముందే చెప్పు ప్రయత్నిద్దాం"

"రాయడు"

చిత్రంగా చూశాడు తమ్ముడివంక.

"ఇంజినీరింగ్‌లో సీటు వస్తే మంచిదే అనుకో. కానీ ఫీజులకీ బుక్స్‌కీ, హాస్టల్‌కీ చాలా ఖర్చవుతుంది మరి. నువ్వు తూగ్గలవా? "

"తెలుసు" అంటూ లేచి ఏదో పనున్నట్టు వెళ్ళిపోయాడు ముకుందం.

అన్నగారు ఆఫీసరు గనుక అతడి ప్రతి మాటా చేష్టా ఆ హోదాతోనే మాట్లాడుతున్నట్లుగా అన్పిస్తోంది ముకుందానికి. అసలే ఒక రకమైన ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో బాధపడుతున్న అతనికి అన్నగారి ధోరణి భరించరానిదిగా వుంది. వదినగారి వరసా, పిల్లల ఫోజులూ కూడా కొరుకుడు పళ్ళేదతనికి.

వాళ్లంతా ఖరీదైన ఫ్యాషన్ దుస్తులు ధరించి హిందీ, ఇంగ్లీష్‌లలో ఏదేదో వాగేస్తూ గొప్పగా కబుర్లు చెబుతున్నారు.

వాళ్ళు తమ గొప్ప చూపి ఫోజు కొట్టడానికే వచ్చినట్టు ముకుందం భావించాడు. అందుకని వాళ్ళకి దూరంగా జరగడమే కాదు వాళ్ళంటే మంటగా వుంది కూడా.

'చూస్తూండండి. ఇంకొద్దికాలంలో మా పరిస్థితి మీరూహించని విధంగా మంత్రించినట్టుగా మారిపోతుంది. లంకంత బంగళాలో కాలుమీద కాలు వేసుక్కూర్చుని హుకుం జారీ చేసేరోజు రాబోతోంది. అవాళ మీ అందరికీ ఫోజు కొడతాను. నా తడాఖా ఏమిటో చూపిస్తాను' అనుకున్నాడు ముకుందం.

బాబుని కోటీశ్వరుడిగా తీర్చిదిద్దాలన్న తన కాంక్షకి మరింత ఎరువువేశాడు.

★ ★ ★

బాబుకి జూనియర్ ఇంటర్లో తొంభైనాలుగు శాతం మార్కులొచ్చాయి.

అందుకు ముకుందం సంతోషించలేదు.



మెచ్చుకోనూలేదు. కానీ కాలేజీలో ఆరవ స్థానంలో నిలిచినందుకు మాత్రం పూనకం వచ్చినట్టు వూగిపోయాడు. ఆగ్రహంతో రంకెలు వేశాడు.

"నువ్వక్కడ చదువుకుంటున్నావా? గాడిదలు కాస్తున్నావా? " అని విరుచుకుపడ్డాడు. "ఇలా చదివితే ఎందుకూ పనికిరాకుండా పోతావు. సరైన ఉద్యోగం దొరక్క హోటల్లో కప్పులు కడగాల్సొస్తుంది. సినిమాహాల్లో టిక్కెట్లు అమ్మాల్సొస్తుంది" అంటూ తిట్టిపోశాడు.

నోట మాటలేక బ్రమాన్పడి చూస్తుండిపోయాడు బాబు.

ముకుందం తిట్టితిట్టి అలసిపోయాక "బెటర్‌మెంట్‌కి రాస్తాను డాడీ" అన్నాడు.

అంతవరకూ అలాంటి అవకాశం వుందని తెలీని ముకుందం నిలువు గుడ్లేసుకుని చూశాడు. చిన్నగా పశ్చాత్తాపపడ్డాడు.

"నిన్ను బాధించాలని కాదురా నువ్వు బాగుపడాలనే నా కంఠశోషంతా. నా ఆశలన్నీ నీ మీదేరా. నువ్వేమాత్రం అటూ ఇటూ చేసినా భరించగల స్థితిలో లేన్రా. అందుకే అలా ఉద్రేకపడిపోయాను. అదేం మనస్సులో పెట్టుకోకు. ఇంటర్మీడియట్ చాలా ముఖ్యమైన దశ టర్నింగ్ పాయింట్. దీనిమీదే నీ భవిష్యత్ సౌధం ఆధారపడి వుంటుందని మాత్రం మర్చిపోకు" అన్నాడు.

"అలాగే డాడీ. ఎమ్సెట్‌లో మంచి ర్యాంక్ తెచ్చుకుంటాను. తెచ్చుకోలేకపోతే..." ఆ తర్వాతింకేదో అనబోయి మింగేశాడు బాబు.

"నాకు తెలుసురా నువ్వు గెలిచితీరతావు"

తల వంచుకుని గబగబా వెళ్ళిపోయాడు బాబు. అతడి మోమువంక చూసివుంటే చాలా చాలా సంగతులు బోధపడేవి. కానీ ముకుందం చూళ్ళేదు!

"అనవసరంగా బాబుని గాయపరిచారు. తన బాగేవిటో ఓగేవిటో వాడికి మాత్రం తెలీదూ" అంది పార్వతి

"ఇనుము సాగాలంటే సుత్తిదెబ్బలు పడకతప్పదు"

తండ్రి రియాక్షన్ గురించి సుస్మికి చెప్పి బాధపడ్డాడు బాబు. ఆమె నచ్చచెప్పి కుదుటపర్చింది.

వారి సంభాషణంతా విన్నాడు రామారావు. మిత్రుడ్ని కొంచెం హెచ్చరిస్తే మంచిదనుకున్నాడు.

"ఏవిట్రా ముకుందం. మీ వాడిమీద చాలా ఒత్తిడి తీసుకొస్తున్నట్టున్నావ్? " అన్నాడు.

"వజ్రాన్నికైనా సానబెట్టాలి కదా"

"అలాగని మరీ టెన్షన్ క్రియేట్ చేస్తే ఎలారా. అది వికటిస్తే చాలా ప్రమాదం ఏవిటనుకున్నావో. అసలు ఇంజినీరింగూ మెడిసనూ తప్ప మరేం కోర్సుల్లేనట్టూ మరేవీ మంచి కెరీర్ ఇవ్వలేవన్నట్టూ భావిస్తే ఎలా? మన అపోహల్తో పిల్లల్ని పక్కదారి పట్టిస్తే ఎలాచెప్పు? వాటిని మించిన కోర్సులు చాలా వున్నాయి తెలుసా? సిఏ వుంది. యంసిఏ వుంది. యంబిఏ వుంది. ఇంకా చాలాచాలా వున్నాయి. ఊరికే మనం హైరాన పడ్తూ పిల్లల్లో టెన్షనూ అభద్రతా కల్పిస్తున్నామనిపిస్తోంది. అవి రాకపోతే అసలు బతుకే వ్యర్థమన్న భావం నాటుతున్నామనుకుంటున్నాను"

అతడు చెప్పిందంతా శాంతంగా విని అన్నాడు, "అది నిజమే. బతికితే ఒక గొప్ప ఇంజినీర్లానే బతకాలి"

ముకుందం మాటలకి రామారావు నోరు




తెరిచాడు.



ఇంటిముందరి మామిడిచెట్టు విరగబూసింది.

గత పదేళ్ళలో ఎన్నడూ అంతగా పూసెరగదు. ముకుందం ఆనందానికి అవధుల్లేకపోయాయి.

"మన బాబుకి స్టేట్ ర్యాంక్ ఖాయం. అందుకిదే సూచన" అన్నాడు భార్యతో.

అంతటితో ఆగలేదు. ఇరుగుపొరుగుకీ ఇంటికొచ్చిన వారికీ పూత చూపించి మరీ చెప్పాడు. అంతా అతడివంక పిచ్చివాడ్ని చూసినట్టు చూశారు. పైకిమాత్రం "ఆహా... అలాగా" అన్నారు.

రోడ్డునపోయే వాళ్ళు సైతం క్షణం ఆగి చెట్టుపూతవంక చూడటం ముకుందం దృష్టిలో పడింది. నానాకళ్ళు పడితే ఏం జరుగుతుందోనని భయమేసింది.

ఒక చిన్న దిష్టిబొమ్మని తయారుచేసి కొమ్మకి వేలాడదీశాడు.

"కాయలు దిగాక దిష్టిబొమ్మ పెడతారుగానీ పూత మీద వుండగానే పెడతారా ఎక్కడైనా" అని బుగ్గలు నొక్కుకుంది పార్వతి.

"ఇవ్వాల్టి పూతే రేపటి పిందెకదా" అని జవాబిచ్చాడు.

ఒకరోజు ఉదయమే వీధి తలుపుతీసి చెట్టువంక చూసి కెవ్వుమంది పార్వతి. ఏవయ్యిందంటూ పరుగునొచ్చాడు ముకుందం.

దిష్టిబొమ్మని చూపిస్తూ, "ఎవరో పిల్లాడు ఉరి బోసుకున్నట్టు..." అంది భయంగా, బాధగా కన్నీళ్ళు తుడుచుకుంటూ.

ఆమె చెప్పాక చూస్తే తనకీ ఏదోలా అన్పించింది. గుండెమూల్గిందొక్కసారి.

వెంటనే బొమ్మకి కట్టినతాడు విప్పి రోడ్డు వైపు కొమ్మలమధ్య కట్టాడు.

"హమ్మయ్య" అనుకున్నారిద్దరూ రిలీఫ్ ఫీలవుతూ.

ఇంటర్మీడియెట్ పరీక్షలు పూర్తయ్యాయి. ఆ వెంటనే ఎమ్సెట్ కోచింగ్ మొదలుపెట్టేశారు.

పార్వతీ, ముకుందం గుంటూరు వెళ్ళి బాబుని చూసి వచ్చారు.

సున్నుండలూ, జంతికలూ డబ్బాల్లో పెట్టి ఇచ్చింది పార్వతి.

బాబు చాలా ఉత్సాహంగా వున్నాడు. ఇంటర్ పరీక్షలు చాలా బాగా రాశానన్నాడు.

"నువ్వింకేం భయపడక్కర్లేదురా. ఇటు ఇంటర్లోనూ అటు ఎమ్సెట్‌లోనూ నీకు స్టేట్ ర్యాంక్స్ ఖాయం. మన మామిడిచెట్టు ఎన్నడూ పూయనట్టు పూసింది. అది శుభ సూచకంరా" అన్నాడు ముకుందం.

బాబుకూడా ఆ ఆనందాన్ని మనసారా పంచుకున్నాడు.

★ ★ ★

**ఇంటర్మీడియెట్ రిజల్ట్సు వచ్చాయి.**

**దొరబాబు, సుస్మితా ఇద్దరూ ఫస్ట్ క్లాసులో పాసయ్యారు.**

మరి వారం తిరక్కుండానే ఎమ్సెట్ పలితాలూ ప్రకటించారు.

బాబుకి 43వ ర్యాంక్ వచ్చింది. సుస్మితకి 913వ ర్యాంక్ వచ్చింది.

ముకుందం ఆనందానికి ఎల్లలనేవే లేకుండా పోయాయి.

ఆ సంబరం భరించలేక పిచ్చివాడైపోతాడేమో అన్నంతగా పొంగిపోయాడు. గంతులేశాడు. ఊరంతా తిరిగి ఖూందీ, లడ్డూలు పంచాడు.

గుండెలమీంచి టన్నుల బరువు దిగిపోయినట్టు ఫీలయ్యాడు బాబు. 'కొంచెం అటుఇటుగా అయివుంటే?' అనుకుని 'హమ్మో!' అని గుండె పట్టుకున్నాడు.

పార్వతి పరమానందపడిపోతూ కొడుకుని పూళ్ళోని అన్నిగుళ్ళకీ తిప్పింది. పూజలూ అభిషేకాలూ చేయించింది.

అన్ని వైపుల్నుంచీ అభినందనలు వర్షమై కురుస్తోంటే ఉక్కిరిబిక్కిరయ్యాడు బాబు.



ఆరోగ్యం బాగుండకపోయినా సరే పూర్ణించి తాతయ్యా, నానమ్మా పనిగట్టుకు నొచ్చి అభినందించేసరికి సంబరం పట్టలేక ఏడ్చేశాడు.

తను స్వయంగా వండి తెచ్చిన జున్ను తినిపిస్తూ, "నా మనవడు గొప్పవాడ య్యాడు" అని మురిసిపోయింది కనకమ్మ.

ముకుందం పొంగిపోతున్నాడు.

బాబు ఇంతటి ఘనత సాధించడానికి కారణం అక్షరాలా తనే. తన పెంపకం, కృషి, ప్రోత్సాహం అలాటిలాటివి కావు. తండ్రులంతా తనని ఆదర్శంగా తీసుకోవా ల్సిందే. మరో నాలుగేళ్ళలో కొడుకు అమె రికా విమానం ఎక్కేస్తాడు. ఆ వెంటనే మిలియనీర్ అయిపోతాడు.

వీలు చేసుకుని సుస్మివాళ్ళింటికెళ్ళాడు బాబు.

"రావోయ్ ఇంజినీర్ హీరో" అంటూ ఆహ్వానించింది సరస్వతి.

ఇంటిల్లపాదీ రిజల్ట్స్ రాగానే వచ్చి బాబుని అభినందించారు. అయినా అంతా మళ్ళీ పొగిడారు. ప్రశంసించారు.

"సుస్మికి కూడా మంచి ర్యాంక్ వచ్చి వుంటే బావుండేది" అన్నాడు బాబు.

"గరల్స్‌కి కోటా వుంది గనుక మెడిసిన్లో సీటు వస్తుందనే అంటున్నారు మరి" అన్నాడు రామారావు.

"వస్తే సరేసరి. రాకపోతే లాంగ్‌టర్మ్ కోచింగ్ తీసుకుంటాను. ఈసారి గ్యారంటీగా మంచి ర్యాంక్ వస్తుంది" అంది సుస్మిత.

ఆమె నిబ్బరానికి ఆశ్చర్యపోకుండా వుండ లేకపోయాడు బాబు. అదే తనైతే అలా మాట్లాడలేడనీ అసలిలా అందరిముందుకీ వచ్చేవాడే కాదనీ అనుకున్నాడు.

"నాక్కావల్సిన వివరాలన్నీ చెబుతాను. అవన్నీ అమరేట్టు చక్కని ఇంటిప్లాన్ గీచి పెట్టాలయ్యా ఇంజినీర్ హీరో" అంది సర స్వతి.

"అవునవును. ఇల్లు కట్టినా కట్టకపో యినా ప్లాన్‌చూసి మురిసిపోవచ్చు"

రామారావు మాటలకి నవ్వులు పువ్వులై పూశాయి.

"ఇంతకీ ఏమయ్యా హీరో. వూరికే నవ్వులు పంచడమేనా లేక పార్టీ ఏదైనా ఇస్తున్నావా? "

"ఎలాంటి పార్టీ కావాలో చెప్పండి ఆంటీ ఇచ్చేస్తాను"

"ఓ పనిచేద్దాం. మనింట్లో పెద్ద పచ్చిమిర పకాయలున్నాయి కదా మమ్మీ. బజ్జీలేద్దాం. వాటిని చీరి ఉల్లిపాయముక్కలు కూరి నిమ్మరసం పిండితే భలే బాగుంటాయి. బాబుకి కూడా చాలా ఇష్టం. మేం అవి తింటోంటే అమ్మ వీణ వాయిస్తుంది. తమ్ముడు పాటలు పాడతాడు. సరదాగా ఎంజాయ్ చేయొచ్చు"

"ఆహా. మీరు బజ్జీలు తింటోంటే మేం లాలాజలం మింగుతూ సంగీత కచేరీ చెయ్యాలి అదేం కుదర్దు"

సరస్వతి మాటలకి గలగలా నవ్వేశా రంతా.

"చిన్న సవరణ. ముందు బజ్జీల కార్య క్రమం కానిచ్చి తర్వాత మ్యూజిక్ ప్రోగ్రాంలో పడదాం" అన్నాడు రామారావు.

"అది బావుందంకుల్" బాబు సపోర్ట్ చేశాడు.

"మీ మగాళ్ళంతా కలిసి బజ్జీలు చేస్తే ఇంకా బావుంటుందేమో" అంది సరస్వతి నవ్వుతూ.

"అప్పుడు వంటింట్లో మిరపకాయలు కాదు బాంబులు పేలతాయి"

"వామ్మో నా వంటిల్లు!" అంటూ లేచి





వెళ్ళింది సరస్వతి. సుస్మిత సాయానికె ళ్ళింది.

"మొత్తానికి మీ నాన్న స్వప్నం నిజం చేశావు. నాకు చాలా హేపీగా వుందోయ్" అన్నాడు రామారావు.

"మీ అందరి ప్రోత్సాహం కూడా లభించ బట్టి అదృష్టం కలిసొచ్చింది"

"అలా నీకు నువ్వు తక్కువ చేసుకోవద్దు. శ్రమించావు. ఫలితం దక్కింది. ఆ ఘనత నిస్సందేహంగా నీదే"

మాటల్లోనే బజ్జీల ప్లేట్లతో వచ్చారు సర స్వతీ సుస్మీ.

"బజ్జీలు కంటబడితే చాలు లాలాజలం నూతినీటిలా వూరిపోతుందనుకో. అసలీ టెక్నిక్ ఇంద్రుడికి తెలీదుకానీ తపస్సు చెడ గొట్టడానికి వేడివేడి బజ్జీలప్లేటు తీసుకెళ్ళి ముందుంచితే చాలు విశ్వామిత్రుడైనా మరొ కరైనా సరే చటుక్కున తపస్సు చాలించేసే వారు" అన్నాడు రామారావు.

"బాగా చెప్పారంకుల్. పచ్చిమిర్చి బజ్జీకి లొంగని నాలుక నాలుకేకాదు" అన్నాడు బాబు.

"బజ్జీ కవిత్వం కట్టిపెట్టి బజ్జీల్ని తింటే సంతోషిస్తా"

సుస్మి మాటలకి బజ్జీల మీద దండెత్తా రంతా.

'వహ్వా', 'ఓ హోహో' అనుకుంటూ ఆ పని ముగించి టీ తాగారు.

"ఆంటీ వెంటనే వీణ కచేరీ మొదలుపె ట్టాలి" అన్నాడు బాబు.

"ముందు నేను పాడతాను" అంటూ శ్రీను ముందుకొచ్చాడు.

నాలుగు సినిమాపాటలూ రెండు అన్న మయ్య కీర్తనలూ పాడాడు.

"శ్రీను గొంతు చాలా బావుందంకుల్ ఇదివరక్కన్నా చాలా మార్పొచ్చింది. జూని యర్ ఘంటసాలా అన్పించేట్లు పాడుతు న్నాడు" మెచ్చుకున్నాడు బాబు.

"అది నిజమేగాని శ్రీను ఆ ముద్రనుంచి బయటపడాలి. ఫలానావారిలా పాడడం ఫలానావారిని అనుకరించడం చేసినంత కాలం డూప్లికేట్‌గానే మిగిలిపోతాం. ఏ కళ లోనైనా సరే రాణించాలంటే స్వంతగొంతు, స్వంతముద్ర వెతుక్కోవాల్సిందే" అంది సుస్మిత.

"మీ అక్క చెప్పింది అక్షరలక్షలు చేసేమా టరా! ఎప్పటికీ ఆ సూచన మరచిపోవద్దు" అన్నాడు బాబు.

తలాడించాడు శ్రీను.

సరస్వతి వీణని శృతి చేసింది. పదినిమి షాలపాటు అంతా ఇహంమరిచి సంగీత సముద్రంలో పడి సుదూర తీరాలకి కొట్టు కుపోయారు.

తర్వాత సుస్మిత కాంపస్ జోక్స్ చెప్పింది. అంతా పగలపడి నవ్వారు.

సరిగ్గా అప్పుడొచ్చాడు ముకుందం. ఆ నవ్వులూ ఆ వాతావరణం చాలా అసహనం తెప్పించాయి.

బాబుని పిలవగా అంతా లేచొచ్చారు. లోపలకి రమ్మనీ టీ తాగి వెళ్ళమనీ పిలి చారు గానీ ముకుందం విన్లేదు. పనుందని చెప్పి బాబుని రమ్మంటూ ముందుకి నడి చాడు.

"ఈ సాయంత్రం ఎప్పటికీ మరిచిపోలేని మధురానుభూతుల్ని మిగిల్చింది ఆంటీ. మీ అందరికీ మెనీమెనీ థాంక్స్" అని చెప్పి తండ్రిని అనుసరించాడు బాబు.

"పనికిరాని ఆ నవ్వులూ ఆ పోచికోలు కబుర్లూ ఎందుకురా. కాలాన్ని వృథా చెయ్య కూడదు. ఏయే ఇంజినీరింగ్ కాలేజీలు మంచివో ఎక్కడ లాబ్‌సౌకర్యం బావుందో ఆ వివరాలన్నీ ఎంక్వైరీ చేసుకోవద్దూ"

"కౌన్సిలింగ్ మొదలెట్టడానికింకా

టైముంది కదా డాడీ"

"అలా అనుకోవద్దు. గుర్రం ఎప్పుడూ పరుగెడుతూనే వుండాల్రా. కాస్సేపు ఆగిందో బద్ధకించేస్తుంది"

"ఇప్పుడేం చేద్దామంటారు" విసుగు కప్పి పుచ్చుకుంటూ అడిగాడు.

"భీమవరం ఇంజినీరింగు కాలేజీలో పని చేసే ప్రొఫెసర్‌గారు వాళ్ళ చుట్టాలింట్లో ఏదో ఫంక్షన్‌కని ఈ వూరొచ్చార్ట. ఎడ్రస్సు తీసుకున్నాను. వెళ్ళి కలుద్దాం పద"

క్షణకాలం విస్మితుడై చూశాడు బాబు.

ఆయన ఎంత వేగంగా కదుల్తున్నాడు. తనకోసం ఎంతగా తపిస్తున్నాడు. వ్యూహాన్ని ఎంత చక్కగా పన్నుతున్నాడు. పథకాన్ని ఎంత శ్రద్ధతో రచిస్తున్నాడు!

'హేట్సాఫ్ టు యూ డాడ్' అనుకున్నాడు మనస్సులోనే.

★ ★ ★

పల్లెలో తన వాటాకి వచ్చిన పొలాన్ని అమ్మేశాడు ముకుందం. ఎప్పుడైనా ఎమ్సెట్ కౌన్సిలింగ్ మొదలవ్వచ్చని యాభైవేలు ఎడ్వాన్సుగా తీసుకుని రెడీగా వున్నాడు.

ఐఐటి ఎంట్రన్స్ రిజల్ట్స్ వచ్చాయి. ఊహించినవిధంగా బాబుకి అందులోనూ మంచి ర్యాంక్ వచ్చింది. మద్రాసు కాలేజీలో సీటు వచ్చింది.

"భీమవరంలో కాకపోతే హైదరాబాద్‌లో చేర్చండి. మరో రాష్ట్రం కాని రాష్ట్రంలో ఎందుకండీ" అంది పార్వతి దిగులుగా.

"పిచ్చిదానా. మనూళ్ళోనే చదవాలి. మన పక్కూళ్ళోనే చదవాలి అనెప్పుడూ గిరి గీచుక్కూర్చోకూడదు. ఎంతోదూరం వెళ్ళొచ్చు కానీ ది బెస్ట్ కావాలి. ఐఐటీలో సీటు రావడం అల్లాటప్పా విషయం కాదే. ఖర్చెక్కువయ్యే మాట నిజమే. అయితేనేం ఫలితం రెట్టింపు వుంటుంది. పెద్దపెద్ద కంపెనీలవాళ్ళు కేంపస్‌లోనే ఇంటర్వ్యూలు చేసి పెద్దపెద్ద జీతాల్తో ఉద్యోగాలిచ్చేస్తారే"

"అవును మమ్మీ. ఐఐటి ముందు మరేదీ సాటిరాదు. నేను మద్రాసువెళ్ళి చదువుకుంటాను" అన్నాడు బాబు.

ఆనందబాష్పాలు రాలుస్తూ ఆలింగనం చేసుకున్నాడు ముకుందం.

"నువ్వు నా కొడుకువైనందుకెంతో గర్వంగా వుందిరా" అన్నాడు.

మద్రాసు కాలేజీలో చేరటానికి బయల్దేరుతుంటే టెలిగ్రాం వచ్చింది. తనకి కాకినాడ మెడికల్ కాలేజీలో సీటు వచ్చిందంటూ హైదరాబాదునుంచి సుస్మిత ఇచ్చింది దాన్ని.

తనకే సీటు వచ్చినట్టు పొంగిపోయాడు బాబు.

"థాంక్ గాడ్. సుస్మి కోరిక తీరింది. డాక్టర్ కాబోతోంది" అన్నాడు. ఆమెకి తన శుభాకాంక్షలు తెలియచేయమని మరీమరీ చెప్పాడు.

"మీ ఇద్దరి ఆశలూ నెరవేరినందుకు నాకు చాలా సంతోషంగా వుందయ్యా"అంది సరస్వతి.

★ ★ ★

నాంచారయ్యకి సీరియస్‌గా వుందని పల్లె నుంచి కబురు మోసుకొచ్చారొకరు.

"మొన్నటిదాకా బాగానే వున్నారే. ఇంతలో ఏవయ్యిందోపాపం" అంటూ ఆందోళనపడింది పార్వతి. కళ్ళూ ముక్కూ తుడుచుకుంటూ బట్టలవీ సర్దసాగింది.

ముకుందం గుండెలు గుభిల్లుమన్నాయి.

తండ్రి పరిస్థితి అటూ ఇటూ అయితే కర్మకాండలకి చాలానే ఖర్చవుతుంది. అందులో సగం తను భరించాల్సొస్తుందని అతడి భయం.

"మనం వెళ్ళి చేసేది మాత్రం ఏముంది




బస్సులో వెళ్దాం" అన్నాడు.

"హవ్వ! ఎవరైనా వింటే నవ్విపోతారు. కన్నతండ్రి చావుబతుకుల మీదుంటే నిమ్మకి నీరెత్తినట్లు మాట్లాడతారేం"

"తండ్రి అయినా తల్లి అయినా వయస్సు డిగాక రాలిపోక తప్పదే. ఏదో మనవాళ్ళు మనవాళ్ళని తాపత్రయపడతాం గానీ అసలీ సెంటిమెంట్లన్నీ ట్రాష్. ఒట్టి మాయ!"

నివ్వెరబోయి చూసింది.

"వేదాంతం చాలుగాని చిన్న కారుని మాట్లాడండి. అక్కడ మావగారికెలా వుందో ఏమో..."

మరి తప్పక టాక్సీ మాట్లాడాడు.

మంచంమీద నిస్సహాయంగా పడివు న్నారు నాంచారయ్య. కనకమ్మ గోడుగో డున ఏడుస్తోంది.

"నీ చేతులమీదుగా పసుపుకుంకాల్తో పోదామనుకున్నాను. నన్ను ఒంటిని చేసిపో తావా?" అని శోకాలు తీస్తోంటే బంధుమి త్రులు వారించారు. దాంతో లోలోన కుళ్ళి కుళ్ళి ఏడ్వసాగిందామె.

క్రితంరోజున పక్షవాతం వచ్చిందిట నాంచారయ్యకి. స్థానిక వైద్యుడొచ్చి చూసి మందులిచ్చాడు. మెల్లగా కోలుకుంటారని ఆశించారట. కానింతలో మాట పడిపోయిం దిట. పరిస్థితి విషమించిందిట. అందుకే మనిషిని పంపామని చెప్పారు. కృష్ణారావుకి ఫోను చేశామని కూడా చెప్పాడు బావ కామే శ్వర్రావ్.

తండ్రి పరిస్థితి చూసి స్థాణువయ్యాడు ముకుందం. గుండె కలుక్కుమందొక్కసారి. బాధగా చూశాడు.

ఆయనేదో చెప్పాలని తపిస్తున్నారు. తన పక్కనే కూర్చోమని సైగ చెయ్యగా కూర్చు న్నాడు. చెయ్యి నిమురుతూ "నాతప్పేంలే దురా. నిన్ను తక్కువగా చూళ్ళేదురా. నన్ను అర్థం చేసుకోరా" అన్నట్టుగా బేలగా చూశారు.

ఆయన చెప్పాలనుకున్నది ముకుందానికి అర్థమైంది. అయినా జవాబివ్వలేదు. ఓదా ర్చలేదు. రాయిలా కూర్చునుండిపోయాడు.

రెండు కన్నీటిబొట్లు నాంచారయ్య కనుకొ లుకుల్నుండి రాలి పడ్డాయి.

మర్నాటికి కృష్ణారావు భార్యాపిల్లలతో వచ్చాడు. ఇద్దరు కొడుకులూ, కూతురూ, అల్లుడూ అంతా వచ్చారు. అందర్నీ తృప్తిగా చూశాడు నాంచారయ్య. ఇంతలో ఏదో గుర్తురాగా ముకుందం వంక చూశారు. బాబు గురించి సైగ చేశారు.

"అలాగే అలాగే... మీరు నిశ్చింతగా పడుకోండి" అన్నాడు ముకుందం.

"మనవడ్ని చూడాలని ఆరాటపడ్తు న్నాడ్రా" అందతడి అక్కయ్య.

తలపంకించి వూరుకున్నాడు.

జాలిగా, ఆశగా చూశారు నాంచారయ్య.

"బాబుకి ఫోన్ చెయ్యి. వెంటనే వచ్చి కన్పించివెళ్ళమను" అన్నాడు కృష్ణారావు.

"ఆ మనవడు ఫస్టున పాసయ్యాడని ఎంత సంబరపడ్డారో" పొరుగింటావిడంది.

మరి తప్పక లేచాడు ముకుందం. పక్క వూళ్ళో యస్టీడీ బూత్ వుందని చెప్పారు. ఎవరిదో సైకిల్ తీసుకువెళ్ళాడు.

బాబుని పిలవడమా? వద్దా!

అవసరమా? కాదా?

మీమాంసతో వూగిసలాడుతూ వెళ్ళాడు.

హాస్టల్‌కి ఫోన్‌చేసి బాబుని పిలవమని చెప్పి ఫోన్ పెట్టేశాడు.

కాస్సేపాగి మళ్ళీ చేశాడు. బాబు లైన్లోకొ చ్చాడు.

"బాబూ! ఎలా చదువుకుంటున్నావురా?"

"బాగానే చదువుకుంటున్నాను డాడీ. మమ్మీ ఎలా వుంది?"



"బాగానే వుందిగాని నువ్వు క్షణం కూడా విశ్రమించకూడదు. ఇదే అసలైన యజ్ఞం"

"ఇప్పుడెందుకు ఫోన్ చేశావు డాడీ"

"అదీ... ఎలా చదువుతున్నావో, ఏం చేస్తున్నావో కనుక్కుందామనీ..."

"తాతయ్యకెలా వుంది? "

ఉలిక్కిపడ్డాడు "ఏంరా... ఎందుకలా అడిగావు? "

"రాత్రి ఏదో పీడకల వచ్చింది డాడీ. అన్ రెస్ట్‌గా వుంది"

"తాతయ్యకేం హాయిగా వున్నారుగాని నువ్వేం ఇదవ్వకు. లేనిపోనివి వూహించుకుని బుర్ర పాడుజేసుకోకు. చదువుని ఏమాత్రం అశ్రద్ధ చెయ్యకూడదు సుమా"

"అలాగే డాడీ. తాతయ్య వస్తే అడిగానని చెప్పండి"

"అలాగేలే"

ఫోన్ పెట్టేసి మొఖానికి పట్టిన చెమటలు తుడుచుకున్నాడు.

'పిలవకపోవడమే మంచిదిలే. వాడొచ్చేదాకా ఈయన ప్రాణం ఎలాగూ నిలవదు. వాడొచ్చి చేసేదీ వుండదు. మధ్యన వాడి మూడ్ పాడైతే మళ్ళీ కోలుకుని దార్లో పడటానికి చాలా టైమ్ పడుతుంది. అయినా ఇప్పుడు ఎవరొచ్చి మాత్రం చేసేదేముందీ. కడచూపనీ అదనీ ఇదనీ ఏవో అనుకుంటాం. అదంతా భ్రమ. ఫూలిష్ సెంటిమెంట్స్' అనుకున్నాడు.

అలా తనకితను మళ్ళీ మళ్ళీ సర్దిచెప్పుకున్నాడు. అప్పుడుగాని మనస్సు స్థిమితపళ్ళేదు.

ముకుందాన్ని చూసి "లైన్ దొరికిందా? " అనడిగాడు కృష్ణారావు.

"ఆc... ప్రిన్సిపాల్ పర్మిషన్ తీసుకుని బయల్దేరి వస్తానన్నాడు"

ఆ మాటలు విని తృప్తిగా నిట్టూర్చారు నాంచారయ్య.

ఆయన కళ్ళల్లో చిరు ఆశ వెలిగింది.

మర్నాటికి కూడా ఆయన పరిస్థితిలో మార్పులేదు.

డాక్టరొచ్చి చూశాడు. "ప్రాణం ఏ క్షణానైనా పోవచ్చు" అన్నాడు.

గుమ్మంవంకే మనవడొస్తాడని కాబోలు ఆశగా చూస్తున్నారు నాంచారయ్య.

అది గమనించారంతా.

"మనవడికోసం ఆయన ప్రాణం కొట్టుకొంటోంది. లేకపోతే చిలక ఎప్పుడో ఎగిరిపోను. త్వరగా మనవడొస్తే బావుణ్ణు. జీవికి నరకయాతన తప్పేది" అందో పెద్దావిడ.

అవునన్నట్టు తలూపుతూ ముకుందం వంక చూశారంతా.

తప్పుచేసినట్లుగా తల దించుకున్నాడతడు.

"బాబు ఈపాటికి రావాల్సిందేనే. తాతయ్యకిలా అయ్యిందంటే క్షణం కూడా నిలవడు. పరుగు పరుగున వస్తాడు. మీరు సరిగ్గానే చెప్పేరుకదా" అని అడిగింది పార్వతి.

"చెప్పకుండా ఎలా వుంటాను? " కసురుకున్నట్టుగా అన్నాడు.

మరెవరూ ఆ వూసెత్తలేదు.

కాస్సేపటికి మరేమన్పించిందో ఏమోగాని తానే అన్నాడు. "ఏవో ఇంపార్టెంట్ ప్రాక్టికల్స్ వున్నాయన్నాడు. ప్రిన్సిపాల్ పర్మిషన్ ఇచ్చాడో లేదో? నేనే ప్రిన్సిపాల్ని రిక్వెస్ట్ చేసుండాల్సింది. బాబు మాట వాళ్ళు విశ్వసించారో లేదో? "

ఎవరూ ఏమీ అన్లేదు. గంభీరంగా వుండిపోయారంతా.

ఆరోజు రాత్రే నాంచారయ్య ప్రాణం అనంతవాయువుల్లో కలిసిపోయింది.





ఆయన చూపులు మాత్రం గుమ్మంవంక చూస్తూనేవున్నాయి.

ముకుందం గుండెల్లో ముల్లు గుచ్చుకున్నట్టు బాధపడ్డాడు. అది రెండు క్షణాలు మాత్రమే. ఆ తర్వాత తదుపరి కార్యక్రమంలో పడిపోయాడు.

కర్మకాండలు పూర్తయ్యాయి. అన్నీ యధావిధిగా దేనికీ లోటుచెయ్యకుండా చేశారు.

తల్లినెవరు తీసుకెళ్తే బావుంటుందన్న ప్రశ్న ఉదయించింది.

అసలే బాబు చదువు ఖర్చువల్ల ఆర్థిక ఇబ్బందుల్లో వున్నాడు ముకుందం. అంచేత తల్లి బరువు తన మీదెక్కడ పడుతుందోనని భయపడ్డాడు.

ఆ సంగతి గ్రహించినట్టుగా "పెద్దాడింటి కెళ్తాన్రా" అందామె.

తేలిగ్గా నిట్టూర్చాడు ముకుందం.

భూములు ఇదివరకే పంచేసుకున్నారు. అందువల్ల మిగిలిన ఇల్లూ వాకిలీ పంచేసుకుని ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు.



సెలవులివ్వగా బాబు వచ్చాడు. వాడ్ని చూస్తూనే ఏడ్చేసింది పార్వతి.

"ఏమయ్యింది మమ్మీ?"

"తాతయ్య..."

"తాతయ్యకేమయ్యింది?" తల్లిని పట్టుకుని కుదిపేస్తూ అడిగాడు.

నిలువునా నిశ్చేష్టఅయి చూసింది. "తాతయ్య పోయార్రా"

"ఎప్పుడు? నాకెందుకు తెలియజేయ లేదు?"

"అదేమిట్రా అలా మాట్లాడతావు. తాతయ్యకి సీరియస్‌గా వుందనీ నిన్ను చూడాలనుకుంటున్నారనీ డాడీ ఫోన్ చేశారుగా!"

"ఎప్పుడు?"

"రెండు నెలల క్రితం"

అప్పుడు జరిగిన ఫోన్ సంభాషణ గుర్తుచేసుకుంటూ అన్నాడు. "అప్పుడు డాడీ ఏమీ చెప్పలేదే. తాతయ్యకెలా వుందని కూడా అడిగాను. బాగానే వుందన్నారే"

"ఆc!..."

కాస్సేపటిదాకా మాట్లాడలేకపోయిందామె. అలాటి ముఖ్యవిషయం కొడుక్కి చెప్పకుండా భర్త దాస్తాడంటే నమ్మలేకపోతోందామె.

"అంత సడన్‌గా అలా ఎలా పోయారు మమ్మీ?"

జరిగిందంతా వివరించింది.

"పాపం! నీ కోసం చాలా ఇదిగా చూశార్రా. మాట పడిపోయినా సైగల్తో నీ కోసం అడుగుతూనే వున్నారు. నువ్వు తప్ప అంతా వచ్చారు కూడానూ. నీ కోసం చూస్తూనే..."

ఏడ్చేశాడు బాబు. ఊరడించగా వూరడించగా దుఃఖం కంట్రోలు చేసుకున్నాడు.

ఆఫీసునుంచి ముకుందం వచ్చాడు. పరిస్థితిని ఆకళింపు చేసుకున్నాడు. అతడు నోరు తెరిచేలోగానే "తాతయ్య పోయినట్టు నాకెందుకు చెప్పలేదు?" అని ప్రశ్నించాడు

గాద్గదిక స్వరంతో బాబు.

"మనస్సు పాడవడం తప్ప చెప్పి ప్రయోజనం ఏముంటుందిరా? చదువు చెడటం తప్ప నువ్వొచ్చి చేసేదేముంటుంది చెప్పు? "

వెర్రిగా చూశాడు బాబు.

"ఒకటి రెండ్రోజులు చదువుపోతుందని తాతయ్యకి సీరియస్‌గా వున్నా చెప్పలేదా? తాతయ్య నా కోసం ఎంతగా అలమటించి వుంటారో మీరూహించగలరా? " దుఃఖోద్వేగంతో అన్నాడు.

"ఆయన నీకు తాతయ్య అయితే నాకు తండ్రి. ఆ సంగతి మర్చిపోకు. ఆయన పోయారన్న బాధని నేనప్పుడే మర్చిపోయాను. ఇక నువ్వెందుకింతిలా ఇదవుతావు చెప్పు? "

కళ్ళ నీళ్లతో చూశాడు బాబు. "తాతయ్య నా కోసం..."

"చూశారు. నిజమే. పోయేముందు అందర్నీ చూడాలని తాపత్రయపడ్డారు. అది సహజం. దాన్ని మనం భూతద్దంలో చూసి ఏదేదో అనుకుని ఏదేదో అయిపోవడం అనవసరం. పైగా నువ్వు సెన్సిటివ్వి. నీది సున్నిత స్వభావం. ప్రతి చిన్న దానికీ అతిగా రియాక్టవుతూంటావు. మంచంమీదున్న ఆయన్ని చూసి నీ గుండె తట్టుకోలేదు. అందుకనే నీకు చెప్పలేదు"

ఆగి కొడుకువంక చూశాడు ముకుందం. బాబు తలదించుకున్నాడు. కన్నీళ్లు బుగ్గల మీంచి కారుతూనే వున్నాయి.

"నీ పరిస్థితిని అర్థం చేసుకోగలన్రా. అయినా సంభాళించుకోక తప్పదు. చావులూ పుట్టుకలూ సహజాతి సహజం. జాతస్యమరణం ధృవం అన్నారు. పుట్టిన ప్రతి ప్రాణీ గిట్టక తప్పదు. ఈ బంధాలూ బంధుత్వాలూ అన్నీ మాయ. వాటిని ఎక్కడ వుంచాలో అక్కడే వుంచాలి. అంతకుమించి విలువిచ్చి లేనిపోని సెంటిమెంట్లు పెంచుకుంటే ఆ బంధాలు కాళ్ళకి బంధాలవుతాయి. మన ప్రగతికి సంకెళ్లు వేసి మనం ముందుకెళ్ళకుండా నిరోధిస్తాయి. యుద్ధంలో అసువులు కోల్పోయినవారినీ క్షతగాత్రుల్నీ ఎలాగైతే మైదానంలో వదిలేసి ముందుకి జైత్రయాత్ర సాగిస్తారో అలాగే జీవితంలోనూ సాగించాలి. మున్ముందుకి సాగిపోవాల్రా"

తండ్రిలో కొత్త మనిషి కన్పిస్తోంటే పిచ్చిగా చూస్తూండిపోయాడు బాబు.

★ ★ ★

బాబుకి కాలేజీలో 'తాబేలు' అనీ, హాస్టల్లో 'పుస్తకాల పురుగు' అనీ పేరు పెట్టారు.

అతడి సహవిద్యార్థులంతా చదువులోనే కాదు, ఆటపాటల్లో సరదాల్లో, ఫ్యాషన్లలో, ధైర్యసాహసాల్లో అన్నిటా ముందంజగా వుంటారు. ఏంచేసినా నిర్భయంగా చకచకా చేస్తారు. జీన్సూ యాక్షన్ షూస్ ధరించి ఏమీ పట్టనట్టు ఎక్కడెక్కడో తిరుగుతూ ఎంజాయ్ చేస్తారు. హాస్టల్‌కి రాగానే టేబుల్ దగ్గర పాతుకుపోయి చదువులో లీనమూ అయిపోతారు. పరీక్షలొస్తే లైబ్రరీని ఔపోసన పట్టడమే కాదు నైటవుట్ చేస్తారు.

కాని బాబు వాళ్ళలో కలవడు. వాళ్ళకి పూర్తి భిన్నంగా వుంటాడు. అతడు పెరిగిన వాతావరణమేగాక తండ్రి ఆర్థికస్థితీ తండ్రి బోధనలూ అందుక్కారణం కావొచ్చు

అందర్లా హేపీగా వుండాలని అతడికీ అన్పిస్తూంటుంది. అందర్తో కలవలేకపోతున్నాననే అన్న బాధావుంది. అయినా తన గురించి తండ్రికి తెలిస్తే కోప్పడతారన్న భయం అతడ్ని కట్టిపడేస్తోంది. తండ్రి అష్ట కష్టాలు పడి డబ్బు పంపిస్తోంటే తను చదువుకోకుండా వేరే ధ్యాస పెట్టుకోడానికి మన స్సంగీకరించడమూ లేదు.

తండ్రి ఆశలు నెరవేర్చడానికి అహర్ని





శలూ కష్టపడాలనీ అందునిమిత్తం తన సుఖసంతోషాలని బలిపెట్టడం తన ధర్మ మనీ మనసా వాచా విశ్వసిస్తున్నాడు.

అందుకనే సహవిద్యార్థుల్ని చూసి ఎన్నో అనుభవాలనీ, అనుభూతుల్నీ, సంబరాల్నీ సరదాల్నీ మిస్ అవుతున్నానని వాపోతూనే చదువుమీద దృష్టి లగ్నం చేస్తున్నాడు. అయినా ఒక్కోసారి ఏదో వెలితిగా ఎంతో బాధగా అన్పిస్తూంటుంది.

అటువంటప్పుడు తన అనుభూతుల్ని కాగితంమీద పెడుతూంటాడు. అది కవిత్వమా కాదా అన్నది కాదు ప్రశ్న. ఆ రకంగా తన మనస్సు లోతుల్లోని బాధని దించుకోగలుగుతున్నాడు.

బాబుకి ఊరట కలిగించటమే కాదు ఆనందపరచి ఆహ్లాదపరిచి వినువీధుల్లో విహరింపజేసేది ఒకటుంది. అది సుస్మి తలంపు!

ఆమెని తలచుకుంటే చాలు మనస్సున మల్లెల మాలలూగుతాయి. గుండెల్లో గులాబీలు గుబాళిస్తాయి.

అటువంటప్పుడు ఆమెకి తన ప్రేమావేశాన్ని తెలియజేస్తూ పేజీలకొద్దీ ఉత్తరాలు రాసేస్తూంటాడు. కాని వాటినేమీ పోస్టు చెయ్యకుండా భద్రంగా పెట్టె అడుగున పేపర్ కింద దాస్తున్నాడు.

తన భావాలూ అభిప్రాయాలూ ఆమెకి తెలిస్తే ఏమనుకుంటుందోనని అతడి సంకోచం. ఎలా రియాక్టవుతుందోనని అతడి భయం. 'నా స్నేహాన్నిలా అపార్థం చేసుకున్నావా' అని ప్రశ్నిస్తే తన దగ్గర సమాధానం లేదు.

అందుకే ప్రేమని గుండెల్లోనూ ప్రేమలేఖల్ని పెట్టెలోనూ భద్రపరచుకుంటున్నాడు బాబు.

ఏదోరోజున అవి వెల్లడి కాకపోవనీ తన ఆశలు తీరకపోవనీ అతడి ఆశ. స్వప్నం!

★ ★ ★

క్రిస్ట్‌మస్ సెలవులకి ఇంటికొచ్చాడు బాబు.

తల్లితో రెండు నిమిషాలపాటు మాట్లాడి గబగబా సుస్మి వాళ్ళింటికెళ్ళాడు. ఆమెని చూసి ఆర్నెల్లవుతోంది. అంచేత ఆమెని చూడాలని ఆత్రంగా వుందతడికి.

"ఏమయ్యా ఇంజినీరు హీరో, ఎప్పుడొచ్చావు" అంటూ పలకరించింది సరస్వతి.

"ఇంతక్రితమే ఆంటీ. సుస్మి రాలేదా?"

"రాలేదయ్యా. ఫ్రెండ్స్‌తో కలిసి వైజాగ్ అరకువేలీ చూట్టానికెళ్తున్నానని రాసింది"

చెప్పలేనంత నీరసం ఆవరించింది. ఒక్కసారిగా డీలాపడిపోయాడు.

మిఠాయివుండ ప్లేటులో పెట్టుకునొస్తూ అడిగింది "కాలేజీ కబుర్లేంటి. నిరుడు మిమ్మల్ని రాగింగ్ చేశారని ఆ కసితో మీరు జూనియర్స్‌ని రాగింగ్ చేస్తున్నారా?"

నవ్వేశాడు. "రాగింగ్ చేస్తే కాలేజీనుంచి డిబార్ చేస్తామని యూనివర్సిటీ ప్రకటించింది"

"ప్రకటనలకే ఆగిపోతే మీరు కుర్రాళ్ళెందుకవుతారు?"

"అదీ నిజమే. మరీ ఇదివరకట్లా కాకపోయినా రాగింగ్ చేస్తూనే వున్నారు ఆంటీ"

"సుస్మి వాళ్ళ మెడికల్ కాలేజీలో తక్కువగానే వుందిట. విద్యార్థి సంఘాలు చాలా చైతన్యవంతంగా వుండటం కారణమంది"

"తన విశేషాలేమిటి ఆంటీ"

"హాస్టల్ స్టూడెంట్స్ అసోసియేషన్లో ఏదో పదవి చేబట్టానంది. లీడర్‌షిప్ క్వాలిటీస్ బాగానే పెంచుకుంటోంది"

"మా ఇద్దరికీ అదే తేడా" అనుకున్నాడు మనస్సులో.

స్కూల్‌నుంచి శ్రీను వచ్చాడు.

"ఏం శ్రీనూ. ఎంతవరకూ వచ్చింది నీ

సంగీత సాధన"

"బాగానే వుంది"

"గాత్రం బాగా డెవలప్ చేసుకున్నాడు. మెల్లగా సొంత గొంతు వెదుక్కుంటున్నాడు"

"శ్రీనుకి మంచి భవిష్యత్తు వుంది ఆంటీ"

"సరైన బ్రేక్ వస్తే అదృష్టమే మరి"

కాసేపు కూర్చుని టీ తాగి వచ్చేసాడు బాబు.

అప్పటికే అతడికోసం అసహనంగా నిరీక్షిస్తున్నాడు ముకుందం.

"నీ వరసేం బావోలేదురా. వచ్చీరాగానే మాటామంతీ లేకుండా వాళ్ళింటికి పరుగెట్టడమేనా. వాళ్ళేం పొడిచేస్తున్నారనీ!"

"మీరింకా ఆఫీసునుంచిరాలేదు. ఈలోగా కన్పించి వద్దామని"

"కన్పించి రావడానికి వాళ్ళేమైనా ఆఫీసర్లా కోటీశ్వరులా? మనకంటే ఇద్దైనవాళ్లు. ముందు కూర్చో చెబుతా"

బాబు కూర్చున్నాక అన్నాడు, "నువ్విప్పుడు కాబోయే ఎలక్ట్రానిక్స్ ఇంజనీరువి. రేపో మాపో ఫారిన్ వెళ్ళబోయేవాడివి. కోట్లకి పడగెత్తబోయే మహారాజువి. అంచేత నువ్వు ఇప్పట్నుంచీ కూడా ఒక స్టేటస్, ఒక స్టైలు మెయిన్‌టెయిన్ చేస్తూండాలి. ఎవరు బడితే వాళ్ళతో రాసుకుతిరక్కూడదు. నీ స్నేహాలూ సంబంధాలూ అన్నీ పైవర్గపు వారితోనే వుండాలి. నీ దృష్టి ఎప్పుడూ పైకి పైపైకి వుండాలి. నా అభిప్రాయం అర్థమైందికదా"

తలాడించాడు బాబు.

అతడి భవిష్యత్తు గురించి తనెన్ని ఆశాసౌధాలు నిర్మించుకున్నాడో ఎన్ని రంగుల స్వప్నాలు కంటున్నాడో మరోసారి వివరించాడు ముకుందం.

"నా లోటులేకుండా ప్రయత్నిస్తాను డాడీ"

"నాకు తెలుసురా. నువ్వందరిలాటివాడివి కాదు. నువ్వు పితృవాక్య పరిపాలకుడివిరా. తారామండలానికి దూసుకుపోవడమేగాని వెనుదిరిగి చూడటం నీ జాతకంలో లేదురా. నిన్ను కన్నందుకెంతో గర్విస్తున్నాంరా. నువ్వు పున్నామ నరకంనుంచే కాదురా దారిద్ర్యంనుంచి, అసహాయత నుంచి, అసమానతనుంచి మమ్మల్ని తప్పించే పుత్రరత్నానివిరా" అన్నాడు జలజల ఆనందభాష్పాలు రాలుస్తూ.

ద్రవించి పోయాడు బాబు.

కళ్ళు చెమ్మగిల్లగా తండ్రి వంక ఆరాధనగా చూశాడు. భరోసా ఇస్తూ చూశాడు.

ఉద్విగ్నుడై "మీ మాట జవదాటను. మీరు చూపిన బాటలో పయనించి మీరు నిర్దేశించిన లక్ష్యాన్ని చేరుకుంటాను" అన్నాడు బాబు.

పరమానంద పడిపోయాడు. "నూరేళ్ళు చల్లగా వర్ధిల్లరా!" అన్నాడు. ఆ వెంటనే "ఇదిగో ఏమేవ్! మన బాబు ఏమంటున్నాడో తెలుసా? నేను గీచిన గీటు దాటనంటున్నాడు. నా మాటని శిలాశాసనంగా భావిస్తానంటున్నాడు..." అన్నాడు భార్యని పిలిచి.

ఆవిడ కూడా ఆనంద పడిపోయింది. "నా కొడుకు శ్రీరాముడండీ. తండ్రి మాట జవదాటడు"

"అదే మాటమీద, ఇదే బాటమీద నిలబడరా. నిన్నంతా తలెత్తి చూసేంత స్థితికి తీసుకెడతానురా. నీలాంటి పుత్రుడు, నాలాంటి తండ్రి ఎక్కడా వుండరని లోకానికి ఋజువు చేస్తాను..."

ఇంకా ఏదేదో చెప్పేయబోయాడుగాని "దొరబాబూ" అంటూ రామారావు రావడంతో అతడి వాక్ప్రవాహానికి అడ్డుకట్ట పడింది. విసుగ్గా చూశాడు.

"రండంకుల్" లేచి వెళ్ళి ఆహ్వానించాడు బాబు.

"రారా కూర్చో" ముక్తసరిగా అన్నాడు




ముకుందం.

"మధ్యాహ్నం వచ్చావా. ఆంటీ చెప్పింది"

"మీ ఇంటికొచ్చాను. మీరింకా ఆఫీసు నుంచి రాలేదు"

"నువ్వొచ్చావని ఆఫీసు ఎగ్గొట్టి మరీ వచ్చే రోజు వస్తుందోయ్" అని నవ్వేడు.

ఆ సంభాషణ రుచించలేదు ముకుందానికి.

"ఎప్పుడు భోంచేశావో ఏమో వెళ్ళి భోంచెయ్యరా" అన్నాడు కొడుకుతో.

"భోజనం తర్వాత ముందివి తిననీండి" అంటూ మూడు ప్లేట్లలో పూతరేకులూ కారబ్బూందీ పెట్టుకొచ్చింది పార్వతి.

"ఏవిటి విశేషం? "

"కొడుకు వచ్చినరోజే పండగ తనకి" అన్నాడు ముకుందం.

పార్వతి సంబరంగా నవ్వేసింది.

"సుస్మిత ఎప్పుడొస్తుందేవిటి" బాగుండదన్పించి అడిగాడు ముకుందం.

"ఎప్పుడోనా. రైల్వేవారు కరుణిస్తే ఇంకో గంటలో వచ్చెయ్యదూ"

బాబు కళ్ళు మెరిశాయి. "ఇవాళ సుస్మి వస్తోందా? ఆంటీ మరోలా చెప్పింది"

"సర్ప్రయిజ్ చేద్దామని నేనే చెప్పలేదులే"

"స్టేషన్ కెళ్దామా అంకుల్" ఉత్సాహంగా అన్నాడు.

ఇబ్బందిగా కదిలాడు ముకుందం. "ఇప్పుడెందుకులేరా. చలిగాలి వీస్తోంది. రేపొద్దుటే కలుద్దువుగాన్లే"

"ఇక్కడేకదా స్టేషన్. గట్టిగా నడిస్తే అయిదు నిమిషాలు పట్టదు"

మరి మాట్లాడలేక మొఖాన గంటు పెట్టుకునుండిపోయాడు ముకుందం.

మెల్లగా బాబుని ఆకట్టుకుని సుస్మిని కట్టబెడతానంటారేమోనని అతడి భయం.

రామారావూ బాబూ కబుర్లు చెప్పుకుంటూ స్టేషన్ కెళ్లారు.

అరగంట ఆలస్యంగా వచ్చింది ట్రెయిన్.

బాబుని చూసి పొంగిపోయింది సుస్మిత.

"వాట్ ఎ సర్ప్రయిజ్" అంది చిన్నపిల్లలా సంబరపడిపోతూ.

"ఎప్పుడొచ్చావు? స్టడీ ఎలా వుంది? నీకేంట్లే ర్యాంక్ స్టూడెంటువి!"

"మనం కలిసి ఆర్నెల్లపైనే అయ్యింది" అన్నాడు బాబు ఆమె అన్నివిధాలా ఎదిగిందని మనస్సులో లెక్కలేసుకుంటూ.

"అవునవును, మనదార్లు వేరయ్యాయి కదా"

"అదేమోగాని ఇప్పుడు వెళ్తున్నది మాత్రం ఒక్కదార్లోనే"

"అబ్బో... బాబు మాటలు నేర్చాడే"

"హాస్టల్ లీడర్వి అయ్యావుట"

"ఫ్రెండ్స్ బలవంతపెడితేనూ..."

వారి సంభాషణ తెగేట్లు లేదన్పించి "ముగ్గురం రిక్షాలో వెళ్ళడం కష్టం. ఎలా మరి? రెండు రిక్షాలు పిలవనా? " అన్నాడు రామారావు.

"ఎందుకు డాడీ వేస్ట్. సరదాగా కబుర్లు చెప్పుకుంటూ నాలుగడుగులు వేద్దాం పదండి"

"నువ్వు ముందు నడు సుస్మీ. నీ అడుగుల్లో అడుగువేస్తూ నీ వెనక వచ్చేస్తాం" అన్నాడు బాబు.

చటుక్కున వెనుదిరిగి అతడి ముఖంలోకి చూసింది. తబ్బిబ్బుపడుతూ తలదించేసుకున్నాడు.

సుస్మితో మాట్లాడుతూ ఆమె పక్కనే నడుస్తూ ఎంతో గొప్పగా ఫీలయ్యాడు బాబు.

ఏదో విజయం సాధించినట్టుగా వుందతని



డికి.

★ ★ ★

బాబు బి.టెక్ మూడో సంవత్సరంలో కొచ్చాడు.

ముకుందం బాబుకి పాస్‌పోర్ట్ కోసం ప్రయత్నాలు మొదలెట్టాడు.

"అంత తొందరేవిటోయ్" అని నవ్వారు కొలీగ్స్.

"పోలీస్ వెరిఫికేషనూ అదీ ఇదీ అయ్యే సరికి ఆరు నెలల్నుంచి ఏడాదికాలం పట్టొచ్చు ఆఖరు నిమిషందాకా ఆగి టెన్షన్ పడేకన్నా ఇప్పుడు తాపీగా పాస్ పోర్టు సంపాదించుకుని కూర్చోవడం మంచిదికదా" అని చెప్పి వాళ్ళ నోళ్ళు మూయించాడు.

ఆ చుట్టుపక్కల ప్రాంతాలకి చెంది ప్రస్తుతం అమెరికాలో వుంటున్నవారి వివరాలూ పుట్టుపూర్వోత్తరాలూ కూడా సేకరించాడు ముకుందం. కొందర్తో బీరకాయ పీచు సంబంధం కలిపాడు కూడానూ.

వారి తాలూకు వారి కడుపూ కాలూ పట్టుకుని బాబు గురించి అమెరికాలో వుంటున్న వారి బంధువులకి ఉత్తరాలు రాయించాడు. మంచి యూనివర్సిటీలో ఎమ్మెస్ చదవటానికి సీటు సంపాదించి పెట్టమని కోరాడు. పన్లోపనిగా చక్కని ఉద్యోగం రావడానికి సాయపడమనీ అర్థించాడు.

అంతటితో వూరుకోలేదు. బాబు మెరిట్ గురించీ తన బీదరికం గురించీ ఏకరువు పెడుతూ హెల్ప్ చెయ్యమని కోరుతూ తనూ ఉత్తరాలు రాశాడు.

డిగ్రీ చేతికొస్తూనే విమానం ఎక్కి వెళ్ళి పోస్ట్‌గ్రాడ్యుయేషన్ కోర్సు చెయ్యాలి. అది చేస్తూనే ప్రైవేటు జాబు చెయ్యాలి. ఆ పిమ్మట ఓ మల్టీనేషనల్ కంపెనీలోని మంచి పొజిషన్లోకి జంప్‌చెయ్యాలి. అదీ అతడి ప్లాన్. అందుకే ఆ ప్రయత్నాలన్నీను.

"బాబుని మద్రాసులో చదివించడానికే నానాయాతనా పడుతున్నాం. ఇంకా పై చదువులకి అమెరికా పంపడమంటే మాటల్తో పనికాదన్పిస్తోందండీ" ముకుందం మూడ్ బాగుండగా చూసి అంది పార్వతి.

"వట్టి మాటలు కాదు. నిజమే. గట్టి చేతలు కావాలి"

"మనం అంతకి తూగగలమా?"

"తూగలేం. కాని తూగాలి"

"ఎలాగండీ?"

"ఏదో దారి చూస్తాను"

"ఇంకేం దారులున్నాయి. పొలం అమ్మేరు. పల్లెలోని ఇంటి వాటాని మీ అన్నయ్యకి అమ్మేరు. ఆఫీసునుంచి తర్వాతెప్పుడో రావాల్సినవి కూడా ఇప్పుడే తీసేసుకున్నారు. నోరు కట్టుకుని అప్పులు చేస్తూ ఇలా ఎన్నాళ్ళు... పోనీ ఇక్కడే చదివిస్తే? ఆ చదువు ఇక్కడ లేదాండీ?"

"వుంది. కానిక్కడ చదవడు. అమెరికాలోనే చదువుతాడు. ఇక్కడ చదివితే విలువేముంటుందే. అదే ఆ భూతల స్వర్గంలో చదివితే నెలకి వేలకి వేల డాలర్లు ఇస్తామంటూ ఎగరేసుకుపోతారు. కళ్ళు మూసి తెరిచేంతలో కళ్ళు మిరుమిట్లు గొల్పేంత స్థాయికెదిగిపోతాడు నా బిడ్డ. నువ్వే చూస్తావుగా"

"కాని మన పరిస్థితి... మీరు పట్టించుకోవట్లేదుగాని ఈ ఆర్నెల్లలో మీలో చాలా మార్పొచ్చేసింది. బాగా చిక్కిపోయారు. తిండి తగ్గించేశారు. కంటినిండా నిద్రపోవట్లేదు. ఏదైనా అనారోగ్యమేమో డాక్టరుకి చూపించుకోమంటే విన్పించుకోరు"

నవ్వేశాడు.

"ఇంకొక్క గండం వుంది. అదొక్కటీ





గడచి గట్టెక్కేస్తే చాలు ఇక బాబుకి ఎదురుండదు. ఎలా నెగ్గుకొస్తామో అని అనుక్షణం మధనపడుతున్నాను. తపిస్తున్నాను. కలవరిస్తున్నాను"

"ఎందుకింత కష్టం. మీకేమైనా అయితే..." ఆమె స్వరం వణికింది.

"నాకేమీ కాదు. నేటి కష్టమే రేపటి సుఖానికి పునాది"

అతడి దృష్టి గోడకి ఎప్పుడో అంటించిన పోస్టర్‌మీద పడింది. లేచివెళ్లి అభిమానంగా చూస్తూ శుభ్రంగా తుడిచాడు.

"అతిత్వరలో ఇదంతా నిజం కాబోతోంది పార్వతీ. ఇంతటి వైభోగమూ మన స్వంతం కాబోతోంది. ఐశ్వర్యంలో నిలువునా మునిగి తేలే అదృష్టపు ఘడియలు త్వరత్వరగా నడచి రాబోతున్నాయే"

గుండెలు పట్టని ఆనందంతో ముకుందం వుక్కిరిబిక్కిరి అవుతోంటే భయం భయంగా చూసింది పార్వతి.



ముకుందం అక్కా, బావ కామేశ్వర్రావూ వచ్చారు.

కాడి, పాడి వదలి మరీ ముఖ్యమైన పని వుంటే తప్ప ఇద్దరూ పొరుగూరు కూడా వెళ్లరు. అలాటిది ఇద్దరూ కలిసివచ్చారంటే ఏదో పెద్ద విషయమే వుందనుకున్నారు.

అదేమై వుంటుందో ముకుందం సూచాయిగా గ్రహించేశాడు. సమాధానం కూడా సిద్ధం చేసేసుకున్నాడు.

రాత్రి భోజనాలయ్యాక అంతా ముందు గదిలో కూర్చున్నారు.

"బాబు చదువు ఈ ఏడాదితో అయిపోతుందికదా" అడిగాడు కామేశ్వర్రావు.

"డిగ్రీ అవుతుంది. పై చదువులకి అమెరికా వెళ్లాలని అప్పుడే ఏర్పాట్లు చేసేసుకున్నాడు"

"మన వంశంలో అంత పెద్ద చదువు చదివినవాళ్లూ లేరు విమానం ఎక్కినవాళ్లూ లేరు. అలాటిది ఏకంగా విదేశాలకెళ్లబోతున్నాడంటే నాకెంతో ముచ్చటగా వుందిరా తమ్ముడూ. మనమంతా గర్వపడేలా చేస్తున్నాడు బాబు. నాన్న బతికి వుంటే వూరంతా పండగ చేద్దుడు" అంది ముకుందం అక్కయ్య.

ముకుందం పెదవుల మీద విజయరేఖ మెరిసింది.

"ఆ గొప్పలో సగం మీ తమ్ముడికే దక్కుతుంది వదినా. ఇల్లూ ఒళ్లూ పట్టించుకోకుండా ఎప్పుడూ బాబు గురించే వాడి చదువు గురించే కలవరిస్తూంటారు. బాబు చదువే ఆయన ఊపిరైపోయిందనుకో" అంది పార్వతి.

"మరొకళ్లూ మరొకళ్లూ అయితే ఎప్పుడో కళ్లు తేలేసేవారు. ముకుందం గనుక అన్ని రకాల ఆటుపోట్లకీ తట్టుకుని చదివించాడు. బాబుకన్నా ముకుందాన్నే మెచ్చుకోవాలసలు"

కామేశ్వర్రావు మాటలకి ముకుందం భుజాలు రెండంగుళాలు పెరిగాయి. పార్వతి మనస్సు ఆనందంతో తృప్తితో నిండిపోయింది.

"నాదేముందిలే. బాబు కష్టపడ్డాడు. పైకి వచ్చాడు" అన్నాడు ముకుందం.

"అలా అనొద్దురా తమ్ముడూ. ఈ రోజుల్లో అన్నీ అమరిస్తే మాత్రం ఎంతమంది చదువుకుంటున్నారు? ఎంతమంది నిచ్చెనమెట్లెక్క గలుగుతున్నారు? వాడి చేతిరేఖలకి నీ చేయూత తోడయ్యింది. గబగబా అందలం ఎక్కెయ్యగలిగాడు"

ఈ మాట బావుందన్నట్టు తలపంకించాడు ముకుందం.

"మీ తమ్ముడి చేతలే కాదోయ్ మా చెల్లెలి పూజలూ పైకి కన్పించని సేవలూ కూడా..ఓ



కారణమే" అన్నాడు కామేశ్వర్రావు.

ఆ పిసరంత పొగడ్తకి ఏనుగెక్కినంత సంబరపడింది పార్వతి.

"చల్లకొచ్చి ముంత దాచడం ఎందుగ్గాని సంబంధం కదుపుదామని వచ్చాంరా తమ్ముడూ. ఇవాళ్టి తిథి బావుంది. ఒక మాటనుకుంటే బావుంటుందనొచ్చాం" అందతడి అక్కయ్య.

"ఏ విషయం గురించంటున్నావు" ఏమీ ఎరగనట్టు అడిగాడు.

"మన సంబంధం గురించేరా. కాత్యాయిన్ని బాబుకి చేసుకోమని అడగటానికొచ్చాం"

చిన్నగా నవ్వేడు. "చదువు పూర్తికాలేదు. ఉద్యోగంలో సెటిల్ కాలేదు. ఇప్పుడు పెళ్లేవిటే అక్కయ్యా"

"ఇప్పుడే చేసేద్దామనడం లేదయ్యా. ఒక మాట అనుకుంటే మంచిదికదా! వేణ్ణీళ్లకి చన్నీళ్లలా మేమూ పై చదువులకి కొద్దో గొప్పో సర్దుతాం గనుక నీకూ వెసులుబాటుగా వుంటుంది"

"ఖర్చు తలకి మించిన భారం కానున్న మాట నిజమే. ఎలావోలా నేనే మోస్తాను తప్ప బాబుకిప్పుడే పెళ్లి చేసి వాడికాళ్లకి బంధం వెయ్యను"

"ఇప్పుడే పెళ్లి చేద్దామనటం లేదురా. నువ్వెప్పుడు చేద్దామంటే అప్పుడే చేద్దాంరా తమ్ముడూ"

"మీరు లేనిపోని ఆశలు పెట్టుకోవద్దు. బాబుకి దగ్గరి సంబంధం చేసుకోవడం ఇష్టంలేదు. కాత్యాయినికి వేరే మంచి సంబంధం చూసి చేద్దాం"

ముకుందం మాటలకి నివ్వెరపోయారంతా.

కట్నకానుకల గురించి బెట్టు చేస్తారనుకున్నారు తప్ప అంత ఖచ్చితంగా నిర్మొహమాటంగా చెప్పేస్తాడనెవరూ వూహించలేదు.

"నువ్వైనా చెప్పు పార్వతీ. అయిన సంబంధం. పాలూ నీళ్ళలా కలిసిపోతుంది పిల్ల. మీ అన్నయ్య వున్నంతలో బాగానే ఇస్తారు. పైచదువులకీ సర్దుతారు. అటు మీకూ వెసులుబాటుగా వుంటుంది. పిల్లని మీ కడుపులో వేశామని మాకూ నిశ్చింతగా వుంటుంది" అంది ముకుందం అక్కయ్య.

"ఈ విషయంలో ఎవరి మాటా వినదలుచుకోలేదు" అంటూ లేచాడు ముకుందం.

అవాక్కయ్యారంతా.

"అది కాదురా తమ్ముడూ! ఆడబడుచుని. ఆశతో పుట్టింటికొచ్చి నోరు తెరిచి అడిగాను..."

"బాబు పెళ్ళి సంగతి తప్ప ఇంకేదైనా అడుగు ఇస్తాను."

"నిన్ను అడిగి పట్టుకెళ్ళాల్సిన స్థితిలో లేంలేవయ్యా. భగవంతుడి దయవల్ల మా పరిస్థితి బాగానేవుందిలే. ఇంకా కూర్చున్నావేమే. లే. మీ తమ్ముడికి మేనకోడలి మీద ఎంత ఆపేక్ష వుందో తెలీటంలేదూ!" అన్నాడు కామేశ్వరరావు విసురుగా లేస్తూ.

"అదికాదు అన్నయ్యగారూ..."

పార్వతి సర్దిచెప్పబోయింది గానీ ఆయన వినిపించుకోలేదు. ఏమీ పట్టనట్టు వుండిపోయాడు ముకుందం.

పార్వతి బలవంతం మీద ఆ రాత్రికుండిపోయి ఉదయమే లేచి కాఫీనీళ్ళయినా తాగకుండా వెళ్ళిపోయారు కామేశ్వర్రావు దంపతులు.

"దగ్గరి సంబంధం చేసుకోనని బాబు ఎప్పుడన్నాడండీ" వాళ్ళెళ్ళాక అడిగింది పార్వతి.

"బాబు అన్లేదు. వాడి తరపున నేనే అన్నాను"

విస్మయంగా చూసి అంది "అయిన




సంబంధం. కాత్యాయిని మన కళ్ళముందు పుట్టి పెరిగిన పిల్ల. ఈడూజోడూ బావుంటుంది. వాళ్ళపని బాగానే వుందిగనుక కట్నమూ బాగానే ఇస్తారు. చదువుఖర్చు భరిస్తానని కూడా అంటున్నారు. మీరింకో సారి బాగా ఆలోచించి మాట్లాడివుంటే బావుండేది. మన బరువూ తగ్గేది, బాబూ సుఖపడేవాడు"

"అమెరికాలో చదివి అక్కడ కోట్లు ఆర్జించి వచ్చే బాబుకి ఓ పల్లెటూరి అమ్మాయినిచ్చి పెళ్లి చేస్తానా? ఎవరైనా వింటే నవ్విపోతారుగాని వూరుకో"

"కాత్యాయిని ఇంటర్ వరకూ చదివింది కదండీ"

"అదీ ఓ చదువేనా! అసలు సరదాకి కూడా బాబుకి చేసుకోమని అడిగే అర్హత లేదువాళ్లకి. వాళ్లెక్కడ మనమెక్కడ? చూస్తూండు. బాబు ఎయిర్‌పోర్టునుంచి తిన్నగా వెళ్లి అత్తవారింటిముందు కారుదిగే వీలున్న సంబంధం చేస్తానే. కారు టైరుకి చిన్నపాటి మట్టి కూడా అంటుకోని పట్నపు సంబంధం చేస్తానే"

"అలాటి పెద్దింటిపిల్ల, పట్నపు అమ్మాయి వల్ల బాబు సుఖపడతాడంటారా? రేపు కాలూ చెయ్యీ వంగేక మన ఆలనా పాలనా చూస్తుందంటారా? " మనస్సులోని భయాల్ని బయటపెట్టింది.

"భేషగ్గా, కాలు నేలమీద మోపాల్సిన అవసరం లేకుండా అన్ని ఏర్పాట్లూ డబ్బు చేసిపెడుతుందే. డబ్బుంటే చాలు సుఖాలు, ఆనందాలు, అభిమానాలు, ఆప్యాయతలు బిరబిర నడచివస్తాయే పిచ్చిదానా. ఈలోకం రూపాయి బిళ్ల అంచుమీద నడుస్తోందే. డబ్బున్న వాడు ఎన్ని మేజిక్కులైనా చెయ్యొచ్చే"

"ఏమోనండి. నాకు మాత్రం భయంగానే వుంది. మేనకోడలు కలిసినట్టు పరాయిపిల్ల కలుస్తుందా ఏవిటి"

ముకుందం మాట్లాడలేదు. అసలామె మాటలే విన్పించుకోలేదు.

★ ★ ★

ప్రపంచంలోని ఆనందమంతా వచ్చి చుట్టేసిందా అన్నట్టుగా వున్నాడు ముకుందం.

దొరబాబు డిస్టింక్షన్‌తో బి.టెక్ పాసవ్వడమే కాదు యమ్మెస్ కంప్యూటర్స్‌లో సీటు ఇస్తూ అప్లై చేసిన ఆరు అమెరికా యూనివర్శిటీల్నుంచీ ఉత్తరాలొచ్చాయి. అతడి ఇంప్రెసివ్ రికార్డు చూసి నాలుగు యూనివర్శిటీవాళ్లు స్కాలర్‌షిప్ కూడా మంజూరు చేశారు.

ఓ యన్నారై బాబు యమ్మెస్ పూర్తి చెయ్యగానే ప్లేస్‌మెంట్ ఇచ్చేట్లు ఓ ప్రముఖ కంపెనీతో ఏర్పాటు కూడా చేశాడు.

కేవలం అమెరికా వెళ్లడానికి విమానం ఛార్జీలూ ఫీజులూ ఆర్నెల్ల ఖర్చూ భరిస్తే చాలు బాబు గట్టెక్కేసినట్టే. స్కాలర్‌షిప్‌తో మిగతా చదువు పూర్తి చెయ్యొచ్చు. పార్ట్‌టైం జాబ్ చేసి అదనంగా సంపాదించుకోడానికి మరో యన్నారై కుటుంబం అవకాశం కల్పించింది.

అందుకే అంత ఆనందంగా వున్నాడు ముకుందం. అతడి పాదాలు నేలమీద ఆనటంలేదంటే అతిశయోక్తికాదు.

స్నేహితుడి టీవీఎస్ మీద కొడుకునెక్కించుకుని వూరంతా తిప్పేడు. మిత్రుల్నందర్నీ కలిశాడు. "అమెరికాలో కంప్యూటర్స్‌లో యమ్మెస్ చెయ్యడానికి వచ్చే నెలలో వెళ్తున్నాడు. అప్పుడే చక్కని ఉద్యోగంకూడా రెడీ అయ్యింది. మీకుతెలుసుకదా భవిష్యత్తంతా కంప్యూటర్లదీ కంప్యూటర్ ఇంజినీర్లదీనూ" అని చెప్పేడు.

బాబుకి మాత్రం ఎంతో దిగులుగా వుంది. ఆందోళనగానూ వుంది.

తల్లినీ తండ్రినీ సుస్మినీ ఇంటినీ ఊరునీ

వదలి ఎక్కడికో దేశం కాని దేశం వెళ్లటం ఎంతో బాధాకరంగా వుంది. అనుకున్నప్పు డల్లా వీళ్ల దగ్గరకి రాలేనుకదా వీళ్లని చూళ్లే నుకదా అని బెంగగా వుంది. వీళ్లందర్నీ మిస్సవుతానే అని విచారంగానూ వుంది.

అదే సమయంలో అమెరికాలో ఎలా వుంటుందో అక్కడి పరిస్థితులకు కనుగు ణంగా తను ఎడ్జస్ట్ కాగలడో లేదోనని ఆందోళనగా వుంది. అక్కడివారితో కలవలే కపోతే అక్కడివాళ్ల అంచనాలకి తగ్గట్టు పనిచెయ్యలేకపోతే ఏమంటారో ఏమవుతుం దోనని టెన్షన్‌గా వుంది.

అయినా తండ్రిముందు ఏమాత్రం బయ టపడ్లేదు. కాని అతన్లోని మార్పుని తల్లి పసిగట్టింది.

"అలా వున్నావేమిట్రా బాబూ. అమెరికా వెళ్తున్నానన్న సంబరం ఏకోశానా కన్పించట్లే దేంరా" అంది పార్వతి.

నిజానికామె పేగునెవరో తెంపి దూరానికి విసిరేస్తున్నట్టుగా వుంది. బాబు తనకంద నంత దూరం వెళ్లిపోతాడనుకుంటే చాలు కళ్లల్లోకి నీళ్లొచ్చేస్తున్నాయి.

"మిమ్మల్నందర్నీ వదలి వెళ్లాలన్పించ ట్లేదు మమ్మీ"

"అలా అనకురా. ఈ రోజుకోసమే ఈ ఘడియకోసమే మీ నాన్న తపస్సు చేశార్రా. ఆయన కోసమైనా నువ్వెళ్లాలిరా. చదువ య్యాక ఒకటి రెండేళ్లు మంచి ఉద్యోగం చేసి వచ్చేద్దువుగానిరా. నిన్ను విడిచి మేం మాత్రం వుండగలమా చెప్పు. మీ డాడీ కూడా అదే చెబుతున్నారు. రెండేళ్లలో రెండు చేతులా సంపాదించి వచ్చేస్తాడు. అప్పుడిక మనమంతా కలిసే వుండొచ్చు అని చెప్పేరు"

"సరేలే. ముందు వెళ్లనీ. తిరిగి రావటం సంగతి తర్వాత చూసుకోవచ్చులే" అన్నాడు.

"శుభమా అంటూ వెళ్తూ అవేం మాటర్రా" అతడి మాటల్లో ఏదో అపశ కునం విన్పించి కలవరపడింది.

"ఇప్పుడు నేనేమన్నాను మమ్మీ"

"ఏమీ అనొద్దురా. నాకేవిటో భయంగా వుంది"

నవ్వేడు. కాని ఆ నవ్వులో జీవంలేదు!



ఇల్లు అమ్మకానికి పెట్టేడు ముకుందం.

ముఖ్యమైన కూడలిలో వుంది ఇల్లు. చుట్టూ ఖాళీ స్థలం వుంది. వాస్తురీత్యానూ బాగుంది. అంచేత వార్త తెలీడం ఆలస్యం గబగబా ఎందరో వచ్చేశారు ఇల్లు చూసుకో డానికి.

బేరం పెట్టేక ఒక రోజల్లా పచ్చి మంచి నీళ్లు ముట్టలేదు పార్వతి.

"ఈ ఇంటికెంతో సేవ చేశాను. ఇప్పుడు చేజేతులా మరొకరికెలా అప్పగించను?" అని ఒకసారీ, "చీరెసారెల్తో ఇక్కడికి ఎప్పుడో పాతికేళ్లనాడు కాపురానికొచ్చాను. ఈ ఇంటినుంచే కాటికెళ్లిపోతాననుకు న్నాను. అలాటిదిప్పుడు" అంటూ మరోసారీ ఏడ్చేసింది.




# పలినముత్యాలు

★ శీలం, గౌరవప్రదం, శీలం ఇతరులకు నేర్పడం మరింత గౌరవప్రదం.

–మార్క్ ట్వయిన్

★ అపరాధం చేయడంకంటే అపరాధం సహించడం ఉత్తమం

–థామస్ పుల్లర్

★ ప్రతివారూ ఎవరికో ఒకరికి విసుగు కలిగిస్తారు. ఇంకొకరికి విసుగు కలిగించక పోవడం ఉత్తమం.

–జెరాల్డ్ బ్రెనాన్

★ తన మోసాన్ని తాను తెలుసుకోవడానికి నిరాకరించే కపటి అసలైన వంచకుడు.

–ఆంద్రిజీన్

★ కాలం గతిస్తుంది. పేరు ప్రతిష్టలు పెరుగుతాయి. సామర్థ్యం ఉడుగుతుంది.

–హమ్మర్స్ ఖజోల్డ్

★ సామరస్య జీవితానికి సహకరించి, గాంభీర్యాన్ని కలిగించేది ధర్మం.

–స్వామి చిన్మయానంద

★ వారివారి దృష్టులలో వృద్ధులు, యువకులు ఎవరికివారు పరస్పరం మూఢులే.

–జార్జ్ చాప్‌మన్

★ రెండు గ్రంధాలు చదవడం కంటే ఒక గురువుని ఆశ్రయించడం ఎంతోమేలు.

–జర్మన్ సామెత

★ జగత్తున పరువు ప్రతిష్టలు నిలుపుకొనుటయే మనుష్యుని జీవితాదర్శము.

–శ్రీరామకృష్ణ

★ ఎవరింట్లో వారే మహారాజులు.

–పర్షియన్ సామెత

★ అవధులు దాటితే ఓర్పే పిరికితనం అనిపించుకుంటుంది.

–జోసఫ్ రోక్స్

★ శక్తి, ఉత్సాహం, ధైర్యం, సాహసం, సహనం అనంతమైనప్పుడు మహోన్నత ఉద్యమాలు సులభసాధ్యాలు.

–వివేకానంద

★ గమ్యస్థానం ఎదురుగా కనిపిస్తూనే వుంటుంది. చేరటంమాత్రం దుర్లభం. చేరడానికి చేసే ప్రయత్నంలోనే ఆనందం వుంటుంది.

–గాంధీ

సేకరణ: పి.వి. రమణకుమార్

ఇల్లు చూడవచ్చినవాళ్లు "తలుపుకుపయో గించిన చెక్క ఏమిటి"

"మామిడి కాయలు తీపా పులుపా" అంటూ ఆరాలు తీస్తోంటే చెప్పలేక చెబు తోంది.

అవాళ ఒక రాత్రివేళ మెలకువచ్చింది పార్వతికి. పక్కమంచం మీద భర్త కన్పించ లేదు. గుండె గుబగుబలాడింది. గబుక్కున లేచి కలయజూసింది.

మామిడి చెట్టుకింద చతికిలబడి కూర్చు నున్నాడు ముకుందం.

"నిద్రరావటంలేదా" అంటూ సమీపిం చింది.

"ఇంటిని అమ్మాలంటే ఎంతో బాధగా వుంది పార్వతీ. మన సుఖసంతోషాలకి సజీవసాక్ష్యం ఈ ఇల్లు. మన బాబు పుట్టిందీ పెరిగిందీ గొప్పవాడిగా ఎదిగిందీ ఇక్కడేకదూ. మన తలదాచుకోడానికి నీడనే కాదు ఆనందాన్నీ తృప్తినీ కూడా ఇచ్చింది. అలాటి ఇంటిని అమ్ముకోవాల్సి రావడం" గొంతు రుద్ధమైంది. ఆపైన మాట్లాడలేకపో యాడు.

"పోనీ అమ్మకుండా వుంటే? "

"బాబు అమెరికా ఎలా వెళ్తాడు చెప్పు? "

ఆమె మాట్లాడలేదు.

"బాబు అందమైన భవిష్యత్తు ముందు ఇదేమీ లెక్కలోది కాదు. చాలా అల్ప విష యంలే పార్వతీ. ఎన్నో ఏళ్ల అనుబంధం గనుక త్రెంచుకోడానికి కాస్త బాధగా వుంటుంది. తర్వాతన్నీ మర్చిపోతాం. ఇంకో నాలుగేళ్లు తిరిగేసరికి గొప్ప మేడ కట్టే స్తాను. అన్ని హంగులూ అమర్చేస్తాను. ఇంద్రభవనాన్ని భువికి రప్పిస్తాను. కాలు మీద కాలు వేసుకుని మహారాజభోగం అనుభవిద్దామే"

"అంత మంచి రోజు త్వరత్వరగా వస్తే బావుణ్ణండీ"

"తప్పకుండా వస్తుందే. నా అంచనా ఏదీ తప్పదు. తప్పడానికి వీల్లేదసలు"

"అవునండీ, మీనోటివాక్కు వృథాపోదు. రేపు మాట్లాడుకోవచ్చుగానీ ఇంట్లోకి పదండి"

లేచాడు. మామిడిచెట్టువంక జాలిగా ఆపేక్షగా చూశాడు.

"బాబు చదువుకి దీన్ని ప్రత్యామ్నా యంగా భావించేవాడ్ని. ఇంకొద్దిరోజుల్లో ఇది పరాయిసొత్తు అయిపోతుంది. బాబు పరాయిదేశం వెళ్ళిపోతాడు. చిత్రంగా లేదూ? "

★ ★ ★

ఇల్లు అమ్మకమూ రిజిస్ట్రేషనూ పూర్త య్యాయి.

ముకుందం ఆశించినదానికన్నా అధికధరే వచ్చింది. బాబు విదేశీ యాత్రకి సరిపడా డబ్బు సర్దుబాటైనందుకు అంతా పొంగిపో యారు.

బ్యాంకుకెళ్ళి ట్రావెలర్స్ చెక్కులూ, డ్రాఫ్టు లూ తీసుకున్నారు. విమాన టిక్కెట్లు అంత క్రితమే ఎడ్వాన్స్ సొమ్ముతో తీసేసుకు న్నారు.

బాబు వెళ్ళాక ఇల్లు ఖాళీ చేద్దామని చూశారుగానీ కొనుక్కున్నవాళ్ళు పడనివ్వ లేదు. మంచిరోజులంటూ కూర్చోవడంతో వెంటనే ఖాళీ చేయాల్సొచ్చింది.

సామానంతా ట్రాక్టర్లకెత్తారు. విషాదవద నాలతో ఇంటినే చూస్తుండిపోయారు చాలా సేపు.

ఆ ఇంట్లో గడిపిన స్మృతుల్ని నెమరువే సుకున్నారు ముగ్గురూ.

గడపకీ భూదేవికీ మొక్కింది పార్వతి.

చెట్టు మాను మొదలు తడిమాడు ముకుందం.





బాబు తడికళ్ళతో బిక్కుబిక్కుమంటూ చూశాడు.

బయల్దేరబోతోంటే వెక్కివెక్కి ఏడుస్తూ కూలబడింది పార్వతి.

"వూరుకో. ధైర్యం తెచ్చుకోమరి. రెండు మూడేళ్ళలో రెట్టింపు ధర ఇచ్చి అయినా మళ్ళీ మనింటిని కొనేస్తాను పార్వతీ. మనకి కలిసొచ్చిన ఇల్లు. మన అదృష్టదాయిని. దాన్ని వదులుకుంటామేవిటి. నా మాటనమ్ము" అంటూ ఓదార్చాడు ముకుందం.

"నావల్లే ఇలా జరిగింది" అని బాబు బాధపడితే అలా మాట్లాడొద్దంటూ కసురుకున్నాడు. "ఇలాంటివి మరిన్ని కొంటానని ధీమాగా చెప్పరా" అన్నాడు.

ట్రాక్టర్లు కదిలాయి.

ఇంటి ప్రాంగణం దాటుతోంటే ముకుందానికి సన్నగా గుండెల్లో నొప్పి వచ్చింది. ఆగాడు. భరించరానిదిగా వుంది నొప్పి. కాళ్ళు తేలిపోతున్నాయి. ఒళ్ళంతా ముచ్చెమటలు పోస్తున్నాయి.

అడుగువేసే శక్తి కూడా లేనట్టు గుండె నొక్కుకుంటూ చతికిల బడిపోయాడు.

ఏమైందంటూ పరిగెత్తుకొచ్చారంతా.

మాట్లాడగల స్థితిలో లేడతడు. పళ్ళ బిగువున బాధ భరిస్తూ ఏం ఫరవాలేదన్నట్టు చూశాడు.

తనకి గుండెనొప్పి వచ్చిందని ముకుందానికి అర్థమైంది. కానాసంగతి బయటపడితే ఆసుపత్రికి తీసుకెళ్తారు. నానా హడావిడీ చేస్తారు. మర్నాటి బాబు ప్రయాణానికి ఆటంకం ఏర్పడుతుంది. తననిలా వదిలి విదేశాలకెళ్ళడానికి బాబు ఇచ్చగించకపోవచ్చు. అప్పుడు ఇన్నేళ్ళ వృధా తపనా కృషీ బూడిదలో పోసిన పన్నీరవుతాయి.

అందుకని మూగగా బాధపడుతూండిపోయాడు.

అతడి బాధ తెలిసినట్లు మామిడిచెట్టు తల వూపింది. చల్లనిగాలి అతడి నిలువెల్లా తడిమింది. ఎంతో రిలీఫ్‌గా అన్పించింది. కొంచెంగా గుండెనొప్పి తగ్గింది.

అతికష్టంమీద రిక్షా ఎక్కాడు.

ఇల్లు పరాయిదవుతోందన్న బాధ భరించలేకుండా వున్నారనుకున్నారంతా.

'ఇంతసేపూ నాకు ధైర్యం చెప్పి ఇప్పుడు తను ఇదవుతున్నారు చూడు. ఈ ఇల్లన్నా ఈ చెట్టన్నా ఆయనకి ఎక్కడలేని అభిమానమూనూ' అనుకుంది పార్వతి కళ్ళు తుడుచుకుంటూ.

ఊరి చివరి కొత్తగా ఏర్పడ్డ కాలనీలో ఓ చిన్న పోర్షన్ అద్దెకు తీసుకున్నారు. అందులోకి సామానంతా చేర్చారు.

ఆ మర్నాడు బాబు అమెరికా ప్రయాణం.

అతడికి వీడ్కోలు చెప్పడానికి పనిగట్టుకొచ్చింది సుస్మిత.

అందర్నీ వదలి ఏకాకిలా వెళ్ళాల్సొచ్చినందుకు అప్పుడు ఏకాకిగా ఫీలవుతున్న బాబు ఆమెని చూసి మరింత దిగులుపడ్డాడు.

"ధైర్యంగా వెళ్లిరా. పదిమందితో కలవడం కలుసుండటం అలవాటు చేసుకో. నీలో నువ్వే కుంచించుకుపోవద్దు. ముడుచుకుపోనూవద్దు. పంచుకున్న సంతోషం పెరుగుతుంది. ఉంచుకున్న సంతోషం తరుగుతుంది. ఆ సంగతి మర్చిపోకు. విజ్ఞానాన్ని ఆర్జించడానికెళ్తున్నావు. నీ విద్యనీ విజ్ఞానాన్ని మనదేశంకోసం ఉపయోగించినప్పుడే దేశపు ఋణం తీర్చుకున్నవాడివవుతావు. నువ్వీ స్థితికి రావడం వెనుక ఎంతో ప్రభుత్వ ధనం వుంది. ఆ ధనం పన్నుల రూపేణా ప్రజలనుండి వసూలు చేసిందే. అంటే వాళ్ళందరికీ నువ్వు ఋణపడివున్నావన్నమాట. వాళ్ళకోసం నీ విజ్ఞానాన్ని ఉపయోగించడమే ఋణవిముక్తికి మార్గం" అని



చెప్పిందామె.

ఆమె చెప్పిందంతా శ్రద్ధగా విన్నాడు బాబు. కొత్తసంగతి తెలిసినట్టు ఫీలై కృతజ్ఞతగా చూశాడు.

ఎన్నో జాగ్రత్తలు చెప్పి కళ్ళనీళ్ళు పెట్టుకుంది పార్వతి.

మిత్రులు రైల్వేస్టేషన్ కొచ్చి వీడ్కోలు చెప్పారు.

బాబు, ముకుందం రైల్లో హైదరాబాద్ వెళ్ళారు.

బాబు నెర్వస్‌గా ఫీలవుతుండడం గమనించి ధైర్యవచనాలు చెప్పాడు. ఆంజనేయస్వామి కుంకుమ దగ్గరుంచుకోమన్నాడు. అమెరికాలో మనవాళ్ళు చాలామంది వున్నారన్నాడు. రెండేళ్ళు ఇట్టే తిరిగొస్తాయన్నాడు. లక్ష్యసాధనకి వజ్రసంకల్పం ముఖ్యమన్నాడు.

అతడి మాటలూ, ఉద్బోధా బాగానే పని చేశాయి. బాబు మోము కొంచెం తేటబడింది.

విమానం గాలిలోకి ఎగిరి ఆకాశంలోకి దూసుకుపోయింది.

ఆశగా ఆకాశంలోకి చూస్తుండిపోయాడు ముకుందం.

★ ★ ★

ఇదివరకు స్వయంగా వచ్చి పిలిచినా సరే పెళ్ళికి కూడా వెళ్ళేవారు కాదు ముకుందం దంపతులు.

ఇప్పుడు పిల్ల సవత్తాడిందని కార్డుముక్క వస్తే చాలు కాళ్ళకి చక్రాలు కట్టుకుని పరుగెడుతున్నారు.

బంధుమిత్రుల ఇళ్ళల్లోనేకాదు పరిచయస్తుల ఇళ్ళల్లో సైతం శుభాశుభకార్యాలేం జరిగినా సరే అక్కడ ప్రత్యక్షమవుతున్నారు.

అక్కడున్న వారందరికీ కూడా అమెరికాలో కంప్యూటర్స్‌లో యమ్మెస్ చేస్తోన్న దొరబాబు తండ్రిగా పరిచయం చేసుకుంటున్నాడు ముకుందం.

అంతటితో ఆగట్లేదు. కొడుకు ఘనత గురించి స్కాలర్‌షిప్ వివరాలు గురించి పార్ట్‌టైమ్ జాబ్ గురించి రేపోమాపో రాబోయే పెద్ద ఆఫీసర్ ఉద్యోగం గురించి అప్పుడు లక్షల్లో రాబోయే జీతం గురించి చిన్నసైజు ఉపన్యాసం ఇస్తున్నాడు.

అవతలివాళ్ళు ఆసక్తి ప్రదర్శిస్తున్నా లేకున్నా సరే తను చెప్పాలనుకున్నదంతా కక్కేస్తున్నాడు. త్వరలోనే కార్లూ, బంగళాలూ కొనేస్తామనీ ఇక నేలమీద నడవమనీ పట్టు తివాసీల మీదే నడుస్తామనీ తమ హోదా అంతస్తూ మంత్రించినట్టు మారిపోనున్నవనీ చెబుతున్నాడు.

ఇలాంటి చిన్న ఫంక్షన్‌కి చిన్న ఇళ్ళల్లోని ఫంక్షన్‌కి రావడం బహుశా ఇదే ఆఖరిసారన్నట్టుగా మాట్లాడుతున్నాడు.

మరికాస్త వీలు చిక్కితే చాలు అమెరికా గొప్పతనాన్ని వర్ణిస్తూ భూతల స్వర్గమంటూ వివరిస్తూ చొంగ కార్చేస్తున్నాడు.

మిగతావారి పిల్లలు ఏంచదువుతున్నాసరే 'ప్చ్' అంటూ పెదవి విరిచేస్తున్నాడు.

"మీరు దండుగమారి కోర్సుల్లో చేర్చి చాలాదండగ చేస్తున్నారు. భవిష్యత్తంతా కంప్యూటర్లదేనండీ. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. కంప్యూటర్ కోర్సులో చేర్చేయ్యండి" అని సలహా ఇస్తున్నాడు.

"బిట్స్ పిలానీలూ, ఐఐటి కాలేజీలూ ఏంలాభంలేదండీ. అమెరికా పంపించెయ్యండి. అక్కడ చదివితేనే చదివినట్టు. ఇంకెక్కడ చదివినా వానాకాలం చదువేననుకోండి" అనేస్తున్నాడు.

అతడి అమెరికా భజనచూసి కుర్రాళ్ళాయనకి 'అమెరికా అంకుల్' అని పేరు పెట్టేశారు. చిత్రమేమిటంటే అదో బిరుదుగా భావించి ఆనందపడిపోతున్నాడు




ముకుందం.

ఇక పార్వతి కూడా భర్తకి తీసిపోవ ట్లేదు.

"మీకు తెలుసా పిన్నిగారూ. మా అబ్బాయి అమెరికాలో కంప్యూటర్ ఇంజినీరింగ్‌లో పెద్ద చదువు చదువుతున్నాడు. ఇంకో ఏడాదిలో నెలకి రెండుమూడు లక్షల దాకా సంపాదిస్తాడు. మాదంతా ఇంక రాజయోగమే. మొదటినెల జీతంతోనే కాసుల పేరూ వడ్డాణమూ చేయించేస్తానంటున్నాడు బాబు. అమెరికాలో బంగారం కారు చౌక పిన్నిగారూ" ఇలా సాగుతోందామె వాగ్ధార.

అంతా తమని విభిన్నంగా చూస్తూ తమ అదృష్టానికి అసూయపడ్తూ తమని అభినందనల్తో ముంచెత్తుతున్నందుకు జన్మధన్యమైనట్టుగా, భోగభాగ్యాలు లభించినట్టుగా పొంగిపోతున్నారు ముకుందం దంపతులు.

★ ★ ★

రామారావు వాళ్ళింటికెళ్ళారు ముకుందమూ, పార్వతీ.

సుస్మిత యంబీబియస్ పాసయ్యింది. హౌస్ సర్జన్ చేస్తోంది. ఆమె తమ్ముడు శ్రీను చదువుకుంటూనే సంగీత కచేరీలు చేస్తున్నాడు. మ్యూజిక్ ప్రోగ్రామ్స్ ఇస్తున్నాడు.

మర్యాదలయ్యాక అన్నాడు రామారావు. "ఇంకో ఆర్నెల్లలో బాబు చదువు పూర్తవుతుందనుకుంటాను"

"అవునవును అప్పుడే ఆఖరి సెమిస్టర్ మొదలైపోయింది. అవుతూనే వుద్యోగంలో చేరిపోతాడు. ఇంకా చాలా మంచి ఆఫర్లు వస్తున్నాయిట. నెలకి ఇరవై ముప్పైవేల డాలర్లదాకా ఇస్తామంటున్నార్ట. వాటినెలా మదుపు చెయ్యడమా అని ఆలోచిస్తున్నానప్పుడే. ముందు పోష్ లొకాల్టీలో అయిదారొందల గజాల స్థలం కొని బ్రహ్మాండమైన బిల్డింగు కట్టాలి"

"బాబుని చూసి చాలా రోజులైపోయింది. ఇప్పుడు బాగా మారిపోయివుంటాడు"

"అవునొదినా. ఫొటోలు తీయించుకుని ఆల్బంలో పెట్టి పంపరా అని ఎన్నిసార్లు రాసినా పట్టించుకోడు. అలాగే అంటూనే బద్ధకించేస్తున్నాడు. ఈమధ్య రోజూ కలల్లో కొస్తున్నాడు బిడ్డ" అంది పార్వతి.

"నీకింకా ఏడెనిమిది నెలల సర్వీస్ వుందనుకుంటాను ఏం ముకుందం"

"అవునంతే. అయినా ఆ వెధవ ఉద్యోగం గురించి ఎవడేడ్చాళ్ళే. రిటైర్మెంట్ దగ్గర్లో లేకపోతే నేనే రిజైన్ చేసేద్దును. బాబు పంపే లక్షల్ని ఇన్వెస్ట్ చెయ్యడమే ఓ పెద్ద పని తెలుసా? ఇకనుంచి ఇన్కంటాక్స్ గొడవలు కూడా వచ్చిపడ్తాయికదా" అన్నాడు గొప్పగా.

"మా సుస్మి యండీ చేస్తానంటోంది" అంది సరస్వతి.

"చేయించెయ్యండి. ఆ విషయంలో రెండో ఆలోచనే పెట్టుకోవద్దు. ఈ రోజుల్లో యం.బి.బి.యస్‌లు సందుకొకళ్ళు చొప్పునుంటున్నారు. స్పెషలైజేషన్ లేకపోతే ఈగలు తోలుకుంటూ కూర్చోవాల్సిందే. అవునూ- సుస్మితని అమెరికా ఎందుకు పంపించకూడదూ? త్వరగా వీసా వచ్చే ఏర్పాట్లు నేను చెయ్యగలను. మనకి తెలిసినవాళ్ళు చాలామంది వున్నారు. అమెరికా వెళితే ఇక డబ్బే డబ్బు"

"మనిషిక్కావాల్సింది డబ్బు ఒక్కటే కాదు కదా"

రామారావు మాటలకి వింతమాట విన్నట్టు వికృతప్రాణిని చూసినట్టు చూశాడు ముకుందం. 'నీకు పిచ్చి పట్టలేదు కదా' అన్నట్టుగా కూడా చూసి నవ్వేడు.

"డబ్బుంటే కొండమీది కోతిని దింపొచ్చు ఆనందాలని ఇంటిముందు కట్టేసుకోవచ్చు స్వర్గసౌఖ్యాలని జుర్రుకోవచ్చు. అసలు

డబ్బుతో కొనలేనిది సాధించలేనిది అంటూ ఈ భూమ్మీద ఏమీ లేదురా రామారావ్"

"అది నీ అభిప్రాయం కావొచ్చు కానది సరైంది కాదు. తర్కంకోసం అనటంలేదు. ముందుముందు నీకే తెలుస్తుందిలే. అనుభవాన్ని మించిన గురువు లేడుకదా"

"మనిషికి ఉన్నది పుష్టి, గొడ్డుకి తిన్నది పుష్టి అన్నార్రా. నువ్వన్నట్టు మున్ముందు తప్పక తెలుస్తుంది. ఏమనో తెలుసా? డబ్బున్న చోటే స్వర్గం వుంటుందని!" నవ్వేడు గర్వంగా.

పిచ్చివాడ్ని చూసినట్టు చూసి మందహాసం చేశాడు రామారావు.

వారి సంభాషణ ఆడవాళ్ళకి నచ్చలేదు. మాట మారుస్తూ అంది పార్వతి. "శ్రీనుని మీరు పాడుజేస్తున్నారనుకుంటున్నాను వదినా. ఆ పాటలూ అవీ ఎందుకు. ఎంచక్కా చదువుకుంటే ఏదో ఉద్యోగం వస్తుంది కదా"

"వాడికి సంగీతమంటే చాలా ఇష్టం. ఇరవైనాలుగ్గంటలూ అందులో మునిగి తేలాలనుంటుంది వాడికి. తనకిష్టమైన కళలో రాణిస్తాడని మా నమ్మకం. అందుకే ప్రోత్సహిస్తున్నాం" అంది సరస్వతి.

"మీరు ప్రోత్సాహం పేరిట వాడి భవిష్యత్తుని చేజేతులా నాశనం చేస్తున్నారు. కళ కీర్తిప్రతిష్టల్ని తెచ్చివ్వగలదుగాని కనకాన్ని సంపాదించిపెట్టదు. అనాదినుంచి ఇప్పటివరకూ ఏ కళాకారుడ్నైనా సరే తీసుకోండి. అంతా దారిద్ర్యంలో మగ్గి కష్టాలలో కడతేరిన వాళ్ళే. దానికన్నా ఏ గుమస్తా ఉద్యోగంలో దూర్చినా మంచిదే. మన మున్సిపాలిటీలో గుమస్తా పోస్టులు ఖాళీలున్నాయంటున్నారు. మీ వాడికి ప్రయత్నించకూడదూ? "

"అలాటి ఉద్యోగాలు శ్రీనుకిష్టంలేదు. ప్రవృత్తే వృత్తి కావాలని వాడి పట్టుదల"

"వాడి ఇష్టమేంటి బోడి ఇష్టం. చెవులు మెలేసి అందులో దూరిస్తేసరి ఆనక అదే ఇష్టమైకూర్చుంటుంది. స్థిరమైన సంపాదన లేకపోతే రేపు పెళ్ళి సంబంధాలు మట్టుకు ఎలా వస్తాయి? "

ముకుందం మాటలకెవరూ బదులివ్వలేదు.

అతడు ఇదివరకటి ముకుందం కాదనుకున్నారు రామారావూ సరస్వతీ.

★ ★ ★

ముకుందం రిటైరయ్యాడు.

ఆ సందర్భంగా ఆఫీసు వారంతా కలిసి చిన్న వీడ్కోలు, సభా ఏర్పాట్లు చేశారు.

ముకుందంలోని మంచి గుణాలు, కలుపుగోరుతనం, పనిలో ప్రదర్శించే నైపుణ్యం, అకింతభావం, వగైరాల గురించి అధికారులూ, మిత్రులూ కూడా ప్రసంగించారు.

ముకుందం కొడుకు అమెరికాలో ఉన్నత విద్యని పూర్తిచెయ్యబోతున్నాడన్నారు. కొద్ది రోజుల్లోనే గొప్ప ఉద్యోగంలో స్థిరపడబోతున్నందుకు ఎంతో ఆనందంగా వుందన్నారు. కొడుకు అలా ఎదగడం వెనక ముకుందం కృషి, పట్టుదల ప్లానింగ్ ఎంతో వున్నాయనీ, అసలా విజయం ముకుందానిదే అనడం సబబు అన్నారు.

ఏకైక సంతానం గనుక ఆ పుత్రరత్నం ఉన్నత స్థాయికి చేరుకున్నాడు గనుక ఇక ముకుందానికెలాటి చీకూ చింతా వుండవన్నారు. తృప్తిగా నిశ్చింతగా రిటైర్మెంట్ జీవితాన్ని గడిపేస్తాడనుకోడానికెలాటి సందేహమూ లేదన్నారు. ఆఫీసులో అతడు లేని లోటు తీర్చలేనిది పూడ్చలేనిది అన్నారు.

అనంతరం ముకుందం మాట్లాడాడు.

సాధారణంగా రిటైరయ్యేప్పుడు తమలోని భాగాన్నేదో కోల్పోతున్నట్టు తమ శక్తినేదో ఎవరో లాగేసుకుంటున్నట్టు ఫీలవుతారు. ఒక్కసారిగా సాధారణ మనిషైపోయినట్టు





అకస్మాత్తుగా 'బోలు'గా అయిపోయినట్టు ఒకరకమైన భ్రమకి లోనవుతారు. ఆ శూన్యాన్ని ఫేస్ చెయ్యడమెలాగో తెలీక సహోద్యోగుల్తోవున్న అనుబంధాన్ని తెంచు కోలేక కళ్ళనీళ్ళ పర్యంతమవుతారు. ఉద్విగ్నులై బరస్ట్ అవుతూంటారు.

కాని ముకుందం అలా లేడు. అలా మాట్లాడనూలేదు.

త్వరగా రిటైర్ అవుతున్నందుకు చాలా సంతోషంగా వుందన్నాడు. ఒకవేళింకా సర్వీసువుండి వుంటే రిజైన్ చేసేసేవాడ్నని చెప్పేడు.

ఇన్నాళ్ళూ ముకుందం ఒక బడుగు గుమస్తా. చాలీచాలని జీతంతో కుస్తీపట్టే సగటు మనిషి. కోరికల్ని అణచుకుని నిరాశతో అసంతృప్తితో బతుకుతోన్న కలలమనిషి!

ఇకనుంచలా కాదన్నాడు.

వాళ్ళిహ కొత్త ముకుందాన్ని చూస్తారన్నాడు.

ఇక తనకి తీరని కోరికలూ, తీర్చుకోలేని కలలూ అనేవి వుండనే వుండవన్నాడు. తనిన్నేళ్లూ సాధించలేని వాటిని అలవోకగా అరచేతుల్లో ఆడిస్తానన్నాడు. దూరమైన ఆనందానుభూతుల్ని ఇంట్లో కట్టిపడేస్తానన్నాడు.

ఎవరికెలాటి సాయం కావాల్సొచ్చినా వచ్చి అడగండి సాయపడ్తానని భరోసా ఇచ్చి శెలవు తీసుకున్నాడు.

నివ్వెరపోయారంతా.

చాలామంది అసూయపడ్డారు.

కొందరు మాత్రం నవ్వుకున్నారు!

★ ★ ★

కెవ్వుమంటూ అరుస్తూ లేచింది పార్వతి.

"బాబు... బాబు..." అంటూ పిచ్చి చూపులు చూస్తూ వణకసాగింది. ముచ్చెమటల్తో ఆమె ఒళ్ళు తడిసి ముద్దయ్యింది.

చటుక్కున లేచొచ్చి పట్టుకున్నాడు ముకుందం.

"ఏవయ్యిందే" అంటూ కుదిపి అడిగాడు.

"నా బాబుకి, హమ్మో...!" అతడ్ని బల్లిలా కరుచుకుని ఏడ్వసాగింది.

"ష్... బాబుకేం కాలేదుగాని వూరుకో. పీడ కలకన్నావంతే. ఏం కాదు" వెన్ను నిముర్తూ ధైర్యం చెప్పేడు.

"నిజమా" అంటూ చూసింది.

"నిజమేనే. ఇంద మంచినీళ్ళు తాగు"

గటగటా తాగేసింది. ఆంజనేయస్వామి కుంకుమ భరిణె తెచ్చి బొట్టు పెట్టాడు.

"ఇంకెలాటి భయాలూ నిన్ను తాకవు. నిశ్చింతగా నిద్రపో" అన్నాడు తల నిముర్తూ.

"నా బాబుకి నా కన్నపేగుకి ఏంకాలేదు కదా?"

"ఏమీకాలేదు. కాబోదు కూడా. వాడి జాతక చక్రం ఎప్పుడో వేయించానే. వాడిది శుక్ర మహర్దశ. నూరేళ్ళు చల్లగా బతుకుతాడే. ఇశ్వర్యంలో మునిగి తేలతాడే"

ఆమెకి నమ్మకం చిక్కి స్థిమితపడింది.

"బాబుని చూసి రెండేళ్ళైపోతోంది. రోజూ కలలోకొస్తున్నాడండీ. ఒకసారి చూడాలి. రమ్మనరూ" గోముగా అడిగింది.

"యమ్మెస్ పూర్తి కావొచ్చింది కదా. ఇవాళ రేపట్లో చక్కని ఉద్యోగంలో చేరిపోతాడు. మొదటి నెల జీతం తీసుకుంటూనే వచ్చి నీముందు వాలతాడు. సరేనా?"

"తప్పకుండా వస్తాడంటారా?"

"ఎందుకు రాడే పిచ్చిదానా. అనవసరపు ఖర్చని ఇన్నాళ్లూ రావొద్దన్నానుగానీ ఇక నుంచి డబ్బేడబ్బు కదా. నెలనెలా వచ్చి మనల్ని చూసిపోడూ"

నిట్టూర్చింది.

"అవునూ. మన బాధలు, కష్టాలు, నిరాశలు, నిట్టూర్పులు, నిరీక్షణలూ అన్నిటికీ మంగళం పాడే రోజులు రాబోతోంటే తీయని కలలు కనక పీడకలలు కంటున్నావేంటి పార్వతీ"

"నాది కన్న కడుపండీ. బిడ్డ క్షేమం ముఖ్యం. ఆ తర్వాతే వాడి బాగూ భాగ్యమూనూ"

"పుట్టినవాళ్లంతా కొడుకులు కాదే. కన్నవాళ్ళ కళ్లల్లో కాంతుల దీపాలు వెలిగించేవాళ్ళే అసలైన కొడుకులు. అలాటి కొడుకుల్ని కన్నవాళ్ళే ధన్యులు. మనం ఆ కోవకి చెందుతామే. దొరబాబు మన పాలిట బంగారు వరం. అమృత కలశం. అక్షయ పాత్ర"

"మీ ఆశల్ని కోరికల్ని తీర్చితే అంతే చాలు!" భర్త ఎదమీద తలపెట్టుకుని వాలుతూ అంది పార్వతి.

★ ★ ★

"పార్వతీ! పార్వతీ!"

బ్రహ్మానందంతో ఉద్వేగంతో సంభ్రమంతో వూగిపోతూ అరుస్తూ వచ్చాడు ముకుందం.

అతడి చేతిలోని ఉత్తరం కంటబడేసరికి ఆమె మోములోకి ఆనందం వెల్లువలా తోసుకొచ్చింది.

"బాబునుంచేనా"

"బంగారు కొండనుంచే. బాబుకి ఉద్యోగం వచ్చేసిందే. యమ్మెస్ రిజల్ట్సు రాకుండానే మనవాడు చేసిన ప్రాజెక్టులు చూసి ఓ పెద్దకంపెనీవాళ్ళు మంచి ఆఫర్ ఇచ్చార్ట. ఇదివరకు అనుకున్న వాళ్ళకన్నా వీళ్ళెక్కువ ఆఫర్ చెయ్యడంతో ఇందులో చేరిపోయాట్ట. జీతం ఎంతో తెలుసా? నెలకి పదివేల డాలర్లే. నేను రిటైరయ్యే ముందరి 20 ఏళ్ళ జీతంతో సమానమే. లాభాల్లో వాటా ఇస్తామని కూడా చెప్పేర్టే."

"ఆనందంతో నాకు మాట రావట్లేదండీ. ఇంకేం రాశాడండీ నాబిడ్డ" కళ్ళనుంచి జల జల ఆనంద బాష్పాలు రాలిపోతోంటే గుండె పట్టుకుని ఆనందంతో వుక్కిరిబిక్కిరవుతూ గోడకి చేరబడి కూర్చుండిపోయింది.

"నిన్ను మరీమరీ అడిగినట్లు చెప్పమన్నాడు. నీ దీవెనలవల్లే నీ పూజల వల్లే ఇంతవాడ్నయ్యానని ప్రత్యేకంగా రాశాడే"

"వాడు నా బిడ్డ. అందుకే అమ్మని అంతగా గుర్తుపెట్టుకున్నాడు. వెంటనే తిరుపతి వెళ్ళి ఏడుకొండల వాడికి తలనీలాలు ఇచ్చి వద్దామండీ"

"అలాగేనే. తిరుపతివెళ్దాం. వెంకటేశ్వరుడికి కళ్యాణం చేయిద్దాం. బెజవాడ కనక దుర్గమ్మనీ దర్శిద్దాం. అన్నవరం వెళ్ళి సత్యనారాయణస్వామి వ్రతమూ చేద్దాం. ఇంకేమేం చెయ్యాలనుకుంటే అవన్నీ చెప్పు. టకటకా చేసేద్దాం. ఇక మనకెదురులేదే. మన రేఖ మారిపోయిందే"

శరీరంలోని అణువణువూ వుప్పొంగిపోతోంటే పట్టపగ్గాల్లేకుండా వుంది ముకుందానికి. రెక్కలు పొడుచుకురాగా గాలిలో తేలిపోతున్నట్టుగా వుంది.

"ఏమండీ... ఒక్కసారి"

"చెప్పు పార్వతీ. ఇక నువ్వే కోరిక కోరినా సరే క్షణాల్లో తీర్చేస్తాను. మన బాబు నాచేతికి మంత్రదండం ఇవ్వబోతున్నాడే"

"ఒకసారి మనింటికెళ్ళి... మామిడి చెట్టుని చూసి!"

అప్రతిభుడై చూశాడు. మొఖంలో నల్లని నీడలు తారట్లాడాయి. వెంటనే వాటిని తుడిచేస్తూ తేలిగ్గా నవ్వేశాడు.

"వెళ్ళి రావడానికేం భాగ్యం. అలాగే వెళ్దొద్దాం. ఇక నువ్వా పెంకుటింటి గురించి మర్చిపో. రెండుమూడు నెలల్లో





ఇంద్రభవనంలాంటి బిల్డింగు కట్టేస్తానే. ఇక నేను ఆడింది ఆట పాడింది పాట"

ఎప్పుడో బాబు టెన్త్‌లో వుండగా కొన్న పోస్టర్ని ఇల్లు ఖాళీ చేసినప్పుడు మడచిపెట్టెలో దాచాడు. దాన్నిప్పుడు బయటికి తీశాడు ముకుందం. చేతి రుమాలుతో తుడిచి గోడకి ఆనించి పట్టుకుని దానివంక ఆరాధనగా చూశాడు.

"ఇలాటి... వూహూ దీని బాబులాంటి బంగళా కట్టిస్తాను. కారు కొంటాను. స్విమ్మింగ్‌పూల్ గుర్ఖా, గార్డెన్ అన్నీ ఇందులో వున్నట్టుగానే ఏర్పాటు చేస్తాను"

అతడి కళ్ళల్లో కురుస్తోన్న మెరుపు చూసి మురిసిపోయిందామె.

"ఈసారి బాబుకి నేను ఉత్తరం రాస్తానండీ"

"ఇప్పుడే ఈ క్షణమే రాసేద్దామే. ఇక ఫోన్ పెట్టించేస్తాను. రోజూ కొడుకుని 'బాబూ కాఫీ తాగావా' 'బాబూ అన్నం తిన్నావా' అని అడుగుతూండచ్చే"

"చాల్లెండి వేళాకోళం" మురిపెంగా అంది.

"వేళాకోళంకాదే పచ్చి నిజం. సత్యం కాబోతున్న స్వప్నం!" అంటూ కాగితమూ కలమూ తెచ్చాడు.

"బాబూ! నీకు ఉద్యోగం వచ్చినందుకు మా అందరికీ కూడా ఎంతో ఆనందంగా వుందిరా. మీనాన్నయితే చిన్న పిల్లాడిలా సంబరపడిపోతున్నారనుకో. నీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో నాన్నా. వేళకి శుభ్రంగా తింటూండు. నిన్ను చూడాలని వుందిరా కన్నా. ఒక్కసారి రావూ? ఆ ఏడుకొండలవాడు నిన్నెప్పుడూ చల్లగా చూడాలని ఆశిస్తూ, మీ అమ్మ పార్వతి" అని రాసిందామె.

"అధిక జీతం వచ్చే కంపెనీలో చేరినందుకు చాలా చాలా సంతోషంగా వుంది. నువ్వింకా పైపైకి ఎదిగి చుక్కల్ని చూడాలని నా ఆశ. ఇకపోతే అక్కడ నీ ఖర్చులవీ సాధ్యమైనంత తగ్గించుకుని డబ్బంతా ఇక్కడికి పంపించెయ్. మనం ఎప్పట్నుంచో కలలు కంటున్న అద్భుతమైన ఇంటిని నిర్మిస్తాను. కారు కొనేస్తాను. మన సుఖసంతోషాలకోసం ఏమేం అవసరమో అవన్నీ కూడా ఏర్పాటు చేసేస్తాను. రేపట్నుంచీ స్థలాన్వేషణలో వుంటాను" అంటూ ముగించాడు ముకుందం.

"దారిలో పోస్ట్ చేసి పాతింటి కెళ్దాం పద" అన్నాడు.

"నేను చీర మార్చుకుని తయారవుతాను. మీరీలోగా రిక్షా పిలుస్తారా?"

"ఇప్పుడు మన స్టేటస్ మారిపోయిందే. కొద్ది రోజుల్లో కారు కొనబోతున్నవాళ్ళం ఇప్పుడు రిక్షాలో ఎలా వెళ్ళగలం చెప్పు? ఆటోని పిలుస్తాను"

ఆటో మీద ఇద్దరూ పాత ఇంటికెళ్ళారు.

మామిడి చెట్టు పచ్చగా కాయల్తో కళకళలాడుతోంది. ఇంటి చుట్టూ కాంపౌండు వాల్ కట్టి ఇంటికి కొన్ని హంగులు చేర్చడంతో కొత్తగానూ అందంగానూ వుంది ఇల్లు.

ఇల్లూ, దొడ్డీ అన్నీ తిరిగి చూసొచ్చి చెట్టు కింద కూర్చున్నారు.

ఇంటావిడ టీ తెచ్చిచ్చింది.

బాబు ఉద్యోగం గురించీ, జీతం గురించీ చిన్నసైజు ఉపన్యాసం ఇచ్చాడు ముకుందం. కట్టబోయే ఇంటిగురించీ, అందుకోబోయే సౌఖ్యాలగురించీ ఏకరువు పెట్టాడు.

"పోనీలెండి. ఇల్లు అమ్ముకుని కూడా బాగుపడ్డారు. అదంతా ఈ ఇంటి మహత్యమేనండీ" అంది ఇంటావిడ.

ఆమె భావం బోధపడక నుదురు చిట్లించాడు. చిరాకుగానూ చూశాడా మాటలు




నచ్చక.

"మా పనీ బాగుందిలెండి. ఏ ముహూర్తాన ఈ ఇంట్లో ప్రవేశించామోగాని అప్పట్నుంచీ మాకెంతో శుభంగా వుంటోందంటే నమ్మండి. సమస్యలన్నీ గాలివీచిన మబ్బుల్లా తేలిపోయాయి. ఎలాంటి చీకూ చింతా లేకుండా ఎంతో తృప్తిగా మనశ్శాంతిగా వుంది. అందరి ఆరోగ్యమూ బావుంటోంది. ఇంటి వాస్తు చాలా మంచిదని మా బంధువొకాయనన్నాడు" చెప్పాడు ఇంటాయన.

ముకుందం గుండెల్లో బాధ ముల్లులా గుచ్చుకుంది. పార్వతి ముఖంలో విషాదవీచికలు కదిలాయి. బాధగా చూసింది.

"నాకు కృషిమీదేగానీ వాస్తుమీద నమ్మకం లేదులెండి. ఇల్లు, పొలం అంటూ వూరికే సెంటిమెంట్లు పెంచుకోను. నన్నడిగితే జీవితం వ్యాపారంలాంటిదంటాను. ఎందరో వస్తారు. ఎందరో వెళ్తారు. ఎన్నో కొంటాం. మరెన్నో పోతాయి. కాని వాటి వల్ల లాభం వుంటే అది మాత్రం మన దగ్గిరే వుండిపోతుంది. లాభాలపంట తెచ్చేలా బతుకుని ప్లాన్ చేసుకున్నవాడే సమర్థుడు"

అతడి మాటలు అర్థంగాక అయోమయంగా చూశాడు ఇంటాయన.

ఆ తెల్లముఖం చూసి "నా ఫిలాసఫీ మీకర్థంకాదులెండి" అని నవ్వేశాడు ముకుందం.

"ఈ చెట్టు కాయలు మీకెంతో ఇష్టం కదూ" అంటూ రెండు మామిడికాయలు కోసిచ్చాడు ఇంటాయన.

మరి కూర్చోవాలనిపించక లేచి శలవు తీసుకున్నారు.

"ఆ ఇంట్లో తిరుగుతోంటే ప్రాణం లేచొచ్చినట్టుగా అన్పించిందండీ" దారిలో అంది పార్వతి.

"అవన్నీ మన నమ్మకాలు. ఉత్త సెంటిమెంట్స్ అంతే"

"ఏమోనండీ. మన జీవితాల్లోని ముఖ్య ఘట్టాలన్నీ ఆ ఇంట్లోనే జరిగాయి. కాపురానికొచ్చింది ఆ ఇంటికే. తల్లి అయ్యింది ఆ ఇంట్లోనే. బిడ్డకి పాలిచ్చి పెంచి పెద్దచేసిందీ అక్కడే. బాబుని ఇంజినీర్ని చేసిందీ అక్కడున్నప్పుడే. ఆఖరికి బాబుని విదేశాలకి పంపిందీ ఆ ఇల్లే"

"అవన్నీ అక్కడ గాకుండా ఇంకెక్కడ వున్నా జరిగేవే పార్వతీ. దానిగురించి అతిగా ఆలోచించడం అనవసరం. ఆ ఇంటిని తలదన్నే ఇల్లు సర్వసౌఖ్యాలూ వున్న దేవేంద్రభవనాన్ని నిర్మిస్తాను చూస్తుండు"

"పోనీ ఆ ఇంటిని మళ్ళీకొనేస్తే? "

"కొనొచ్చు కొని ఏం చేస్తాం చెప్పు? ఆ పాత ఇరుకు కొంపలో ఇప్పుడు ఉండగలమా? వుండలేం. పోనీ విదేశంలో అత్యాధునిక సౌకర్యాలమధ్య నివసిస్తోన్న బాబు వుండగలడా? లేడు. మరప్పుడు దాన్ని పడగొట్టి మనకన్ని విధాలా బాగుండేట్టు కట్టాలికదా. చూస్తూచూస్తూ ఇన్నేళ్ళు మసలిన ఇంటిని పడగొట్టలేం కదా. మరటువంటప్పుడు ఇక్కడికన్నా పోష్ లొకాలిటీలో మరింత విశాలమైన స్థలంలో కడితేనే ఎక్కువ లాభం, ఎక్కువ విలువ వుంటాయి ఏమంటావు? "

ఆమె ఏమీ అన్లేదు.

ఆ ఇంటిమీద తనకి గల ఆపేక్షని, మమకారాన్ని మాటల్లో ఎలా చెప్పాలో ఆమెకి తెలీలేదు.

కానామె మౌనాన్ని తన ఆలోచనకి లభించిన విజయంగా భావించి మురిసిపోయాడు ముకుందం.

★ ★ ★

పోష్ లొకాల్టీలో అయిదు వందల చదరపుగజాల ఇంటిస్థలం కొన్నాడు ముకుందం.



ఆ ప్రాంతంలోవన్నీ కొత్త భవనాలే. లక్షల్ని వెదజల్లి కట్టినవే. టౌన్లోని ప్రముఖు లంతా అక్కడ సరికొత్త డిజైన్లతో భవనాలు నిర్మించారు. ఇంకా నిర్మిస్తున్నారు.

ఇంకొద్ది రోజుల్లోనే ఆ ఏరియా టౌన్ కే తలమానికమై మినీ ముంబాయిలా అన్పి స్తుందని కొందరి అంచనా.

అసలు మొదట హైదరాబాదులో బంజా రాహిల్స్ లో సైట్ కొందామనుకున్నాడు. కానీ పార్వతి ఒప్పుకోలేదు.

"మన బంధుబలగమంతా ఈ ప్రాంతంలో వుంటే ఎక్కడో ముక్కూ మొహం తెలీని చోట ఇల్లు కడతానంటారే మిటీ" అంది.

"తెప్పలుగ నీరు నిండిన కప్పలు పది వేలు చేరుగదరా సుమతీ- అన్నారే"

"ఊరికే వచ్చి కూర్చునేంత తీరికెవరికుం దండీ. సుస్మిత కూడా ఇక్కడే ప్రాక్టీసు పెడు తుందిట. రామారావు అన్నయ్యగారూ మనమూ పాలూనీళ్ళలా కలిసిపోయాం. ఒకరికొకరం తోడుగా ఇక్కడే వుండిపోదాం"

ముకుందం ముఖం జేవురించింది. సుస్మిత వూసు రావడం ఆయనకి మనస్క రించలేదు.

"వాళ్ళ గొడవ మనకెందుకులే. ఇక మన స్నేహాలన్నీ ఉన్నతవర్గం వారితోనే. లయన్స్ క్లబ్బులో కూడా చేరదామనుకుం టున్నాను"

"మీరెన్నైనా చెప్పండిగాని నేను మాత్రం ఈ వూర్ని విడిచిరాను. చిన్నప్పట్నుంచీ అలవాటు పడిన ఈ వాతావరణానికి దూరంకాలేను. ఈ వయస్సులో కొత్తనీటికీ కొత్త మనుషులకీ అలవాటుపళ్ళేను"

అతడు మాట్లాడలేకపోయాడు.

కానీ అతడి ఆలోచనలలో మాత్రం మార్పొచ్చింది.

పెద్ద సముద్రంలో చిన్న చేపగా వుండే కన్నా చిన్న కొలనులో పెద్దచేపగా వుండటం మంచిదన్పించింది.

ఎక్కడో హైదరాబాద్ లో లక్షలాదిమంది ధనికుల్లో ఒక్కడిగా వుండేకన్నా ఇక్కడే వందమందిలో ఒకడిగా వుండడంలోనే ఎక్కువ గుర్తింపూ, గౌరవమూ వున్నాయ న్పించింది. పైగా తమ వైభోగం తమ వాళ్ళంతా చూసి అభినందిస్తేనే కదా అస లైన ఆనందం అన్పించింది. ఎక్కడో ఏడం తస్తుల మేడ కట్టుకునుంటే 'కామోసు' అను కుంటార్తప్ప వచ్చి చూసి పొగిడేవాళ్ళు తక్కువమంది వుంటారన్పించింది.

అందుకనే వున్న వూళ్ళోనే స్థలం కొన్నాడు.

ఒకనాడు ఎంతగానో ఆకర్షించి అలరించి స్వప్నాల్లో తేలియాడించిన పోస్టర్ని జాగ్ర త్తగా మడిచి ఆర్కిటెక్ దగ్గరకి తీసుకెళ్ళాడు ముకుందం.

"ఇలాంటి భవంతి నిర్మించాలనుకుం టున్నాం. ఇన్ని హంగులూ వుండాలి. ఇంకా అధునాతన నగిషీలు చెక్కగలిగితే ఇంకా మంచిది. కానిలాంటి ఇల్లు ఈ ప్రాంతంలో ఎక్కడా వుండకూడదు. మా ఇల్లు ఎంతో ప్రత్యేకతగా పదిమందీ మళ్ళీమళ్ళీ చూసే దిగా వుండాలి. మీ ఫీజు ఎంతైనా సరే ఇస్తాను. నాకు నచ్చేలా ప్లాన్ తయారుచె య్యండి" అన్నాడు.

వరుసగా వారంరోజులపాటు అతడి దగ్గరే కూర్చుని మార్పులు చేర్పులు చేసి ప్లాన్ సిద్ధం చేయించారు.

వెంటనే శంకుస్థాపనకి ముహూర్తం పెట్టించి బాబుకి ఉత్తరం రాశాడు.

★ ★ ★

గృహనిర్మాణం చకచకా సాగిపోతోంది.

అద్దె ఇంటినుంచి సైట్ కీ, సైట్ నుంచి బజారుకీ తిరగడానికి వీలుగా వుంటుంది




కదాని ఓ ఆటోని అద్దెకి మాట్లాడుకున్నారు. మేస్త్రీలు గురించో సరుకులగురించో ఇంజి నీరు కోసమో రాత్రీ పగలూ అని లేకుండా దానిలో తిరుగుతున్నాడు ముకుందం.

పార్వతికూడా పదిగంటలకల్లా వంటపని పూర్తిచేసి ఆఫీసుకెళ్తున్నట్టుగా ఠంచనుగా సైట్ కొచ్చేస్తోంది. ఇద్దరూ అన్నిట్నీ దగ్గ రుండి చేయిస్తున్నారు. పనుల్ని పర్యవేక్షిస్తు న్నారు.

ఎవరో కట్టిన ఇంటిని కొనడమో లేక వంశపారంపర్యంగా దక్కించుకోవడమో వేరు. స్వయంగా తమపేరు మీద శంకుస్థా పన చేసి ఇల్లు నిర్మించి అందులో నివసిం చడం వేరు. ఆ రెండో అదృష్టం అతికొద్ది మందికే లభిస్తూంటుంది.

ఇల్లు కట్టినవాడి అనుభవమూ, పెళ్ళి చేసినవాడి అనుభవమూ అనుభవైక వేద్య మేగానీ మాటల్లో వ్యక్తపరచలేనిది. అవతలి వారు పూర్తిగా గ్రహించలేని అనుభవం! అనుభూతి!

ముకుందానికి ఇంటిపని తప్ప మరేవీ పట్టడంలేదు. మరెవర్నీ పలకరించగల తీరి కాలేదు. అంతగా మమేకం ఐపోయాడు.

దొరబాబు తండ్రి చెప్పిన ప్రకారం డబ్బు పంపించేస్తున్నాడు. అంచేత డబ్బుకోసం ఎదురు చూడాల్సిన పరిస్థితిలేదు. అయిన ప్పటికీ చాలా జాగ్రత్తగా పొదుపుగా ఖర్చు పెడుతున్నాడు.

సుస్మిత వచ్చింది. ఆ ఊళ్ళోనే డాక్టర్‌గా ప్రాక్టీస్ పెట్టింది. ఒక్క నెలరోజుల్లోనే మంచి పేరు సంపాదించుకుంది.

క్లినిక్ తెరుస్తున్నందుకు అభినందనలు తెలియచేస్తూ కొంత మెడికల్ ఎక్విప్ మెంట్ గిఫ్టుగా పంపించాడు బాబు.

ప్రారంభోత్సవానికి వెళ్ళి అలా ముఖం చూపించి ఇలా వచ్చేశాడు ముకుందం. అంచేత అతడికా గిఫ్టు సంగతి తెలీదు.

పార్వతి కూడా వస్తానని వుబలాటప డింది గానీ "ఆసుపత్రి ఓపెనింగుకి మన మంతా కట్టగట్టుకెళ్ళడం ఎందుకే. డాక్టర్ల దగ్గరకి ఎన్ని తక్కువసార్లు వెళ్తే అంత అదృష్టమే" అని తీసి పారేశాడు.

"అమ్మాయి రాలేదనుకుంటుందండీ..."

"అనుకుంటే అనుకోనీ. ఏదో పిలిచిందని చెప్పి మన అంతస్థు మరచి ఇద్దరం వెళ్ళడం శుద్ధ దండగ, పరువు తక్కువ"

మరి ఎదురు చెప్పలేకపోయింది.

★ ★ ★

ఓ రోజు హటాత్తుగా వచ్చిన సుస్మిని చూసి పరమానందపడిపోయింది పార్వతి.

"రామ్మా రా. బాబు ఇల్లు చూడు..." అంటూ తిప్పి చూపించింది. ఏ గది ఎందుకో ఎక్కడేం ఏర్పాటు చేయనున్నారో కూడా వివరించింది.

"చాలా బాగుంది ఆంటీ. మీరు నా క్లినిక్ ఓపెనింగుకి రానేలేదు" అంటూ నిష్ఠూరమా డింది.

"వద్దామనే అనుకున్నానమ్మా. మీ అంకుల్ పడనివ్వలేదు. ఆయన తిక్క నీకు తెలుసుకదా. ఆయనకెంత తోస్తే అంతే. మనమాట విన్పించుకోరు"

"బాబు ఉత్తరం రాశాడు"

ఆవిడ ముఖం విప్పారింది. "నిజమా. ఏమండీ బాబు ఉత్తరం రాశాట్ట. ఒకసా రిలా వస్తారా" అని కేకేసింది.

శ్లాబ్ మీద నిలబడి పనిని పర్యవేక్షిస్తు న్నాడు ముకుందం ఆశ్చర్యంగా చూస్తూ వచ్చాడు.

ఏదైనా ముఖ్యసంగతి తనకి రాయడానికి సంకోచించి ఆమెకి రాయలేదుకదా అని గుండె గుబగుబలాడిందో క్షణం.

"నమస్తే అంకుల్..."

"బాబు నీకు లెటర్ రాశాడా? " అనుమా

నంగా చూస్తూ అడిగాడు.

"నేను రాస్తే జవాబిచ్చాడు. ఏం లేదులే అంకుల్. బ్యాంక్‌లోన్‌తో చిన్న నర్సిం గ్‌హోం నిర్మిద్దామని ప్లాన్ చేస్తున్నాను. నా అవసరాలూ ఇబ్బందులూ చెప్పి ప్లాన్ గీసి మ్మన్నాను. కంప్యూటర్ సాయంతో చక్కని ప్లాన్ గీసి పంపించాడు. ఇనుము ఎంత వాడాలి. సిమెంటు ఏ నిష్పత్తిలో ఉపయో గించాలి వగైరా వివరాలన్నీ కూడా ఇచ్చాడు. అది చూసి ఇక్కడి ఇంజనీర్లు తె ల్లబోయారు. తక్కువ ఖర్చుతో ఇంత బాగా కట్టొచ్చా అని నోళ్ళు తెరిచారు. బాబు రియల్లీ బ్రిలియంట్"

బాబు పంపిన ప్లాన్ విప్పి చూపించింది.

బాబునే చూస్తున్నంత సంబరంగా చూసింది పార్వతి.

కానీ ముకుందానికేమీ అన్పించలేదు.

బాబు అభిప్రాయాలు తెలుసుకోవాలనీ అతడి పరిజ్ఞానాన్ని ఉపయోగించుకోవాలనీ తనకి తోచనేలేదు. ఆ ఆలోచన రానందుకు బాధపడ్డాడు. దానినిమించి సుస్మికీ బాబుకీ మధ్య ఉత్తరాల ద్వారా సంబంధం కొనసా గుతూనే వుందని గ్రహించి బాధపడ్డాడు.

అది ఎన్ని మలుపులు తిప్పుతుందో ఎక్క డికి దారితీస్తుందోనని కలవరపడ్డాడు.

"అమెరికా నిర్మాణపు పద్ధతులు మనకి కుదుర్తాయేవిటి? " అని చప్పరించేశాడు.

"మన బాబు గీశాడంటే వాడికిక్కడి సంగ తులు కొట్టిన పిండేకదా. వాడికి ఆమాత్రం తెలీదా ఏవిటి? " ప్రతిఘటించింది పార్వతి.

"ఆంటీ చెప్పిందీ కరక్టే అంకుల్. మన క్లైమేట్‌కి అనుగుణంగా మార్పులూ చేర్పులూ చేశానని కూడా రాశాడు"

అతడి ముఖం ఎర్రబడింది. వెర్రిగా ప్లాన్ చూసి అన్నాడు. "నీ పిచ్చిగానీ ఈ ఆసుపత్రులవీ ఇక్కడెందుకమ్మాయ్.

హాయిగా అమెరికాకో మరోచోటకో ఎగిరి పోక. ఇప్పుడేమో ఇంజినీర్లు వెళుతున్నారు గానీ ఇదివరకు డాక్టర్లే ఎక్కువగా విదేశాల కెళ్ళేవారు తెలుసా? "

"తెలుసంకుల్. కానీ నాకిక్కడే ప్రాక్టీసు చెయ్యాలనుంది. రోజుకి కనీసం పదిమంది పేదవారికైనా ఉచితంగా వైద్యం చేయాల న్నది నా ఆకాంక్ష. ఆ సాయమేదో నా ప్రాంతీయులకే దక్కనీ" నవ్వేస్తూ అంది.

"పెద్ద చదువులు చదివిన నువ్విలా నేనూ నా వూరూ అని కుంచించుకుపోకూ డదు. ప్రపంచమంతా మనవూరే. అంతా మన సోదరమానవులే అని విశ్వభ్రాతృ త్వాన్ని పెంచుకోవాలి"

"నిజమేకాని ఇంట్లోవాళ్ళనీ బయటివా ళ్ళనీ ఒకేగాట కట్టలేంకదా అంకుల్"

"అలాటి ముఖప్రీతి కబుర్లు నాకిష్టం వుండదు. నీ ప్రతిభ వికసించాలంటే విదే శాల కెళ్ళాల్సిందే. హాయిగా అమెరికాయో, ఆస్ట్రేలియాయో వెళ్ళి రెండు చేతులా సంపా దించుకునే బంగారు అవకాశాన్ని చేజేతులా చేజార్చుకుంటున్నావు"

"డబ్బే సర్వస్వం కాదుకదా అంకుల్"

"మీ నాన్నలాగే నీకూ చాదస్తం ఎక్కువ. మీ తిక్కే మీది తప్ప ఇంకేం అర్థం చేసు కోరు. మీ తమ్ముణ్ణీ అలాగే పాడుచేస్తున్నారు"

మళ్ళీ నవ్వి అంది. "ఆ సంగతి భవి ష్యత్తు చెప్పాలంకుల్. ప్లాన్ మీకు చూపించి మీ ఆశీర్వాదం తీసుకుందామనొ చ్చాను. పన్లోపనిగా బాబు ఇల్లు ఎంతవ రకూ వచ్చిందో చూసినట్టూ వుంటుందని ఏకంగా ఇక్కడి కొచ్చాను"

"చాలా సంతోషం. నాలుగురాళ్ళు పోగే సుకున్నవాడే ఇతరులకు సాయపడగలడు. ఏమీలేని వాడు బూడిద తప్ప ఏమీ మిగల్చ లేడు. ఆ సంగతి ఎప్పుడూ మర్చిపోకు"

"అలాగే అంకుల్. మీ ఫిలాసఫీ నా




కెప్పుడో అర్థమైంది" అందామె చిన్నగా నవ్వుతూ.

ఆ నవ్వులో ఎన్నో అర్థాలు ధ్వనించగా మిన్నకుండిపోయాడు.

ఆమె తన టూవీలర్ మీదెళ్ళిపోయింది.

"సుస్మిత ఎంతో అందంగా, హుందాగా వుంది కదండీ!" అంది పార్వతి వెళ్తోన్న సుస్మి వంక అభిమానంగా చూస్తూ.

"ప్రాయం వచ్చిన పందిపిల్ల కూడా బాగానే వుంటుంది"

మిర్రి చూసింది భర్త వంక.

"మన ఆశీర్వాదం కోసం వచ్చిందిట. మనమంటే తనకెంతో అభిమానం"

"బెల్లం చుట్టూ ఈగలు చేరటం సహజం"

ఈయనకేమైందన్నట్టు విస్మయంగా చూసింది పార్వతి. ఏదో పనున్నట్టు అక్క డ్నుంచి హడావిడిగా వెళ్ళిపోయాడు.

ఇంకాస్సేపుంటే సుస్మిని కోడలిగా చేసుకుందామంటుందేమోనని భయపడ్డాడు ముకుందం.

★ ★ ★

అమెరికానుంచి గృహప్రవేశానికొచ్చాడు దొరబాబు.

మనిషి బాగున్నాడు. రంగు వచ్చాడు. కాని చిక్కాడు. కళ్ళు లోతుకుపోయాయి. హుందాతనం వచ్చింది. ఉత్సాహంగానూ, కొంచెం కలవరంగానూ ఉన్నాడు.

అతడ్ని చూసి ఆనందం పట్టలేక ఏడ్చేసింది పార్వతి.

ముకుందం గర్వంగా నవ్వుకున్నాడు. "ఇహనుంచి వెలిగేది నా ప్రభే" అనుకున్నారు గొప్పగా ఫీలవుతూ. ఇప్పుడాయన ముకుందంగారు అయిపోయారు మరి.

బాబుని కొత్త ఇంటికి తీసుకెళ్ళారు.

పదవతరగతి చదువుతున్నప్పుడు ఒక పోస్టర్ తెచ్చి 'ఇది నీ లక్ష్యంగా కష్టపడితే ఈ స్వర్గం నీదే అవుతుందిరా' అని చెప్పి చూపించిన చిత్రంలోలానే వుంది ఇల్లు. నిజానికి హంగుల్తో దానికన్నా బావుంది.

కారు కొన్నారు. గూర్ఖాని కుదిర్చారు. ఒక పక్క స్విమ్మింగ్ పూలూ, చుట్టూ రకరకాల పూలమొక్కల గార్డెనూ వుంది.

చాలా బాగుందని పొంగిపోయాడు బాబు. "ఎలాగైనా డాడీ డాడీయే. హీ ఈజ్ గ్రేట్" అనుకోకుండా వుండలేకపోయాడు.

ముకుందం ఒక్కోదాని గురించీ చాటభారతం విన్పిస్తోంటే మొదట ఆసక్తి కనబరిచినా తర్వాత అసహనంతో విన్నాడు. తండ్రి కబుర్లకి అంతూ దరీ కన్పించకపోయేసరికి "అలా వూళ్ళోకెళ్ళి ఫ్రెండ్స్‌ని కలిసొస్తాను డాడ్" అన్నాడు.

స్థాణువయ్యాడాయన.

అతడెక్కడికెళ్తాడో వూహించుకునే సరికాయన మొహం మ్లానమయ్యింది. ఏదో గొణుక్కుంటూ బుర్ర గోక్కున్నారు.

'సుస్మిని కలవొద్దు' అని చెప్పాలనుకున్నారుగాని చెప్పలేకపోయారు.

తిన్నగా సుస్మి నర్సింగ్‌హోంకెళ్ళాడు బాబు.

ఆసుపత్రి చిన్నదే అయినా ముచ్చటగా వుంది. తనిచ్చిన ప్లాన్‌ని యథాతథంగా నిర్మించారు. తమ ఇంటిని చూసినప్పటి కన్నా ఎక్కువ ఆనందం కలిగింది. 'దీసీజ్ మై బ్రెయిన్ చైల్డ్' అనుకోకుండా వుండలేకపోయాడు. ఏదో తెలీని తృప్తి అతడి శరీరాన్ని పులకింపజేసింది.

పేషంట్లు బాగానే వున్నారు. అక్కడే తచ్చాడుతూండిపోయాడు.

డాక్టరమ్మ గురించిన ప్రశంసావాక్యాలు విని పొంగిపోయాడు.

పచార్లు చేస్తోంటే నర్సు ఒకటి రెండు సార్లు అతడివంక సాభిప్రాయంగా



చూసింది. అతడు ఏమీ అడక్కపోయేసరికి తిరిగి తనపనిలో పడిపోయింది.

రోగులంతా వెళ్లేక లోపలికెళ్దామనుకు న్నాడు. కాని ఒకరు వెళ్తోంటే ఇద్దరొస్తు న్నారు.

ఇహ ఇలా లాభంలేదన్చెప్పి, "డాక్టర్ సుస్మితని అర్జంటుగా కలవాలి" అని చెప్పాడు.

నర్సు అతడ్ని ఎగాదిగా చూసి లోపలున్న పేషంట్ వచ్చాక అతడ్ని పంపింది.

అతడొస్తున్నాడని తెలుసు. కానింత హఠాత్తుగా వస్తాడనుకోలేదు. ఆశ్చర్యాంబు దిలో నిలువునా మునిగిపోతూనే ఆనందపు తెరుమీద తేలిపోయింది.

"హాయ్! కమాన్ వెల్కం... ఎప్పుడొ చ్చావ్?!" అంటూ లేచి ఆహ్వానించింది.

అతడి కళ్లు ఆమె మెడని గబగబా నిమి రాయి. బంగారు చెయిన్ వుందిగాని మంగ ళసూత్రం కన్పించలేదు. పరిణతి చెందిన యువతిలా వుందిగాని పెళ్లైన స్త్రీలా లేదు. చిన్నగా నిట్టూర్చి "థాంక్ గాడ్" అనుకు న్నాడు.

"ఏవిటలా కొత్తగా చూస్తున్నావు"

"చాలా మారిపోయావు సుస్మీ"

"నువ్వు మాత్రం తక్కువ తిన్నావా?"

"ఎలా వుంది ప్రాక్టీస్?"

"బావుంది. ఆసుపత్రి చూపిస్తాను రా. డాక్టర్లు ఈర్ష్యపడేంత గొప్పగా ప్లాన్ గీసి చ్చావు. నీకు ప్రత్యేక కృతజ్ఞతలు చెప్పుకో వాలి" అంటూ అంతా తిప్పి చూపించింది.

అభినందనలు కురిపించాడు. ఆమె గురించి రోగులు చెప్పుకుంటున్న ప్రశంసా వాక్యాలు కూడా చెప్పాడు. "నిన్ను చూస్తోంటే జెలసీగా వుంది" అన్నాడు.

నవ్వేసింది, "ఇంకా ఎక్కువమంది పేద వారికి సేవ చేయాలనుంది. బహుశా బ్యాంక్ లోన్ తీరేవరకూ ఆ కోరిక తీర దేమో"

"మనసుంటే మార్గం వుండకపోదనేదాని విగా. ఆలోచించు. తప్పక మార్గం కన్పి స్తుంది. నీ ఆశయాలన్నీ తప్పక తీరతాయి. నిజంగా నువ్వో దేవతవి"

"ఏయ్. ఏమిటా కోతలు. అమెరికాలో భట్రాజు పాఠాలు నేర్చుకున్నావా ఏవిటి?"

అతడూ నవ్వేశాడు.

టీ తాగుతూండగా అడిగింది, "అక్కడెలా వుంది? ఫ్రెండ్స్ సర్కిల్ ఎలా వుంది? ఎప్పుడూ ఆ విషయాలు ఉత్తరాల్లో రాయవేం?"

"ఫ్రెండ్ అని చెప్పుకోదగ్గవాళ్లెవరూ లేరు"

"వాట్?!" అదిరిపడిచూసింది.

"నిజం సుస్మీ. నేనెంచేతో అందర్తో కలవ లేకపోయాను. అందర్లా వుండలేకపోతు న్నాను"

"మన ఇండియన్స్ కూడా చాలామంది వున్నారుగా"

"వున్నారు. ఏవిటో అంతా అదోరకమైన గొప్పల్తో కృత్రిమ మనుషులుగా వుంటూం టారు. ప్రతీదానికీ పరుగు. అపాయింట్ మెంట్ తీసుకోందే కలవడానిక్కూడా వీలు పడదు. మెకానికల్ లైఫ్. డబ్బు యావ. ఫాల్స్ ప్రిస్టేజ్ అధికమన్పిస్తుంది. సెకండ్ సిటిజన్స్‌లా అణగి మణగి అందరికీ భయ పడ్తూ వుండటం ఓహ్. హేట్ దట్ లైఫ్"

తుళ్లిపడి చూసింది సుస్మీ.

"అందుకనే ఎవ్వర్తోనూ మూవ్ అవలేక పోయాను. చదువులోనూ వర్కులోనూ అంతే. అందుకే అందర్లో వున్నా ఒంటరినే"

"నోనో. అది మంచి పద్ధతి కాదు బాబూ. అందర్తో కలవాలి. స్నేహం పెంచుకోవాలి. అభిమానాల్ని, ఆప్యాయ తల్ని పంచుకోవాలి. అప్పుడే మన ఆనందం





రెట్టింపవుతుంది. అందుకనే అంటారు పంచుకుంటే ఆనందం గుణింపబడుతుంది. దాచుకుంటే భాగింపబడుతుంది"

"నాకు హేపీ అల్లా మీ అందర్నీ తలచుకోవడం, మీతో గడిపిన నిమిషాలు నెమరు వేసుకోవడం. అంతే"

ఆమె కనురెప్పలు టపటపా కొట్టుకున్నాయి.

"అయితే ఇక్కడికే వచ్చెయ్యొచ్చుగా"

"వచ్చేస్తాను. నేను పంపిన డబ్బంతా ఆ ఇంటిమీదే ఖర్చు పెట్టేసినట్టున్నారు డాడీ. ఏమంటారో చూడాలి"

"నువ్వు పెద్దవాడివయ్యావు బాబూ. ఇప్పుడు కూడా నీ స్వంత నిర్ణయాలు తీసుకోకపోతే ఎలా? " నవ్వుతూ అంది.

"అఫ్‌కోర్స్ ప్రయత్నిస్తాను. అన్నట్టు ఎలాగూ వస్తున్నాను కదాని లేటెస్ట్ మెడికల్ ఎక్విప్‌మెంట్ కూడా తెచ్చాను. సాయంత్రం వెళ్ళేప్పుడు కలెక్ట్ చేసుకో"

"థాంక్యూ బాబూ. వాటి ఖరీదు చాలా ఎక్కువగా వుంటుంది. ఎంతో చెబితే ఇచ్చేస్తాను"

"అభిమానానికి ఖరీదు గట్టగల షరాబు వైతే అలాగే ఇచ్చెయ్"

"శ్రీశ్రీ గుర్తొచ్చినట్టున్నాడే"

"మరచిపోతేకదా. అక్కడికెళ్ళాక చాలా కవిత్వం రాసేశాన్లే"

"తీసుకురాకపోయావా పుస్తకంగా వేద్దాం"

"అమ్మో! డాడీకి తెలిస్తే నా పని గోవిందే"

"అమెరికా వెళ్ళినా డాడీ కూచివే. ఏం మారలేదు"

"నా గొడవకేంగాని ఆంటీ, అంకుల్ ఎక్కడున్నారు. కలిసి చాలాకాలమైంది"

"డాడీ రిటైరయ్యారుకదా. హాస్పటల్ మెయిన్‌టెనెన్స్ ఆయనే చూస్తున్నారు. పక్కనే ఇల్లు. పేషంట్లని చూసి పంపించేక వెళ్దాం"

"నువ్వు నీ డ్యూటీ చేసుకో. నేను మీ ఇంటికెళ్తాన్లే అన్నట్టు శ్రీను ఏం చేస్తున్నాడు? "

"మద్రాసులో వుంటున్నాడు. సినిమాలకి పాటలు పాడుతున్నాడు"

"రియల్లీ? చాలా హేపీగా వుంది. హి డిజర్వ్‌డ్ సచె రికగ్నిషన్. ఓ.కే. సీయూ బైబై..."

దొరబాబు వెళ్ళిపోయాడు. మరి కాస్సేపటిదాకా అతడి గురించే ఆలోచిస్తూండిపోయింది సుస్మి.



ధూంధాం అంటూ టౌన్ అదిరేలా గృహప్రవేశం చేశారు ముకుందం దంపతులు.

ఎక్కడెక్కడ్నుంచో దూరపు బంధువులు సైతం వచ్చారు. అన్నా వదినెలు వచ్చారు. అక్కా బావలూ వారమ్మాయి కాత్యాయనీ, అల్లుడూ అంతా వచ్చారు.

రామారావూ, సరస్వతీ, సుస్మితా అంతా దగ్గరుండి తమ ఇంటి కార్యక్రమమే అన్నట్టు చేదోడుగా నిలిచారు.

వచ్చిన బంధుమిత్రులంతా ఇంటినీ, ముకుందం భాగ్యాన్నీ, బాబు అదృష్టాన్నీ వేనోళ్ళ పొగిడారు.

నలుగురైదుగురు బాబుకి పెళ్ళి సంబంధాలు తీసుకొచ్చారు. మరికొందరు తమ పిల్లని పెళ్ళాడితే బాగుడ్ననుకుంటూనే 'తమకెక్కడ అందుతార్లే' అనుకుని నిరాశపడ్డారు.

ముకుందం అన్న కృష్ణారావు కూడా తమ్ముడ్నీ బాబునీ బాగా అభినందించాడు.

"నీ మూర్ఖపు పట్టుదలతో వాడ్నేం చేసేస్తావోనని భయపడ్డానుగాని బాగానే తీర్చిదిద్దావురా" అన్నాడు.

ముకుందం పొంగిపోయి తలెగరేసి ఫోజు కొట్టారు.

"అప్పుడే ఏమయ్యింది. ఇంకా ఎన్ని చిత్రాలు చేస్తానో ముందు ముందు చూద్దురుగాని" అనుకున్నారాయన.

భోజనాల కార్యక్రమం పూర్తయింది. ఇంట్లో బంధువుల సందడి తగ్గిపోయింది. దగ్గరివాళ్ళూ పొరుగూరివాళ్ళూ మాత్రం వున్నారు.

వీధి వరండాలో నలుగుర్తోబాటు కూర్చున్నారు ముకుందం.

"మీవాడికి ఏదైనా దగ్గరి సంబంధం వుందా బావగారూ? " అనడిగారొకరు.

"వూహూ... లేదు. దగ్గరి సంబంధం చేసుకునేవాడ్నయితే ఎప్పుడో మా అక్కకూతురు కాత్యాయినినే చేసుకుందుం. పాపం మా అక్కా బావా వచ్చి ఎంతగానో బతిమాలారు. మేనరికాలు మంచివి కాదు చేసుకోనన్నాడు బాబు. ఈ కాలపు కుర్రాళ్లు మనలా కాదుకదా. ఎంతో ఆచితూచి అడుగువేస్తుంటారు"

"ఇంకేదైనా సంబంధం అనుకుంటున్నారా? "

"లేదే... ఎందుకా సందేహం వచ్చింది? "

"అహ ఏం లేదులే వూరికే" అన్నాడు గార్డెన్‌లోకోసారి చూసి.

తనూ అటుకేసి చూశారు. అదిరిపడ్డారు.

బాబూ, సుస్మితా గార్డెన్లో కుర్చీలేసుక్కూర్చుని నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

ముకుందం ముఖం ఎర్రబడింది. "ఆ అమ్మాయా? డాక్టర్లే. చిన్నప్పట్నుంచీ స్నేహితులు. మా వాడికిలాటి అల్లాటప్పా సంబంధం చేస్తానేమిటి? నువ్వా నేనా అనే వాళ్ళ వియ్యమందుకుంటాను. నన్ను తక్కువగా అంచనా వెయ్యకండి మరి" అని చెప్పి గబగబా గార్డెన్లోకెళ్లారు.

"బాబూ అంతా అక్కడ నీ కోసం చూస్తున్నారు" అని పిలిచారు.

అయిష్టంగానే లేచొచ్చాడు బాబు.

"నాకు టైమవుతోంది. హాస్పటల్ కెళ్ళాలి. వస్తానంకుల్" అని వెళ్ళిపోయింది సుస్మిత.

"ఇంటినిండా బంధువులుండగా ఆ అమ్మాయితో అలా రాచుకుతిరగటం బాగోలేదురా" అన్నాడు.

బాబు చిన్నబుచ్చుకున్నాడు.

కాస్సేపటికి "సుస్మిత ఏదండీ" అంటూ కలయజూస్తూ వచ్చింది పార్వతి.

"వెళ్ళిపోయింది"

"నాకు చెప్పకుండా ఎలా వెళ్ళనిచ్చారు? చీర పెడదామనుకున్నాను"

"ముందు బంధువుల సంగతి చూడు" విసుక్కున్నట్టుగా అన్నారు.

భర్తవంక అదోలా చూసి లోపలికెళ్ళిపోయిందామె.

మర్నాడు బాబుకో పెళ్ళిసంబంధం వచ్చింది.

పిల్లతరపు వాళ్ళంతా హైదరాబాద్‌లో వుంటున్నారు. స్థానికంగా వున్నవారి బంధువుల ద్వారా తెలుసుకునొచ్చారు.





బాబుని చూసి మాట్లాడారు. వివరాలు కనుక్కున్నారు. అయిష్టంగానే జవాబులి చ్చాడు బాబు.

"పది లక్షల దాకా కట్నం రూపేణా ముట్టచెబుతామన్నారు. అమ్మాయి సినిమా తారలా వుంటుందనీ డిగ్రీ చదివిందనీ" చెప్పారు.

ఆలోచించి కబురు పెడతానని పంపే శారు ముకుందం.

నిజానికి ఇప్పుడే బాబుకి పెళ్లిచెయ్యాలని లేదాయనకి. ఇంకాస్త డబ్బు నిలవచేశాక ఇంకొన్ని ఆస్తులు కూడబెట్టేక పెళ్లి చేస్తే బావుంటుందని వుంది. పైగా తమ సంబంధం గురించి ఇప్పుడిప్పుడే అన్నివైపు లకీ పాకుతోంది గనుక ఇంకొన్నాళ్ళు ఆగితే మరింత గొప్ప సంబంధం వస్తుందని ఆయన నమ్మకం.

ఆడపడుచుతోసహా అంతా నాలుగోరో జున వెళ్ళిపోయారు.

ఆ రాత్రి ముకుందం, పార్వతి, బాబు హాల్లో టీవీ ముందు కూర్చున్నారు.

"నీ పెళ్లి గురించి చాలా సంబంధాలొస్తు న్నాయిరా. నీ అభిప్రాయం, ఇష్టాఇష్టాలూ చెబితే దాన్ని బట్టి ముందుకెళ్తాం మరి" అన్నారు ముకుందం.

ఏమంటాడోనని ఆసక్తిగా అతడివంక చూసింది పార్వతి. బాబు తలొంచుకూర్చు న్నాడు. తండ్రి రెట్టించి అడిగేసరికి తల్లి వంక చూశాడు.

కొడుకు భావం గ్రహించిందామె. వెంటనే అంది "తెలియని చోటికెళ్ళేకన్నా తెలిసిన సంబంధం మంచిదికదా. సుస్మితని చేసు కుంటే పాలూ నీళ్ళలా కలిసిపోతుంది. ఈడూ జోడూ బాగుంటుంది"

తల్లివంక అభినందన పూర్వకంగా చూశాడు బాబు.

అంతలో "పార్వతీ" అని అరిచారు ముకుందం.

అంతా తుళ్ళిపడి చూశారాయన వంక.

"వియ్యానికైనా కయ్యానికైనా సముజ్జీ వుండాలని గుర్తుంచుకో. వియ్యమందాలని కోటీశ్వరులు మనింటిముందు క్యూ కడు తోంటే ముష్టి సంబంధం చేస్తానంటావేంటే. సిరిరామోకాలడ్డకు. బాబుది రాజయోగం అన్న సంగతి మర్చిపోకు"

హతాశురాలయ్యింది "అది కాదండీ"

"నాకెదురు చెప్పొద్దు. బాబు బాగోగులు నాకు బాగా తెలుసు"

నిస్సహాయంగా చూస్తూండిపోయింది పార్వతి.

ధైర్యం చేసి మెల్లగా అన్నాడు బాబు "సుస్మితకేం లోటుంది డాడీ? "

నుదురు ముడివేసి చూశారు.

"అంతా లోటేరా. వాళ్ళకేముందనీ? ఆఖ రికి ఆ ఆసుపత్రి కూడా అప్పుచేసి కట్టింది. వాళ్ళు మంచిగా మాట్లాడుతున్నారని మోస బోకు. అదంతా నటన. మాయచేసి వలలో వేసుకోవాలని చేసే ప్రయత్నం. ఎవరైనా సరే పైపైకి పాకాలి. పైవాళ్ళతో సంబం ధాలు కలుపుకోవాలి. అంతే తప్ప కిందికి దిగజారకూడదు. తక్కువ స్థాయివారితో వియ్యమందుకోకూడదు"

బాబు ముఖం కందగడ్డ అయ్యింది. విసురుగా లేచాడు.

"బాబూ! ఒక్క సంగతి గుర్తుపెట్టుకో నీ కోసం నీ ఉన్నతికోసం నా జీవితాన్నే ఫణంగా పెట్టేన్రా. నీ బాగుకంటే నాకేమీ అక్కర్లేదురా. నేను వేసే ప్రతి అడుగూ నీ కోసమేరా. నువ్వీ స్థితికి కారణమైనవాడ్ని నిన్నింకా ఉన్నతస్థాయికి తీసుకెళ్లాలనుకుం టున్నవాడ్ని. నామీదా నా శక్తియుక్తుల మీదా నీకు నిజంగా నమ్మకముంటే నీ పెళ్లి సంగతి కూడా నాకొదిలెయ్"

బాబు మాట్లాడలేదు.



అక్కడ్నుంచి మౌనంగా నిష్క్రమించాడు.

★ ★ ★

బాబు తిరుగు ప్రయాణపు సన్నాహంలో వున్నాడు.

అవాళ పెళ్లి పూసెత్తినప్పట్నుంచీ అతల్లోని ఉత్సాహమంతా ఆవిరైపోయింది. నవ్వు మరచినట్టుగా వున్నాడు. ఇల్లుదాటి బయటికెళ్లను కూడా లేదు.

"బాబు బెంగగా వున్నాడండీ, వాడ్ని చూస్తోంటే కడుపు తరుక్కుపోతోంది. పోనీ ఆ సంబంధమే చేసేస్తే" అంది పార్వతి.

"ఇవాళా రేపు అలాగే వుంటుందిలే. ఎల్లుండికల్లా అంతా మరచిపోతాడు. చిన్నప్పట్నుంచీ కలిసి పెరిగినందున సుస్మిత అంటే కాస్త ఆకర్షణ వుండటం సహజం. రేపు అంతకంటే అందగత్తెని చూస్తే ఆమెని మర్చిపోతాడు. అది ఆ వయస్సుకి సహజం. అందుకే ఆకర్షణ, వ్యామోహం లాంటి పదాలు పుట్టుకొచ్చాయి"

"అవన్నీ నాకు తెలీదు. మనక్కావాల్సింది బాబు సుఖమేకదా. బాబు కోరుకున్నట్టు చేస్తే బావుంటుందండీ"

"బాబు సుఖం, సంతోషం, భోగం, భాగ్యం అన్నీ కోరి మరీ చెబుతున్నానే. ఫలానా గొప్పవారి అల్లుడనిపించుకోవడం బావుంటుందా రిటైర్డ్ గుమస్తా అల్లుడంటే ఘనతగా వుంటుందా చెప్పు? ఈడ్చి తన్నినా పదివేలు మించి కట్నం ఇవ్వలేడు రామారావు. పది పదిహేనులక్షలు. ఒకటీ రెండూ కాదే పది పదిహేను లక్షలిస్తామంటూ సంపన్నులొస్తున్నారే. ఇహ పెట్టుపోతల సంగతి చెప్పేదేముంది. నువ్వా నేనా అన్నట్టు పెడతారు. బాబు అడుగులకి మడుగులొత్తుతారే పిచ్చిదానా? "

"మీరెన్నైనా చెప్పండి. లక్షాధికారులైనా లవణమన్నమే తింటారు. నిలువెత్తు ధనం కన్నా కోరుకున్న అమ్మాయితో పెళ్లి ఎక్కువ ఆనందాన్నిస్తుందండీ. నా మనస్సులోని మాట చెబుతున్నాను. బాబుకే కాదు నాకూ సుస్మితమీదే వుంది. మనింటి మహలక్ష్మి అయ్యే అన్ని లక్షణాలూ ఆ అమ్మాయిలో వున్నాయి. మా మాటకి విలువుంటే సుస్మితని ఈ ఇంటికోడల్ని చెయ్యండి. లేదా మీ పంతమే నెగ్గించుకోండి"

"అది కాదే..."

ఆమె విసవిసా వెళ్ళిపోయింది.

నిస్సహాయంగా మిగిలిపోయారు.

కాస్సేపలా ఒంటరిగా కూర్చున్నాక ఒక నిర్ణయానికొచ్చి హైదరాబాద్ ఫోన్ చేశారు ముకుందం.

విమానం ఎక్కించి వద్దామంటూ ఒక రోజు ముందుగానే బయల్దేరదీశారు.

ముగ్గురూ స్వంత కార్లో హైదరాబాద్ వెళ్ళి హోటల్లో బసచేశారు.

తల్లీకొడుకులు వూరంతా తిరిగొచ్చేసరికి హోటల్ గది జనంతో కిటకిటలాడుతోంది.

నివ్వెరపోయి చూడగా వాళ్ళని అందరికీ గొప్పగా పరిచయం చేశారు ముకుందం.

"మనం ఇక్కడున్నామని తెలిసి పిల్లనిస్తామంటూ ఏకంగా పిల్లల్ని వెంటబెట్టుకొచ్చేశారే. చూడు మన ప్రభ ఎలా వెలుగుతోందో" అన్నాడు గర్వంగా నవ్వుతూ.

పార్వతికి సంతోషం వేసింది. కొడుకు వంక ఉత్సాహంగా చూసింది. అతడు ఉదాసీనంగా వుండిపోయాడు.

అవాళ మొత్తానికి ముగ్గురమ్మాయిల్ని బాబుకి పరిచయం చేశారు ముకుందం.

ఒకమ్మాయి ఇంద్రాణి. తమ వూరు వెదుక్కుంటూ వచ్చిన సంబంధం తాలూకు అమ్మాయి. ఆమె తండ్రి ప్రముఖ కాంట్రాక్టర్ భూషణం.

శిరీష రెండో అమ్మాయి. మెడిసిన్ ఆఖరి సంవత్సరం చదువుతోంది. పెళ్లిమీదకన్నా





గ్రీన్‌కార్డుమీదే అధిక ఆసక్తి చూపుతోంది.

మరొకామె సుచిత్ర. సెక్రటేరియట్లో జాయింట్ సెక్రటరీగా పనిచేస్తున్న పరాంకు శంగారమ్మాయి. కొంచెం ఫ్యాషన్‌గా వున్నా చురుకైనదీ తెలివైనదీనూ.

వాళ్ళూ వాళ్ళ తాలూకువాళ్ళు కూడా బాబుతో పార్వతితో ఎన్నో మాట్లాడివెళ్ళారు.

తర్వాత కబురు చేస్తానని చెప్పారు.

సద్దుమణిగాక అంది పార్వతి. "హోటల్లో హడావిడి, పెళ్లిచూపులేమిటండీ. వాళ్ళ ఇళ్లూ పద్ధతులూ చూడకుండా పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోకుండా నాకేం నచ్చలేదు. మన తరపున నలుగురైనా లేకుండా మనకి మనమే సంబంధం గురించి మాట్లాడేస్తే ఏం బావుంటుందీ!"

"కాలంతోబాటే మనమూ మారాలే. ముందు బాబు అభిప్రాయం చెప్పనీ తర్వాతన్నీ తిరగేద్దాం. ఏరా బాబూ చూసినవారిలో ఏ అమ్మాయి నచ్చిందిరా"

"నాకిప్పుడు పెళ్లిచేసుకోవాలని లేదు డాడీ"

చిన్నగా నవ్వారు. "నీ కిష్టమైనప్పుడే చేసుకుందువుగాన్లే. ఎవరు బాగున్నార్రా చెప్పు చాలు"

"అది కాదు డాడీ..."

"నీకంటే అన్నిటా ఎంతో అనుభవమున్న వాణ్ని. నీ బాగే ఏకైక లక్ష్యంగా గలవాణ్ని చెబుతున్నాను విను. ఈ ఒక్కసారికీ నా మాట విను. ఇక ఏ విషయంలోనూ నా నిర్ణయం నీమీద రుద్దను. సరేనా? "

నిస్సహాయంగా చూశాడు. వాడి బాణం తగిలిన పక్షికూనలా విలవిల్లాడుతూ చూశాడు. కళ్ళల్లో కన్నీటిపొర కదుల్తోంటే తలతిప్పేసుకుని "మీ ఇష్టం" అన్నాడు.

"నీకెవరు ఇష్టమైతే వాళ్ళనే చేస్తా్రా. అందరికన్నా ఎవరు బావున్నారో చెప్పు చాలు. మిగతావి మేం చూసుకుంటాం"

అతడు మాట్లాడలేకపోయాడు. కళ్ళ ముందు సుస్మిత కదుల్తోంది.

"ఇంద్రాణా? " అడిగారు ముకుందం.

ముగ్గుర్లోకీ మెరుపుతీగలా మెరిసిపోతోందామె. పైగా తమని వెదుక్కుంటూ వచ్చిన సంబంధం అది. వారి తాలూకు బంధువులు తమ వూళ్ళోనూ వున్నారు. వారి ద్వారా బీరకాయ పీచు సంబంధం కలిసింది కూడానూ. దానికితోడు మిగతా అమ్మాయిలు, తండ్రులు, ఉన్నతాధికార్లు. వాళ్ళముందు తను వెలవెలపోతున్నట్టుగా అన్పించడంతో ముకుందం కాంట్రాక్టర్ సంబంధంవైపే మొగ్గుచూపారు.

తలూపాడు.

"మంచి సెలక్షన్‌రా. మిగతావి నేను చూసుకుంటాన్లే" అన్నారాయన సంతృప్తిపడి లేస్తూ.

"ఎవరు నచ్చేరని అడక్కుండా ఎవరు బాగున్నారని అడుగుతారేవిటీ" అంది పార్వతి.

"బాగుంటే నచ్చినట్టేకదా"

"మీదంతా డొంకతిరుగుడు వ్యవహారం"

"మాత్ర చేదుగా వుందా తీపిగా వుందా అన్నది ముఖ్యం కాదు. ఎలా పనిచేస్తోందన్నదే ప్రధానం"

మర్నాడు విమానం ఎక్కేవరకూ కూడా ముభావంగానే వున్నాడు బాబు. ముకుందం మాత్రం బాబు ఉజ్వలభవిష్యత్తు గురించీ కాంట్రాక్టర్ భూషణంతో సంబంధం కలుపుకోగానే రాబోయే కీర్తి సంపదల గురించీ చెవి నిల్లు కట్టుకుని మరీ చెబుతూనే వున్నారు.

పార్వతి మౌన ప్రేక్షకురాల్లా వుండిపోయింది. ఆమెకి పట్నపు సంబంధం ఏమాత్రం రుచించలేదు. ఎంతో అసంతృప్తిగా వుండిపోయింది.

★ ★ ★

బాబు ఎక్కిన విమానం గాలిలోకి తేలింది.

ఒక బరువు దిగినట్టుగా ఫీలయ్యారు

ముకుందం.

"బాబు సుస్మిత గురించి ఏం గొడవ చేస్తాడోనని భయపడ్డాను. నేను ముందే చెప్పానుగా. ఆమెమీద వున్నది కేవలం ఆకర్షణ. ఆమెకన్నా అందమైన ఇంద్రాణిని చూశాక ఆమెని మరచిపోయాడు"

"సుస్మిత సంసారపక్షపు అమ్మాయండీ. డాక్టరీ చేసినా గర్వం లేశం కూడా లేదామెకి. ఈ అమ్మాయిదంతా పైపై మెరుగుల బాపతులావుంది. పట్నపు పిల్ల మనతో పాలూ నీళ్ళలా కలిసిపోతుందో లేదో. "ఉరిమిచూశారు. గమ్మునుండిపోయిందామె.

"చూడు పార్వతీ. మనం పుట్టిపెరిగిన వాతావరణం వేరు. అందువల్ల మనకేవో భయాలుండటం సహజం. కానవి నిజం కాదు. పట్నపు అమ్మాయే కాదు, ఏ దేశపు అమ్మాయి అయినా సరే సంబంధం కలుపుకుంటే తప్పకుండా కలిసిపోతారే. ఆడదాని బ్రతుకు మగవాడితోడిదే కదా. అయినా ఆ అమ్మాయి కాపురం చెయ్యబోయేది అమెరికాలోనన్న సంగతి మర్చిపోకు"

"అంటే బాబు అమెరికాలోనే వుండిపోతాడా? " ఆందోళనగా అడిగింది.

"అహహ... ఇంకో ఏడాది వుండి వచ్చేస్తాడు. తర్వాత ఉద్యోగం సిటీలో వస్తుంది గాని మనూళ్ళోనో మన పల్లెలోనో రాదు కదా"

దిగులుగా చూస్తూ అంది, "నాకు మాత్రం నచ్చలేదు"

"రేపు వాళ్ళ ఇల్లూ వాకిళ్ళూ చూశాక నాది సరైన నిర్ణయమని నువ్వే ఒప్పుకుంటావు"

మరుసటిరోజున కూడా హైదరాబాదులో వుండిపోయారు.

భూషణం వందిమాగధుల్తో వచ్చి ముకుందం దంపతుల్ని తీసుకెళ్ళారు. జూబ్లీ హిల్స్‌లోని తమ భవనాన్ని చూపించారు. తమ ఆస్తిపాస్తుల వివరాలూ, రాజకీయ సంబంధాలూ వివరించారు.

"అబ్బో... బాగా స్థితిమంతులేనే" అనుకుంది పార్వతి. ఇలాంటి ఇంటి అమ్మాయి తమింటికొచ్చి కాపురంచేస్తుందా అన్న సందేహం వేరూని మెల్లగా వృక్షమవ్వసాగింది.

భూషణంగారి భార్య లక్ష్మి. పట్టుచీరకట్టుకుని ఒంటినిండా నగలు దిగేసుకుని అమ్మవార్లా ఉంది. ఆవిడ మాటా పలుకూ ప్రవర్తనా కూడా పాత జానపద సినిమాల్లోని మహారాణిని జ్ఞప్తికి తెస్తున్నాయి. మాటకిముందు 'నాకు ఏడు వారాల నగలున్నాయి', 'మాది తరతరాల్నుంచీ ఉన్నత వంశమే' అంటోంది.

ఆమె ధోరణి పార్వతికి బొత్తిగా నచ్చలేదు. ఇంద్రాణి తక్కువగా మాట్లాడి వినయంగా మసలినందున 'ఈ అమ్మాయికి తల్లి పోలిక రాలేదులే' అని సంతుష్టిపడింది.

పదిహేను లక్షల కట్నానికి సంబంధం ఖాయం చేసుకుని తిరుగుముఖం పట్టారు.

పదివేల రూపాయల పట్టుచీర పెట్టారు పార్వతికి.ఆమె ఆనందానికవధుల్లేకపోయాయి.

★ ★ ★

హైదరాబాద్‌లో బాబు, ఇంద్రాణిల వివాహం చాలా ఆడంబరంగా అట్టహాసంగా జరిగింది.

బాబు ఇంటికి రానని చెప్పి హైదరాబాదులోనే వుండిపోయాడు. అతడి భావం గ్రహించిన ముకుందం మరి రెట్టించలేదు. మూడు డీలక్స్ బస్సుల్లో బంధుమిత్రుల్ని తీసుకుని తరలివచ్చారు.

బాబు మావగారు భూషణానికి చాలా పలుకుబడి వుంది. చాలా మందితో చాలా రకాల సంబంధ బాంధవ్యాలున్నాయి. అంచేత ఎందరో నాయకులూ అధికారులూ అనధికారులూ విచ్చేశారు.




అడుగడుగునా డబ్బు కట్టలు పరచగా వైభవంగా వివాహ వేడుక ముగిసింది.

మగపెళ్ళివారికి గౌరవమర్యాదలు బ్రహ్మాండంగా జరిగాయి.

కాని ముకుందానికి మాత్రం ఎంతో ఆశా భంగం అయ్యింది. తనకి అగ్రతాంబూలం లభిస్తుందనీ తనని మహరాజులా నెత్తిన పెట్టుకుని పూజిస్తారనీ భావించారు. ప్రతీదీ తనని సంప్రదిస్తారనీ తనమాట వేదవాక్కుగా నడచుకుంటారనీ తలంచారు.

కానందుకు భిన్నంగా జరిగేసరికి మింగుడుపడకుండా వుంది.

భూషణం తనిష్టానుసారం అన్నీ చేశాడు తప్ప ముకుందాన్ని పట్టించుకోలేదు. ఒక్కోసారి బాబునీ ఇంద్రాణినీ సంప్రదించాడు తప్ప ముకుందం అభిప్రాయం అడగలేదు. ఫుల్‌సూట్‌లో దొరబాబులా వున్న బాబుని అందరికీ గొప్పగా పరిచయం చేశాడు తప్ప ముకుందాన్ని చెయ్యలేదు.

దాంతో వారి ప్రభముందు తను వెలవెలబోతున్నట్టుగానూ ఒక మూలకి త్రోసివేయబడినట్టుగానూ ఫీలయ్యాడు ముకుందం. ఎంతో న్యూనతగా అన్పించడమేకాదు అవమానం జరిగినట్టుగా లోలోన రగుల్తూండిపోయారు. ముఖం ఎర్రగా చేసుకుని ఓ పక్కన కూర్చుండి పోయారు.

పార్వతి మాత్రం అంతా తానే అయి తిరుగుతూ గాలిలో తేలిపోతోంది. లక్ష్మికి అతిశయమూ గర్వమూ ఎక్కువని అంతా చెవులు కొరుక్కుంటున్నప్పుడు మాత్రం ఆమె కళ్ళల్లో ఏదో తెలీని భయపు నీడలు రెపరెపలాడాయి.

"మీ వియ్యపురాలి ముందు భూములాగవు" అని కొందరు మొఖమ్మీదే అనేసేసరికి ఆమెలోని భయాలు సెలవేయసాగాయి!

పెళ్ళికి సుస్మిత వచ్చింది. బాబు మొఖం చాటెయ్యడానికి ప్రయత్నించాడు. ఆమె ఓ గిఫ్ట్ ఇచ్చి మనస్ఫూర్తిగా అభినందించి వెళ్ళిపోయింది.

మొఖానికి చిరునవ్వు అతికించుకుని మిగతా తతంగం పూర్తిచేశాడు బాబు.

బాబూ, ఇంద్రాణీ హనీమూన్‌కి కొడైకెనాల్ వెళ్ళారు. ఆ ఏర్పాట్లన్నీ భూషణం చేశారు. తనకి వాటి గురించి మాటమాత్రం గానైనా చెప్పనందుకు మండిపోయాడు ముకుందం. తర్వాత తనే తమాయించుకోక తప్పలేదు.

కొడుకుని ఇంద్రాణికీ హైదరాబాదుకీ అప్పగించేసినట్టు ఫీలవుతూ ముకుందమూ పార్వతీ ఇంటిముఖం పట్టారు.

"పెళ్ళి కన్నులపండుగగా జరిగిందండీ. బాబూ కోడలూ మనింటికొచ్చి సత్యన్నారాయణ వ్రతం చేసి వెళ్ళి వుంటే బాగుండేది" అంది దారిలో పార్వతి.

ముకుందం బదులివ్వలేదు. ఏదో ఆలోచిస్తుండిపోయాడు.

మరి మూడు నెలలకి బాబు హైదరాబాద్ వచ్చాడు. అక్కడ్నుంచే తల్లిదండ్రుల్తో ఫోన్లో మాట్లాడాడు. ఇంద్రాణిని తీసుకుని అమెరికా వెళ్ళిపోయాడు.

తమని రమ్మని వియ్యంకుడు పిలవనందున కాళ్ళు కట్టేసుకుని ఇంట్లోనే వుండిపోయారు ముకుందం దంపతులు.

★ ★ ★

రామారావూ, సరస్వతీ వచ్చారు.

ముకుందం దంపతులు సాదరంగా ఆహ్వానించారు.

పలకరింపులయ్యాక అన్నారు, "సుస్మికి సంబంధం చూశాం. కుర్రాడు కూడా డాక్టరే. ఇచ్చి పుచ్చుకోటాలవీ మాట్లాడుకోడానికి ఇవాళొస్తున్నారు. మీరిద్దరూ వచ్చి మా తరపున పెద్దల్లా వ్యవహరించాలి"

కళ్ళు చెమ్మగిల్లగా తలాడించారు ముకుందం.

పెళ్ళికొడుకు డాక్టర్ రవి బాగున్నాడు. చలాకీగా వున్నాడు. జోకులేస్తూ హుషారుగా వున్నాడు. సుస్మికి తగిన వరుడన్పించింది. బాబు కన్నా ఇతడే ఆమె పక్కన బాగున్నాడేమో అన్పించిందో క్షణం.

రవీ సుస్మీ విడిగా మాట్లాడుకున్నారు. ఒకరినొకరు ఇష్టపడ్డారు. అతడు కూడా ఈ వూరొచ్చి ఆమెతో కలిసి నర్సింగ్‌హోం నడుపుకోడానికి అంగీకరించాడు.

కట్నకానుకల గురించి పట్టుబట్టలేదు.

రామారావు తను ఇవ్వగలిగింది చెప్పేడు.

"మాక్కావాల్సింది మంచి కుటుంబం. మాతో కలిసిపోయే చక్కని అమ్మాయి. ఇహ డబ్బంటారా వాళ్ళే సంపాదించుకుంటారు" అంది వియ్యపురాలు.

రవి చిన్నప్పుడే తండ్రి చనిపోగా ఆవిడే అతడ్ని పెంచి పెద్దచేసింది. ఆప్యాయతలు పంచిచ్చి ఆసరాగా నిలిచే వారికోసం తహతహలాడుతోందామె!

మరో పదిహేనురోజుల్లో పెళ్ళికి ముహూర్తం నిర్ణయించారు.

ముకుందం, పార్వతి దగ్గరుండి పెళ్ళి పెద్దలుగా వ్యవహరించి అన్ని వ్యవహారాలూ చక్కబెట్టారు.

బాబు వస్తాడని ఆశించారుగాని గ్రీటింగ్స్ పంపి వూరుకున్నాడతడు.

సుస్మిని అప్పగిస్తోంటే తమలోని ఓ భాగాన్ని మరెవరికో ధారాదత్తం చేస్తున్నట్టు విలవిల్లాడింది పార్వతి!

★ ★ ★

"పెళ్ళయ్యాక బాబు చాలా మారిపోయాడండీ" పితూరీ చేస్తున్నట్టుగా అంది పార్వతి.

"ఎందుకనీ"

"ఇదివరకట్లా ఉత్తరాల్లేవు. ఫోన్లు లేవు. మనం ఫోన్‌చేసినా ముక్తసరిగా మాట్లాడుతున్నాడు తప్ప నోరారా మాట్లాట్టంలేదు. కోడలుపిల్ల మనబ్బాయిని కట్టడి చేస్తోందేమోనని నా అనుమానం"

"మొత్తానికి అత్తవన్పించావ్" నవ్వేరు. కానా నవ్వులో జీవంలేదు.

"అలాగని కాదండీ. మీతో అంటీముట్టనట్లు మాట్లాడినా నాతో గలగలా సెలయేరు పారినట్టు మాట్లాడేవాడండీ. అలాటిదిప్పుడు పలుకే బంగారమైపోయింది. ఇది తప్పకుండా కోడలిపనే అయ్యుంటుంది. మన గురించి ఇంకా ఏం నూరిపోసేస్తోందో మహాతల్లి!"

"ఛా... అవేంమాటలే. ఇంద్రాణి అలాటిది కాదులే..."

"అబ్బో సంబడం! ఆ తల్లికి కూతురు కాదూ? ఆ బుద్ధులెక్కడికి పోతాయి!" మూతీ, చేతులూ తిప్పింది.

"అలాటిదేం లేదుగాని లేనిపోని అనుమానాలు పెట్టుకోకు. బాబు ఉద్యోగపు బాధ్యతలతో బిజీగా వున్నాట్ట"

"మీరు వంద చెప్పండి, వెయ్యి చెప్పండి కాని ఇదంతా కోడలి చలవే. కాపురంచేసే లక్షణం కాలిగోటి దగ్గరే తెలుస్తుందని వూరికే అన్నారా. కోడలి పద్ధతి నాకు మొదట్నుంచీ అనుమానంగానే వుందంటే నమ్మండి. హయ్యో! అత్తింట ఒక్క నిద్ర కూడా చెయ్యనిది ఇంకేం కాపురం చేస్తుందండీ!"

"గోరంతల్ని కొండంతలు చేసుకుని ఇదవ్వకు పార్వతీ. కలవారి బిడ్డకదా కాస్త అర్థం చేసుకో మరి"

"అయితే రోజూ బంగారం తినమనండి. అంతేగాని తలబిరుసు వ్యవహారాలు నాకు నచ్చవు. నా కోడలు నా ఇంటి కాపురం చెయ్యాల్సిందే. అంతా మీ కోడల్ని మాకు చూపించరా అని అడుగుతోంటే తలెత్తుకోలేకపోతున్నాను. లోకంలో ఇందరు కోడళ్ళు





న్నారు. ఎవరూ ఇలా చెయ్యలేదు" ముక్కు పుటాలదుర్తోంటే వుక్రోషపడింది.

"సమయం వచ్చినప్పుడు తప్పకుండా వస్తుందే"

"ఆ సమయం ఎప్పుడొస్తుందండీ నా పాడె లేచినప్పుడా? "

"పార్వతీ!"

"ఏంచేస్తారో ఏమో నాకు తెలీదు. ఈ లంకంత కొంపలో ఒక్కదాన్నీ బిక్కుబిక్కు మంటూ వుండలేకపోతున్నాను. ఇన్నాళ్ళూ సంపాదించింది చాలుగాని అబ్బాయినిహ ఇక్కడికొచ్చెయ్యమనండి. కొడుకూ, కోడలూ కళ్ళెదుట వుండాలనీ చిలకాగోరింకల్లా వుంటే చూసి మురిసిపోవాలనీ మీకు మాత్రం అన్పించట్లేదా చెప్పండి"

"పిచ్చిదానా. బాబు ఇండియా వచ్చినా ఏ ముంబాయిలోనో మద్రాసులోనో ఉద్యోగం చేస్తాడుగాని మనూళ్ళో చెయ్యడు కదా. అటువంటప్పుడు మన కళ్ళముందు వుండ టమనే ప్రశ్నలేదు"

"మరైతే ఈ లంకంత కొంపా, స్విమ్మింగ్ పూలూ గూర్ఖా కారూ ఇవన్నీ ఎవరికోస మండీ"

వులిక్కిపడ్డారు. సమాధానమేమీ తోచ లేదు. తననితాను ప్రశ్నించుకున్నారు.

తన కోరికని తీర్చుకోడానికా? ఇగోని సంతృప్తిపరచడానికా?

స్టేటస్ పెంచుకోడానికా? సుఖాన్ని జుర్రుకోడానికా?

ఎందుకు?

సరైన సమాధానం లభించలేదు. లభిం చిన సమాధానం నచ్చలేదు.

"మనకోసమేనే..." జీరగొంతుతో అన్నాడు.

"ఈ వయస్సులో ఇవన్నీ మనకెందు కండీ? ఇవన్నీ ఏంజేసుకుంటాం? ఏ పంచన తలదాచుకుంటే వెళ్ళిపోదు మనకి? "

తడబడ్డారు. ఆమె నిలదీసి ప్రశ్నిస్తోంటే తప్పుచేసినవాళ్ళా తబ్బిబ్బు పడ్డాడు.

"సరేలే... సంపాదించింది చాల్లే. ఇహ బాబుని ఇండియా వచ్చెయ్యమని రాసే స్తాన్లే. మనకళ్ళముందు వుండకపోయినా అందుబాటులోనైనా వుంటాడు. వాళ్ళ కడు పున కాయకాసే వరకూ మనకీ ఒంటరి తనం తప్పదు. ఆ తర్వాత వాళ్ళ పిల్లల్ని మనమే సాకవచ్చులే"

"మీరొక్కళ్ళూ ఈ ఇంటిని పట్టుకుని వ్రేలాడితే వ్రేలాడండి. నేను మాత్రం కొడు కింటికెళ్ళిపోతాను"

దెబ్బతిన్నట్టు చూశారు. బాధగా చూశారు.

"అదేంమాటే. ఇన్నేళ్ళు కాపురం చేశాక..."

"చేశాను గనుకే చెబుతున్నాను. అబ్బా యిని విడిచి వుండలేనింక. ఏక్షణాన గుటుక్కుమంటానో ఎవరికి తెలుసు? అదేదో బాబు నీడనే పోవాలి, బాబు ఆనం దాన్ని చూస్తూపోవాలి"

"అవేంమాటలే. ఇంకా మనవల్నెత్తుకో వాలి. వాళ్ల పెళ్లిళ్లు చెయ్యాలి..."

"కొడుకు పెళ్లిచేసి బావుకున్నాంకదూ ఇక వాళ్ళ పెళ్లిళ్ళు కూడా చేద్దాం"

ఆమెకి దుఃఖం పొంగి వచ్చింది. పవిట కొంగుతో ముఖం కప్పుకుని మౌనంగా ఏడ్వ సాగింది.

"ఛా... ఏడుపెందుకే. వూరుకో. సరే నీమాట ప్రకారమే కానిద్దాంలే. అబ్బాయి దగ్గరకే వెళ్ళివుండొచ్చులే" అన్నారు.

కాని ఇంద్రాణి తమని ఆదరిస్తుందో లేదో నన్న దిగులు గొంతుకు పట్టుకునేసరికి శూన్యంలోకి చూస్తూండిపోయారు.

ఇంద్రాణితో పెళ్ళిచేసి తప్పటడుగు వేశా నేమో అన్పించసాగింది ముకుందానికి.

చదరంగంలో చకచకా పావుల్ని కదిపి

చెక్ చెప్పబోతూండగా తన రాజు బందీ అయిపోయినట్టుగా వుందాయన పరిస్థితి.



"ఏవిటంతసేపు ఫోన్లో మంతనాలు? ఏవంటున్నారేవిటి మీ డాడీ? " ఇంద్రాణి అంది దొరబాబుతో.

"ఇండియా వచ్చెయ్యమంటున్నారు"

"ఎందుకట పాపం"

"నన్ను వదలి వుండలేకపోతున్నారట"

"ఇన్నాళ్ళూ ఎలా వున్నార్ట? అయినా మీ డాడీకి సెంటిమెంట్స్ తక్కువని చెప్పేరుగా. వాళ్ళ నాన్న పోయినా చలించలేదనీ వాళ్ళ అన్నగారి పంచన తల్లి నిర్లక్ష్యానికి గురైనా పట్టించుకోలేదనీ చెప్పేరుకదా"

"మా మమ్మీ వుండలేకపోతోందిట. నా గురించి బెంగపెట్టుకుందిట"

"ఇన్నాళ్ళూ వాళ్ళకి లక్షలకి లక్షలు దోచి పెట్టారు. అంచేత అప్పుడు మీ డబ్బు తప్ప మీరు కన్పించలేదు. ఇప్పుడు నేనొచ్చి ఇల్లు దోచనివ్వటంలేదుకదా, అందుకని ఈ ఎత్తు ఎత్తారు. వాళ్ళ ప్రేమ మీ డబ్బుమీదగాని మీమీదకాదు. మీరు గంగిగోవుకదా ఇట్టే కరిగిపోతారని బుడిబుడిరాగాలు తీస్తున్నారు!"

"అనవసరంగా వాళ్ళని ఆడిపోసుకుంటా వెందుకు? నేను పంపిన డబ్బంతా నాకోసమే దాస్తున్నారు తప్ప దుబారా చెయ్యట్లేదుకదా. వాళ్ళది తినే వయస్సూ అనుభవించే వయస్సూ కాదు కదా!"

"సరిసరేలెండి. మీవాళ్ళని ఒక్కమాటంటే చాలు దండకం చదివేస్తారు కదా. ఇన్నాళ్ళూ మీ డాడీ చెప్పినట్టు విన్నారు. ఇకనుంచి నేను చెప్పినట్టు వినండి చాలు. ఏడాది తిరిగేసరికల్లా కోటీశ్వరులమైపోతాం"

"చూడు ఇంద్రాణీ. ఆశకి హద్దువుండాలి. అందిన దానికి తృప్తి పడాలి. అలా పడనప్పుడు ఎంతున్నాసరే అసంతృప్తీ బాధా వేదనా మిగుల్తాయి!"

"మీరు చెప్పొచ్చేదేవిటి? ఇండియా వెళ్ళిపోదామంటారు. అంతా అమెరికా రావాలనీ ఇక్కడి డాలర్ల పంట కోసుకోవాలనీ వెంపర్లాడుతోంటే మీరు ఇవన్నీ తొక్కుకుంటూ వెళ్ళిపోతానంటారు. అసలక్కడేం వుందండీ మట్టీ, మశానం, ఆకలీ, దారిద్ర్యం, అశుభ్రతా, నిరక్షరాస్యతా తప్ప!"

"ఏమైనాకానీ అది మన జన్మభూమి. మనల్నింత చేసిన భూమి. మనం ఎన్ని దేశాలకి విస్తరించినా ఎన్ని పూలూ పండ్లూ పండించుకున్నా మన వేళ్ళు మాత్రం ఆ కర్మభూమిలోనే వున్నాయన్న సంగతి మర్చిపోకు" ఒకనాడు సుస్మిత అన్న మాటల్ని గుర్తుచేసుకుంటూ అన్నాడు బాబు.

"వట్టి పుస్తకాల కబుర్లు! అక్కరకురాని కబుర్లు!" హేళనగా నవ్వింది.

"ట్రై టు అండర్‌స్టాండ్. ఆ భూమి ఆ నీరూ ఆ మనుషులూ ఆ అనుబంధాలూ ఆ అనుభూతులూ ఆ ప్రేమానురాగాలూ ఆ కుటుంబ సంబంధాలూ నిజంగా అపూర్వం. అమృతప్రాయం!"




"ఇలాటి పిచ్చి సెంటిమెంట్సుతో చక్కని అవకాశాలూ సంపాదనా మార్గాలూ పాడు జేసుకుంటారనే అలాటివి పెట్టుకోకూడద న్నారు మీ డాడీ. మళ్ళీ వాటిల్లో కూరుకు పోతానంటారేవిటి. నాకిక్కడ చాలా బావుంది. ఇక్కడి సౌకర్యాలు బాగున్నాయి. స్టేట్స్‌లో వున్నందునే ఇండియాలో మనల్ని దేవతల్లా చూస్తున్నారండీ. ఆ చూపులూ ఆ అభినందనలూ ఆ పొగడ్తలూ ఇక్కడొచ్చి పడే డబ్బూ ఇవన్నీ నాకిష్టం. ఇక్కడే వుండి పోదాం"

ఆమెవంక జాలిగా చూశాడు. "సమయం వచ్చినప్పుడు ఆ సంగతి ఆలోచిద్దాంలే"

"వూహూ... ఇప్పుడే తేలిపోవాలి. పెళ్ళ య్యాక నోరు తెరచి ఏదీ అడగలేదు. నా కోరిక కాదనొద్దు. మీరెంతో తెలివైనవాళ్ళు. మీరు కంప్యూటర్ రంగంలో అద్భుతాలే సృష్టించగలరని మీ కోలీగ్స్ అంటున్నారు. మరికొందర్తో కలిసి కంప్యూటర్‌కి సంబం ధించిన కంపెనీని ఫ్లోట్ చేద్దాం. లక్షల డాలర్లు ఆర్జిద్దాం. కోట్లకి పడగెత్తుదాం..." పరమానందపడిపోతూ ఊహల్లో వూరే గుతూ అంది.

ఆమెవంక అయోమయంగా చూశాడు. పిచ్చిగా చూశాడు. సానుభూతిగా చూశాడు. చిన్నగా నిట్టూర్చి బెడ్‌రూంలోకెళ్ళిపో యాడు.

డబ్బు! సంపద! సుఖం! స్వర్గం!

నిన్నటిదాకా డాడీ కల- ఆశ- ఆకాంక్ష అది!

ఇవాళ ఇంద్రాణి కల-ఆశ-ఆకాంక్ష అదే!

ఇద్దరి మధ్యా తను? !

ఇద్దరి కోరికల్నీ అద్దరికి చేర్చే పడవతను!

భోరున ఏడ్వాలన్న కోరికను బలవంతాన నిగ్రహించుకున్నాడు బాబు.

అన్నీ అందర్నీ మర్చిపోడానికి కంప్యూ టర్ ముందు కూర్చున్నాడు.

క్షణాల్లో అందులో నిమగ్నమైపోయాడు.

ఇంద్రాణి చూసింది.

తన మాట మన్నించి కంప్యూటర్‌కు సంబంధించిన పరిశోధనలో నిమగ్నమై పోయినందుకు పొంగిపోయింది.

ఇలాగే రాత్రీ పగలూ శోధిస్తే పరిశో ధిస్తే- అతడి విజయం విలువ లక్షలకోట్ల డాలర్లవుతుంది.

అప్పుడిహ... ఓహ్! ధనవంతుల్లోకెల్ల ధనవంతులైపోతారు!

అక్షరాలా ఆనంద నాట్యం చేసింది ఇంద్రాణి.

★ ★ ★

డాక్టర్ సుస్మిత కన్సల్టింగ్ రూంలో ఆమె కెదురుగా కూర్చున్నారు ముకుందం.

ఆమె రిపోర్టుల్ని పరిశీలిస్తోంటే ఉద్వి గ్నుడై చూడసాగారాయన.

ఈమధ్య ఆయన ఆరోగ్యం సరిగ్గా వుండ టంలేదు. ఆకలి మందగించింది. నీరసంగా వుంటోంది. ఎక్కువ శ్రమ పడలేకపోతు న్నారు. కొంచెం కోప్పడినా సరే కళ్ళు తిరు గుతున్నట్టుగా అన్పిస్తోంది.

మొదట ఇవన్నీ వయస్సు సహజాలని వూరుకున్నారు. కాని కొద్దిరోజులక్రితం పార్వతి కళ్ళు తిరిగి పడిపోయింది. ఫోన్ చెయ్యగానే పరుగున వచ్చి చికిత్స చేసింది సుస్మిత. హైబీపీ అని చెప్పింది.

పైకి మామూలుగానే కన్పిస్తున్నా లోలోన దేని గురించో బహుశా కొడుకు గురించే అయ్యుంటుంది మధనపడుతూ బీపీ కొనితెచ్చుకునుంటుందనుకున్నాడు.

అప్పుడు తన గురించి చెప్పగా అశ్రద్ధ చేస్తున్నందుకు సన్నగా మందలించింది. బలవంతాన ఆసుపత్రికి తీసుకొచ్చి అన్నీ పరీక్షలూ చేయించింది.

వాటి వివరాలు తెలుసుకోడానికొచ్చారి



ప్పుడు.

"సారీ అంకుల్. బీపీతోబాటు సుగర్ కూడా హెచ్చుగానే వుంది. మీరు చాలా కంట్రోల్లో వుండాలి"

ఆయన మొహం నల్లబడింది. అంతలోనే చిన్నగా నవ్వేరు.

"నాకు స్వీట్స్ చాలా ఇష్టం. ఇదివరకు డబ్బు ఖర్చని తినలేదు. ఇప్పుడిహ తినడానికి లేదన్నమాట. ఫన్నీగా వుంది కదూ!"

"లైఫ్‌లో ఒక్కోసారంతే అంకుల్. రాళ్ళు కూడా తిని అరగించుకునే కాలంలో మరమరాలు కూడా దొరకవు. వజ్రాలు కూడా తినగల స్థితిలో వున్నప్పుడు పిడికెడు మెతుకులు కూడా అరగవు!"

"నా విషయంలోనూ అదే నిజమవుతుందేమో, చూద్దాం"

ఆయన స్వరం వణికింది.

సానుభూతిగా చూసింది.

"కొన్ని జాగ్రత్తలు తీసుకుంటే కొంచెం స్వీట్ తిన్నా ఫర్లేదు"

"మీ డాక్టర్లు అలాగే చెబుతార్లే. నిరాశ అనేది మీ డిక్షనరీలోనే వుండదు. సరే మందులవీ రాసివ్వు"

మందులు రాసిచ్చి తీసుకోవాల్సిన జాగ్రత్తలు చెప్పింది.

వెళ్తానంటూ లేచారు ముకుందం.

"అంకుల్..." సంకోచిస్తూనే పిలిచింది.

ఆగి ఏవిటన్నట్టు చూశారు. "ఎనీ ప్రాబ్లం? "

"ప్రోబ్లం అని కాదు"

"తండ్రిలాంటి వాడ్ని. నా దగ్గర దాపరికమెందుకు. చెప్పమ్మా"

సంశయిస్తూనే అంది, "దొరబాబు ఉత్తరం రాశాడు. మరీ ఒంటరితనం ఫీలవుతున్నట్టున్నాడు"

"అదేవిటి? భార్య అక్కడే వుందికదా"

"ఇద్దరికీ మౌలికంగా కొన్ని డిఫరెన్సెస్ వున్నట్టున్నాయి. ఆవిడ తత్వం వేరనీ అర్థం చేసుకోడానికి ప్రయత్నించదనీ రాశాడు మరి. ధనిక కుటుంబంనుంచొచ్చింది గనుక కొంచెం గర్వం, అతిశయం వుండొచ్చు"

"ఊహూ... నేన్నమ్మను. ఏదో మూడ్‌లో అలా రాసుంటాడు. మావాడికి సెల్ఫ్‌పిటీ ఎక్కువలే. అంతేతప్ప మరేం కాదు. ఆ పిల్ల చాలా మంచిది. చదువుకున్నది. పైగా ఏంకావాలన్నా చిటికెవేస్తే చాలు గుమ్మంలో ప్రత్యక్షమయ్యే దేశంలో వున్నాడాయె. వాడికి లోటేమిటి నీ పిచ్చిగానీ. అంతా అనుభవించడం ఆనందాన్ని జుర్రుకోవడం నేర్చుకోమని రాసేయ్"

ఆమెవంక చూడకుండా పాఠం అప్పగించినట్టు చెప్పేసి బయటికి నడిచారు.

బయటున్న వాళ్ళు ఆయన్ని చూసి మర్యాదగా లేచి నుంచున్నారు. వాళ్ళలో వాళ్ళేదో చెప్పుకోసాగారు.

కారెక్కి కూర్చున్నారు ముకుందం.

మెయిన్ రోడ్డుమీద పూలవాహనంలా వెళ్తోంది కారు.

సీట్లో వెనక్కి జేరబడి కూలింగ్ గ్లాస్ లోంచి బయటికి చూశారు.

ఒకప్పుడు నడిచెళ్ళిన రోడ్లు. ఇప్పుడు తన కారు చక్రాలకింద నలుగుతోంది.

ఒకనాడు తననో అనామకుడిగా చూసిన టౌన్ ఇవాళ నగర ప్రముఖుడంటూ హారతులు పడుతోంది.

ఎంత చిత్రం!

కాని ఆనాటి ఆరోగ్యం, ఉల్లాసం, ఆశ, తపన అన్నీ ఏమయ్యాయి?

గమ్యం చేరుతూనే చతికిలబడిపోడానికేనా ఇన్నాళ్ళు ఇన్నేళ్ళూ అవిశ్రాంతిగా పోరాడింది? !





అంతులేని నిస్పృహ ఆవరించగా వేద నగా కదిలారు. కన్నీళ్ళని బలవంతాన నిగ్ర హించుకుంటూ చూశారు.

పోర్టికోలో కారు దిగుతోంటే వరండాలో కూర్చుని ఎదురుచూస్తోన్న పార్వతి గబ గబా ముందుకొచ్చింది.

"సుస్మిత ఏవందండీ"

"అరెరె నెమ్మదే. ఇకనుంచి మనం దేనికీ ఆరాటపడకూడదు. హైరానపడకూడదు. ఆచితూచి అడుగెయ్యాలి. వేసే ప్రతి అడుగు జారకుండా చూసుకోవాలి"

"అంటే ఏమిటి" బుగ్గలు నొక్కుకుంటూ అడిగింది.

"మనం ముసలి వాళ్ళమయ్యామన్న మాట" నవ్వేరు.

ఆ నవ్వులో విషాదం తప్ప జీవంలేదు.

"సుస్మిత ఏమందండీ. మీ ఆరోగ్యానికి ఢోకాలేదని చెప్పిందా? "

"ఆందోళన పడక్కర్లేదులే. అమాంతం మంచంమీద పడేసే రోగాలు కాదులే. రోజూ కొంచెం కొంచెం చొప్పున కొరుక్కు తినే రోగాలు. నీలాగే నాకూ బీపీ వుంది. సుగర్ దానికి జతయ్యింది"

"సుగర్ అంటే? "

"చక్కెర వ్యాధి. నా ఆనందమంతా తీపిగా మారిపోయిందో ఏమో నా రక్తం నిండా చక్కెర వుందిట. అంచేత తీపి పదా ర్థాలు తినకూడదు. బీపీ వుంది గనుక ఉప్పు తినకూడదు. అల్సర్ వుంది గనుక కారం పులుపూ తినకూడదు. ఇక మిగి లిందీ తినదగ్గదీ చేదు ఒక్కటేనే!"

ఆయన కంట రెండు నీటి చుక్కలు రాలి పడటం చూసి కదిలిపోయింది. కలవరప డింది. "మీ మాటలు నాకేం అర్థంకావ ట్లేదు, తిన్నగా చెప్పండి"

"కంగారుపడాల్సిన పని లేదని చెప్పేగా. కొన్ని పథ్యాలు చెయ్యాలి. ఇష్టమైన వాటిని అయిష్టం చేసుకోవాలి. రావే. రా. అలా గార్డెన్లోకెళ్ళి కూర్చుందాం. ఈ ఆరుగాలి యోగం కూడా ఎన్నాళ్ళుంటుందోలే!"

గూర్ఖాచేత గార్డెన్లో పేముకుర్చీలు వేయిం చారు.

ఇద్దరూ మౌనంగా కూర్చుని చుట్టూ కల యచూశారు.

ఇల్లు ఎంతో పెద్దదిగా అన్పించింది. పది మంది పిల్లాపాపల్తోవుండేవాళ్ళకిగాని లిక్కు లిక్కుమంటూ వుండే ఇద్దరికోసం కాదన్పిం చింది. తోటమాలి రోజూ మొక్కల పని చూస్తున్నందున కాబోలు అన్నీ ఒక పద్ధ తిలో చక్కగా వున్నాయి. ఆ పూలు కోసి తలలో ముడుచుకునే వాళ్ళు కూడా లేకపో యారు!

ఎంతో ముచ్చటపడి కట్టించిన స్విమ్మింగ్ పూల్ నాచుపట్టి తామర కొలనులా మారి పోయింది.

నిట్టూర్చారు.

"ఇంత ఇంట్లో బిక్కుబిక్కుమంటూ వుండాలంటే భయమేస్తోందండీ"

"మనకి పాత ఇల్లే ఎక్కువవుతుందేమో"

ఉలిక్కిపడి చూసింది పార్వతి.

"ఒక్కసారి వెనుదిరిగి చూసుకుంటే మనం చాలాచాలా కోల్పోయినట్టనిపిస్తోంది పార్వతీ"

"ఇవాళేమైంది మీకు? ఎన్నడూ లేంది కొత్తగా మాట్లాడుతున్నారేవిటసలు? ఒంట్లో బానే వుంది కదా. సుస్మిత ఏవంది? చెబు తారా ఫోన్ చేసి కనుక్కోనా? " ఆదుర్దాప డుతూ లేచొచ్చి భర్త నుదుట చేయివేసి చూస్తూ అంది పార్వతి.

"పడమటి సంధ్యలో వున్నామని గుర్తు చెయ్యడానికి ఏవోటి వస్తుంటాయి. లేక పోతే మనిషికి పట్టపగ్గాలుంటాయా!"

"ఎప్పుడూలేనిది ఈ వేదాంతపు కబుర్లేవి



టండీ" కళ్ళనీళ్ళు పెట్టేసుకుంది.

"బాగా చెప్పేవు. ఇన్నాళ్ళూ ఎండమా వుల్ని చూసి అందుకోవాలని పరుగులు పెడుతూ ఎన్నో ఎన్నెన్నో కోల్పోయాను. తినాలనుకున్నవి తినలేకపోయాను, అనుభవించాలనుకున్నవి అనుభవించలేకపోయాను. ప్రేమని పంచివ్వలేకపోయాను. అనురాగాన్ని అందుకోలేకపోయాను. పరుగుపరుగున బతుకంతా పరుగైపోయింది. లక్ష్యం చేరాను. కానేం లాభం? అనుభవించడానికి లేదు. ప్రేమించడానికెవరూ లేరు. అనురాగం పంచేవాళ్ళూ కరువయ్యారు. నాకు నువ్వూ నీకు నేనూ మిగిలాం!"

"అవేంమాటలండీ. కన్నబిడ్డ వున్నాడు. కోడలు వుంది. బంధువులున్నారు. మిత్రులున్నారు"

"ఎంతపిచ్చి దానివే" అన్నట్టు నవ్వేరు.

"మా అమ్మానాన్నా గుర్తొస్తున్నారు పార్వతీ"

"ఏవండీ!"

"మా నాన్న నాకోసం పడ్డ తపనా తాపత్రయం గుర్తొస్తున్నాయి. తను నన్ను తక్కువగా చూడలేదని పరిస్థితులలాటి స్థితిలోకి నెట్టాయని నాకు చెప్పాలనెంతో తపించారు. నేను పట్టించుకోలేదు. ఆదరంగా చూడలేదు. అర్థంచేసుకోవడానికి ప్రయత్నించను కూడా లేదు"

"ఆయనకేం అదృష్టవంతులు. కొడుకులూ, కూతుళ్ళూ, మనవలూ అంతా కళ్ళ ముందుండగా అందర్నీ చూస్తూపోయారు!"

"నిజంగా అది గొప్ప మరణమే పార్వతీ. మనం పోయేప్పుడు అంతా రావటం కన్నీటి వీడ్కోలు చెప్పటం నిజంగా గొప్ప అదృష్టం కదూ? "

"అవునండీ. మీరుండి కూడా మీ అమ్మ..."

"ఆర్థిక ఇబ్బందులు తలకెత్తుకోలేక అమ్మని ఒక బరువుగా భావించాను. అన్నయ్య ఇంట అష్టకష్టాలు పడుతోందని తెలిసి కూడా కళ్ళూ, చెవులూ మూసుకున్నాను. కడకి ఆమె చనిపోతే..." ఏడ్చేశారు ముకుందం.

"ఛా... వూరుకోండి. రాష్ట్రంకాని రాష్ట్రంలో వుందామె. వెళ్ళిరావడం ఎంతో ఖర్చని మీ అన్నయ్యనే తతంగమంతా చూడమన్నారు. ఆయనా ఆవిడ కొడుకే కదా. అక్కడికదీ అదృష్టమే కదా. మీరు మాత్రం తక్కువ చేశారేవిటి. పిండదానం అవీ ఇక్కడే జరిపించారు కదా"

"ఎందుకో ధైర్యంగా వుండలేకపోతున్నాను పార్వతీ. ఒక్కసారే అశక్తుడ్నైపోయినట్టుంది"

"నాకేదో భయంగా వుంది. బాబుని వచ్చెయ్యమని ఫోన్ చేస్తాను"

"పిచ్చిదానా. నీకు మొన్న సుస్తీ చేసినప్పుడు నువ్వు బాబుకోసం కలవరిస్తున్నావని ఫోన్ చేశాను. బాబుని వెంటనే బయల్దేరి రమ్మన్నాను. అప్పుడు కోడలేమందో తెలుసా? ఈ మాత్రానికే అంత కంగారుపడాలా, మంచి డాక్టర్‌కి చూపించండి అంది. బాబు ముఖ్యమైన పరిశోధనలో వున్నాడనీ అతడి టైమ్ బంగారంకన్నా విలువైందనీ చెప్పింది. అదంతా నీకు చెబితే బాధపడ్తావని క్యాంపుకెళ్ళాడని అబద్ధం చెప్పేను"

డీలాపడింది. గుడ్లప్పగించి పిచ్చిదాన్లా చూస్తూండిపోయింది.

కాస్సేపయ్యాక తనలో తను అనుకుంటున్నట్టుగా అంది, "మనం సుస్మితని కోడలిగా చేసుకునుండాల్సింది"

"**నుదుటిరాతనెవరు** తప్పించగలరు? " అంటూ లేచి అన్నారు. "ఇవాళెంచేతో గుడి కెళ్ళాలనీ పురాణం వినాలనీ అన్పిస్తోంది పార్వతీ. ఓసారలా వెళ్ళివద్దాం పద"

అతడిలో చెలరేగుతోన్న సంఘర్షణ గుడి




లోనే సర్దుమణగాలనుకుంటూ "పదండి" అందామె.

★ ★ ★

"ఇంద్రాణీ! ఆమధ్య మా మమ్మీ హెల్త్ పాడైనట్టూ నా కోసం కలవరించినట్టూ డాడీ ఫోన్ చేశార్టకదా. నాకు చెప్పలేదేం? " ఆఫీసు నుంచొస్తూనే అసహనంగా అరుస్తూ అడిగాడు బాబు.

"జస్ట్ కళ్ళు తిరిగి పడ్డారంతే. దానికి వర్రీ కావాల్సిన పనిలేదు. మీకు చెబితే మీ వర్కు డిస్టర్బ్ అవుతుందనీ లక్షల్లో నష్టం వస్తుందనీ"

"ప్రతీదీ డబ్బుతో కొలుస్తావెందుకు? "

"మనుషుల్ని సైతం డబ్బుతో కొలుస్తున్న కాలంకదా"

"ప్లీజ్ నన్ను అర్థం చేసుకోడానికి ప్రయత్నించు. నాకు ధైర్యస్థైర్యాలనివ్వడానికి యత్నించు. మీ డబ్బు యావతో నాలో నేను కుంచించుకుపోయేలా చెయ్యొద్దు. జీవితమంటే విరక్తి కలిగేలా ప్రవర్తించొద్దు"

"చిన్న విషయాలకి అప్‌సెట్ అవుతారేం. కూర్చోండి ముందు" అనునయంగా అంటూ కూర్చోబెట్టింది.

"ఒక పెగ్ విస్కీ వేసుకుంటారా? "

"వూహూ... వద్దు"

అతడి తలలోకి వేళ్లు పోనిచ్చి నిమురుతూ అంది, "నేను మీ భార్యనండీ. నాకెందుకు దూరంగా జరగాలని ప్రయత్నిస్తారు? "

"అదికాదు ఇంద్రాణీ. నా ఫీలింగ్స్, నా ఎక్స్‌పెక్టేషన్స్, నా ఎమోషన్స్ తెలుసుకోడానికి ప్రయత్నించు. డబ్బే జీవితం కాదు ఇంద్రాణీ. జీవితం డబ్బుకన్నా చాలా చాలా ఎక్కువైందీ విలువైందీనూ"

"ఓకే. ఒప్పుకుంటున్నాను. మీ పరిశోధన పూర్తైతే మిలియన్ డాలర్ల రాయల్టీ వస్తుంది. ఆ తర్వాతింక డబ్బు వూసెత్తను. సరేనా? "

**"ఎందుకో కాన్‌సెంట్రేట్** చెయ్యలేకపో**తున్నాను. లేకపోతే ఈపాటికి..."**

"మీ అమ్మగారికేం కాలేదండీ. దానికోసం ఏదేదో వూహించుకుని ఇదైపోతారెందుకూ"

"మా మమ్మీ సంగతి నీకు తెలీదు ఇంద్రాణీ. నా గురించి ఎంతగా తల్లడిల్లిందో, ఎంత తపస్సు చేసిందో మాటల్లో వర్ణించలేను. తను నిద్రపోతే నాకు నిద్రొస్తుందని నేను చదువుకున్నంతసేపూ నాతో బాటు మెలకువగా వుండేది. పాలూ పళ్లూ ఇచ్చేది. చన్నీళ్లతో కళ్లు తుడిచేది. నా కాలిలో ముల్లు దిగినా నిద్రలో ఉలికిపడి లేచినా 'కన్నా' అంటూ కలవరపడుతూ వచ్చేది. అనుక్షణం నన్ను కనిపెట్టుకునుండేది. నా క్షేమం కోసం పూజలు చేసేది. వ్రతాలు చేసేది. ఉపవాసాలుండేది" బరస్ట్ అవుతూ అన్నాడు.

"చిన్నపిల్లాడిలా ఏమిటిది? ఎవరైనా వింటే నవ్విపోతారు. ఓ గొప్ప కంప్యూటర్ ఇంజనీర్ ఓ సెంటిమెంటల్ ఫూల్‌లా బిహేవ్ చేస్తున్నాడనుకుంటారు. ప్లీజ్ కంట్రోల్ చేసుకోండి. మీ అమ్మే కాదు ఏతల్లి అయినా అలాగే చేస్తుంది. అందులో అంత చిత్రం ఫీలవ్వాల్సిన అవసరమేముంది? "

భార్యవంక అసహ్యంగా చూశాడు.

విసురుగా లేచాడు.

"నువ్వెప్పటికీ నా ఫీలింగ్స్ అర్థం చేసుకోలేవు" అంటూ అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు.

మనసంతా అల్లకల్లోలంగా వుంది. తన బాధకి అక్షరరూపం ఇచ్చి కవిత్వంగా మలచాలనుకున్నాడు.

కానేదో దుఃఖం మరేదో బాధ అతడ్ని మెలిపెట్టాయి. తల్లిరూపం కళ్ళముందు కదిలింది. "మమ్మీ! నిన్ను చూడాలనుందమ్మా... కానీ... కానీ..." తలగడలో తల దూర్చి ఏడ్చేశాడు.

వేదన ఎక్కువైంది. తల విదిల్చాడు.



సొరుగులోంచి ఓ డ్రగ్ బయటకి తీసి డిస్పోజబుల్ సిరంజితో తనకి తాను ఇంజెక్ట్ చేసుకున్నాడు. పిమ్మట మంచం మీద మత్తుగా పడుకుండిపోయాడు.

ఇంద్రాణి వచ్చి భర్తని చూసి "పోనీలే ఇలాగైనా మీకు మనశ్శాంతి లభిస్తే అదే పదివేలు" అనుకుంది.

★ ★ ★

సుస్మిత హడావిడిగా వచ్చింది. ఆందోళనగా వున్న ఆమెని చూసి "రామారావుకేమీ కాలేదుకదా" అని అడిగాడు ముకుందం.

"అబ్బే అలాటిదేం కాదంకుల్. మీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడదామనీ..."

ఇంతలో పార్వతి రావడంతో మాట మార్చేసింది. "ఒంట్లో ఎలావుందాంటీ?" అంటూ స్టెత్‌తో పరీక్షించింది.

"కొంచెం ఇంప్రూవ్‌మెంట్ వుంది. అయినా మందులు క్రమం తప్పకుండా వాడుతూ వుండాలి."



"రాజుల సొమ్ము రాళ్ళపాలు, వున్నవాళ్ళ సొమ్ము మందుల పాలు"

పార్వతి మాటలకి నవ్వేశారు ముకుందమూ, సుస్మీ. టీ పెడతానంటూ ఆవిడ లోపలకెళ్ళడంతో సుస్మి గంభీరంగా మారి అంది "బాబు డిప్రెషన్‌కి లోనయినట్టుంది అంకుల్"

నుదురుముడి వేసి "రాత్రి నాతో ఫోన్‌లో బాగానే మాట్లాడాడే"అన్నాడు ముకుందం.

"నాకు ఉత్తరం రాశాడు. ఏవో కవితలు రాశాడు. దాన్నిండా నిరాశే. నిస్పృహే"

"అదా. చిన్నప్పుడు కవిత్వమంటూ ఏదో గిలికేవాళ్ళే. ఓసారి గట్టిగా కోప్పడ్డాను కూడా"

"అప్పట్లో కవితల్లో ఆశాభావం వుండేది. రంగుల ప్రపంచం ఉండేది. కానిప్పుడు ఆశలుడిగినట్టూ జీవితేచ్ఛ నశించినట్టూ తానో యంత్రమై పోయినట్లూ బాధపడుతున్నట్టున్నాడు. మీరేదైనా చేస్తే బావుంటుందంకుల్. లేదా ఇక్కడి కొచ్చెయ్యమనండి. తనకక్కడ మనస్సువిప్పి చెప్పుకోడానికి సరైన స్నేహితులు కూడా లేరు. ఇక్కడంతా వుంటాంగనుక దారిలో పడిపోతాడు"

"కవిత్వం చూసి బెంబేలు పడిపోతానంటావేమిటమ్మాయ్. భార్యాభర్తల మధ్య ఏవో కీచులాటలొచ్చినప్పుడు ఏదో గీకివుంటాడు. దానికంత విలువివ్వడం అనవసరం"

"అయ్యో... మీకెలా చెబితే కన్విన్స్ అవుతారో తెలీట్లేదు"

"అనవసరంగా ఆందోళనపడకు. కుర్రాళ్ళిట్టే బెంబేలు పడతారు. మళ్ళీ అంతలోనే సర్దుకుపోతూంటారు"

"డిప్రెషన్‌కి తట్టుకోలేక డ్రగ్స్‌కి కూడా అలవాటు పడ్డాడేమోనని నా అనుమానం"

తుళ్ళిపడి చూశారు. కళ్ళింతింత చేసుకుని అపనమ్మకంగా చూశారు.

"బుద్ధిమంతుడైన బాబు..."

"అందుకే మీరు తగిన స్టెప్స్ తీసుకుంటే బావుంటుందంటున్నాను. నేను ధైర్యం చెబుతూ లెటర్ రాస్తున్నాననుకోండి. అయినా మీ మాటమీద తనకి గురి ఎక్కువ. అందుకనీ"

ఆయన కళ్లు చెమర్చాయి. అలా అని ఆమెముందు బయటపడదలచుకోలేదు. "కనుక్కుంటాన్లే" అన్నారు.

"ఏవిటి మాటామంతీ లేకుండా కూర్చున్నారూ" అంటూ టీ కప్పుల్తో వచ్చింది పార్వతి.

"బాబు గురించి"

నోట్లో మాట నోట్లో వుండగానే కంగారుగా అంది పార్వతి. "నా బాబు కేమయ్యిందీ"

"ఏంకాలేదుగాని నువ్వనవసరంగా కంగారుపడి బీపీ పెంచుకోకు" కసిరారు ముకుందం.

"నాకు చెప్పకుండా మీరేదో దాస్తున్నారు. నాకేదో అనుమానంగా వుంది. రాత్రి కలలో ఎముకల పోగులా కన్పించాడు నా బిడ్డ. ఇంక వాడ్ని చూడకుండా వుండలేను. బాబుని వెంటనే వచ్చెయ్యమనండి. మూటాముల్లె సర్దుకునొచ్చెయ్యమనండి. ఆ దేశమూ వద్దు. ఆ డాలర్లూ వద్దు. కల్లో గంజో తాగితేనేం. మనూళ్లో, మన ఇంట్లో, మన కళ్లముందు వుంటే చల్లగా వుంటాడు. ఇప్పుడే ఫోన్‌చేసి చెప్పండి. లేదా నాకు ఫోనివ్వండి నేను చెబుతాను"

"అలాగే చెబుతారుగాని నువ్వు హైరానపడకు ఆంటీ" అంటూ ఓదార్చింది సుస్మి.

"నాకేంకాదుగాని వాడ్ని వచ్చెయ్యమని నువ్వు కూడా చెప్పమ్మా. చిన్నదానివైనా నీకు చేతులెత్తి మొక్కుతున్నాను. నీ మాటంటే వాడికి వేదవాక్కే అనుకో. వాడ్ని వచ్చెయ్యమనమ్మా. దేశంకాని దేశంలో ఏమైపోతాడో నా బిడ్డ"




అంతకంతకీ పార్వతి ఆందోళన ఎక్కువయ్యింది. ఓదార్పు మాటలామెని కంట్రోలు చెయ్యలేకపోయేసరికి మత్తుమందిచ్చింది డాక్టర్ సుస్మిత.

కళ్లు తుడుచుకున్నారు ముకుందం.

★ ★ ★

సుస్మిత తమ్ముడు శ్రీను సినీనేపథ్యగాయకుడిగా మంచి పేరు తెచ్చుకున్నాడు. అతడు పాడిన ఓ పాటకి నేషనల్ అవార్డ్ వచ్చింది. ఆ సందర్భాన్ని పురస్కరించుకుని స్థానిక సాంస్కృతిక సంస్థలన్నీ కలిసి టౌన్ హాల్లో సన్మానం తలపెట్టాయి.

సభకి ముకుందం, పార్వతీ వెళ్ళారు. శ్రీనుకి పూర్ణకుంభంతో వేదమంత్రాల మధ్య సన్నాయిమేళాలతో స్వాగతం చెప్పారు, నిర్వాహకులు.

ఉపోద్ఘాత ప్రసంగాలయ్యాక శ్రీనుని సన్మానించమని ముఖ్యఅతిథిని కోరాడు అధ్యక్షుడు.

అప్పుడు శ్రీను లేచి మైక్ అందుకున్నాడు.

"నా ఈ స్థితికి కారకులైన మా అమ్మానాన్నలకి పాదాభివందనం చేశాక సన్మానం స్వీకరించాలనుకుంటున్నాను. దయచేసి మా అమ్మా నాన్నల్ని స్టేజీమీదకి రావాల్సిందిగా కోరుతున్నాను"

చప్పట్లతో టౌన్‌హాల్ మార్మోగింది.

ఇద్దరు కార్యకర్తలొచ్చి సరస్వతినీ, రామారావునీ స్టేజీమీదకి తీసుకెళ్లారు. పుత్రోత్సాహంతో వూగిపోతున్నారిద్దరూ.

వారికి పాదాభివందనం చేసి ఆశీస్సులందుకున్నాడు శ్రీను.

అతడ్ని వాళ్ళే నడిపించుకెళ్ళి ప్రత్యేక ఆసనంమీద కూర్చోబెట్టారు.

"ఈ సన్మానం నా చేతులమీదుగా జరిగే కన్నా ఇతడీ స్థాయికి చేరడానిక్కారకులైన వారి చేతులమీదుగా జరగడం అన్నివిధాలా సముచితమని భావిస్తున్నాను. చిరంజీవి శ్రీనివాస్‌ని సన్మానించాల్సిందిగా అతడి తల్లిదండ్రుల్ని కోరుతున్నాను" అన్నారు ముఖ్యఅతిథి.

చప్పట్లూ, ఈలలూ ప్రతిధ్వనించాయి.

పరమానందానికి మారుపేరై సరస్వతి అతడికి బొట్టు పెట్టగా రామారావు శాలువా కప్పి పూలదండ వేశాడు. ఇద్దరూ బంగారు తీగలు గల పుష్పాలని అతడి తలమీద చల్లారు. వేదపండితులు వేదోచ్చారణ చేసి ఆశీర్వదించారు. మంగళవాయిద్యాలు మ్రోగాయి.

ముఖ్యఅతిథీ, అధ్యక్షులవారూ ఇతర ప్రముఖులూ వివిధ సంస్థలవారూ పూలూ, అక్షతలూ చల్లారు. పూలమాలలతో సత్కరించారు.

శ్రీనివాస్ ప్రతిభని వేనోళ్ళ పొగడుతూ వక్తలు ప్రసంగించారు.

అనంతరం తనకి చేసిన సన్మానానికి సమాధానం చెప్పడానికి లేచాడు శ్రీను.

"సభకి నమస్కారం. నా సినీజీవితం గురించి మీ అందరికీ తెలుసు. మీకు తెలీనిది నా గతం. ముఖ్యంగా సంగీతం యెడల నాకున్న ఆసక్తినీ అనురక్తినీ గ్రహించి ప్రోత్సహించి నేనీస్థితికి రావడానికి కారకులైన మా తల్లిదండ్రుల గురించి రెండు ముక్కలు చెప్పడం అవసరం. అది విని అయినా ఇక్కడున్న పేరెంట్స్ వారి పిల్లల్లో గల కళాభిలాషని గుర్తించి ప్రోత్సహిస్తారని నా ఆశ.

"ఈనాటి తల్లిదండ్రులు తమ పిల్లలు డాక్టరో, ఇంజినీరో కావాలనుకుంటారు తప్ప, ఒక సంగీతకారుడో, ఒక చిత్రకారుడో, ఒక క్రీడాకారుడో, ఒక సాహితీపరుడో కావాలను కోరు. ఎందుకంటే వాటిల్లో ఆదాయం తక్కువ, శ్రమ ఎక్కువ గనుక. సుఖసంతో

షాలకి కేవలం డబ్బే చాలదని... ఒక అనురక్తి, ఒక తృప్తి వుండాలని వారు గ్రహించరు. కేవలం డబ్బు సంపాదించే యంత్రాలుగా తమ పిల్లల్ని మార్చాలని చూస్తారు. కాని మా తల్లిదండ్రులు ఆ కోవకి చెందరని సవినయంగా మనవి చేస్తున్నాను"

కరతాళధ్వనులు మిన్నుముట్టాయి.

శ్రీను ఆగి తన తల్లిదండ్రుల వంక ఆరాధనగా చూసి ప్రసంగం కొనసాగించాడు.

ముకుందం లేచి "వెళ్దాంరా" అన్నాడు భార్యతో.

"కాస్సేపుందామండీ"

పార్వతి మాటలు విన్పించుకోలేదాయన. ముందుకి నడిచారు. అనుసరించక తప్పలేదామెకి.

"వెళ్ళిపోతున్నారేం అంకుల్" అంటూ పరుగెత్తుకొచ్చింది సుస్మిత.

"ఒంట్లో బావుండలేదు"

'ఒంట్లోనా మనస్సులోనా' అనుకుంటూ చూస్తుండిపోయిందామె.



ఇంటిముందు పేముకుర్చీలో ఒంటరిగా కూర్చునున్నాడు ముకుందం.

దరిదాపుల్లో మనిషిగాని, పిట్టగాని లేరు.

పార్వతి లోపలెక్కడో గదిలో నీరసంగా పడుకునుంది. ఆమెకు సుస్థీగా వుండి రెండ్రోజులనుంచి లేవట్లేదు.

పనిమినిషి ఇన్ని మెతుకులు వండివార్చి వెళ్ళిపోయింది.

చాలా ఉదాసీనంగా వున్నాడు ముకుందం.

గత అయిదారు నెలల్లో ఒక్కసారే పదేళ్ళు పైబడ్డట్టుగా మనిషి చిక్కి సగమయ్యాడు. తెల్లగా దబ్బపండులా వున్నాడు. జుట్టు ముగ్గుబుట్ట అయిపోయింది.

ఎప్పుడైనా రామారావూ సరస్వతీ వస్తున్నారంతే. అంతకుమించి వచ్చిపోయే మిత్రులూ లేరు. బంధువులూ లేరు. అందరికీ దూరమై ఏకాంతవాస శిక్ష అనుభవిస్తున్నట్టుగా వుంది.

వైద్యం కోసం తరచూ వస్తూ వారి అతీగతీ కనుక్కుంటున్నది సుస్మిత ఒక్కతే.

దొరబాబు దగ్గర్నుంచి ఈమధ్య బొత్తిగా ఫోన్లు రావటంలేదు. ఉండబట్టలేక ఆయనే చేస్తున్నారు. మూడు నాలుగుసార్లు చేస్తే ఒకసారి లైన్లో కొస్తున్నాడు. అప్పుడైనా ముభావంగా, పరధ్యానంగా మాట్లాడుతున్నాడు.

"సంపాదించింది చాలుగాని ఇంక వచ్చెయ్యరా. నిన్ను చూడకుండా వుండలేకపోతున్నాంరా" అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నారోరోజున.

"సారీ డాడ్" అని ఫోన్ పెట్టేశాడు.

అప్పట్నుంచీ ముకుందంలో మథన మరీ ఎక్కువైంది.

ఇక పార్వతి మనోవ్యాధి పీడితురాల్లా అయిపోయింది.

"ఈ ఇల్లు అచ్చిరాలేదు. మన పాతింటికెళ్ళిపోదాం. సుఖంగా వుందాం" అంటూ

తరచూ వేధిస్తోంది.

బ్యాంకులో డబ్బు మూల్గుతోంది. దాన్ని ఇన్వెస్ట్ చెయ్యాలనీ ఇంకా పెంచాలనీ కూడా అన్పించట్లేదాయనకి.

ఏదో తెలీని నిర్లిప్తత, మరేదో నిరాశ ఆయన్ని నిలువునా ఆక్రమించేశాయి.

"టీ పెట్టమన్నారా? " పార్వతి అడిగింది వరండాలోకొచ్చి

"వద్దులే. అరెరె. నువ్వెందుకు లేచొచ్చావే. అసలే ఒంట్లో బావోలేదు. వెళ్ళి పడుకో"

"ఏవిటో భయంగా వుంటోందండీ" నేల మీద చతికిలబడుతూ అంది.

"నేల చల్లగా వుంటుందే. అలా సోఫాలో నన్నా కూర్చో" ఆమె దగ్గరికెళ్తూ అన్నారు.

"నాకిక్కడే బావుందిలెండి"

"కళ్లు మూసుకుని హాయిగా పడుకోవచ్చుగా"

"పడుకోవాలనే చూశాను. నిద్ర రావట్లేదు. ఏవో పిచ్చి పిచ్చి ఊహలూ భయాలూ" ఆమె స్వరం గాద్గదికమయ్యింది.

పమిటచెంగుతో కళ్ళూ ముక్కూ తుడుచుకుంది.

ఆవిడ పక్కనే కూర్చుని పరిశీలనగా చూశారు.

చిక్కి శల్యమైంది పార్వతి. ఒకనాడు లక్ష్మీదేవిలా కళకళలాడేది. నగలు లేకపోయినా నవ్వే పెట్టని నగగా మసిలేది. ఎంతో ధైర్యంగా ఉత్సాహంగా వుండేది.

అలాటిది.

నిట్టూర్చారు.

ఉలిక్కిపడిందామె.

"అబ్బే వూరికే ఏదో అనేశానంతే. మీరు నా గురించేం ఇదవ్వకండి. నాకేం నిక్షేపంలా వున్నాను"

"కన్పిస్తూనే వుందిగా"

"అన్నట్టు మీకీ సంగతి చెప్పానా? సుస్మిత నీళ్ళోసుకుంది"

"ఇప్పటికి రెండొందలసార్లు చెప్పావు. ఆరోనెల వచ్చిందని కూడా చెప్పావు"

"చెప్పానన్నమాట" గొణుక్కుంది.

"ఇంద్రాణి కూడా నీళ్ళోసుకోవాల్సిందే మరి. పిల్లలు ఇప్పుడప్పుడే వద్దనుకున్నారో ఏమో. లేకపోతే అన్ని ఫెసిలిటీసూ వున్న అమెరికాలో ఎందుకాలస్యమవుతుందీ"

"మనవడో మనవరాలో పుడితే వాళ్ళని చూసుకుంటూనైనా కాలక్షేపం చేసేవాళ్ళం. పోనీ ఏ డాక్టర్కైనా చూపించుకోమని కోడలికి చెబుతానండీ. పెద్దవాళ్లం వుండి కూడా ఆమాత్రం సలహా చెప్పకపోతే ఎలాగా? "

"నీ పిచ్చిగానీ మన మాట వింటుందంటావా? "

"వినకపోతే అబ్బాయికి చెప్పి నాలుగు దులపమంటాను"

"సరే. నువ్వు చెబుతానంటే నేనెందుకు కాదనాలి. అలాగే చెప్పు"

పార్వతి మొఖంలోకి వెలుగు వచ్చింది.

అది చూసి ఉత్సాహపడ్డారు ముకుందం.

"ఈ మాత్రానికే పొంగిపోతున్నావు. ఇక మనవడో, మనవరాలో పుడితే గాలిలో తేలిపోతావు కాబోలు"

ముసిముసిగా నవ్వింది.

"మీరు మాత్రం..." అంది.

ఇద్దరి మనస్సుల్లోనూ తీయని భావన మొలకెత్తింది. అనిర్వచనీయమైన అనుభూతి ఒడలంతా పాకింది.

మధురమైన ఊహల్లో ఊగుతూండిపోయారు.

స్కూటర్ శబ్దం విన్పించి ఇహానికొచ్చి చూశారు.



డాక్టర్ సుస్మిత వచ్చింది.

"హలో అంకుల్... హాయ్ ఆంటీ"

"రామ్మా రా... నెమ్మది. ఇటువంటిస్థితిలో ఇంత దూరం రాకపోతేనేం సుస్మితా" అభిమానంగా అడిగింది.

"ఈ మాత్రానికేం కందిపోన్లే ఆంటీ. గర్భిణీ స్త్రీ అటు ఇటు తిరిగితేనే ఆరోగ్యంగా వుంటుంది. ఇకపోతే నేను వచ్చి నిన్ను చూళ్ళేదనుకో బాబు నిష్ఠూరం వేస్తాడు. ఎప్పుడు ఫోన్ చేసినా ముందు మీ గురించి అడుగుతాడు"

పార్వతి కళ్ళు చెమ్మగిల్లాయి. "ఆ దేశం కాని దేశంలో బిడ్డ ఎలా వున్నాడో ఏం తింటున్నాడో? "

"అది అడవికాదు అమెరికా. ఏది తినాలంటే అది క్షణాల్లో దొరుకుతుంది" విసుక్కున్నట్టుగా అన్నాడు ముకుందం.

సుస్మిత నవ్వింది. "అమ్మ చేతివంట కూడా అమ్ముతారాండీ? "

నివ్వెరపోయారాయన. ఏడ్చేసింది పార్వతి.

"ఊరుకోండి ఆంటీ... అసలే మీ ఆరోగ్యం బాగోలేదు" అంటూ ఆమె చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకెళ్ళింది సుస్మిత.

ఇంజెక్షన్ చేసి వేసుకోవాల్సిన మందుల గురించి చెప్పింది. కాస్సేపుండి ఆ కబురూ ఈ కబురూ చెప్పింది. ఆమె మనస్సు మరల్చడానికి గర్భిణీ స్త్రీ తీసుకోవాల్సిన జాగ్రత్తల గురించి అడిగి తెలుసుకుంది. ఆమె దగ్గర సెలవు తీసుకునొచ్చింది.

"ఏమంటోంది? " గార్డెన్లో నడుస్తూ అడిగారు ముకుందం.

"కొడుకుకోసం తపిస్తోంది"

"అనుకున్నప్పుడల్లా రావటం కుదరదంటే అర్థం చేసుకోదు. తన పిచ్చే తనది"

"తనకి కొడుకు తప్ప ఇంకెవరున్నారు అంకుల్? "

తుళ్ళిపడి చూశారామె కళ్లల్లోకి. ఆ కళ్ళల్లో ఎన్నో ప్రశ్నలు కన్పించాయి. తడబడ్డారు. తల తిప్పేసుకున్నారు. "ఆంటీ బాగా వీక్‌గా వుంది. అలాగని అనారోగ్యమూ లేదు. అధైర్యపడుతోంది. ఏవేవో ఊహించుకుని భయపడుతోంది. బాబు వచ్చేస్తే బావుణ్ణు"

"నేనూ రమ్మనే అంటున్నానమ్మా. నాకు మాత్రం వాడిని చూడాలని లేదూ? నేనూ మనిషినే నమ్మా రాక్షసుడ్ని కాదు. కాదంటే మగాడ్ని గనుక బయట పడలేకపోతున్నాను"

ఆయన వంక జాలిగా చూసింది.

"మీమాట బాబుకి వేదవాక్కు. మీరు రమ్మంటే వచ్చేస్తాడు అంకుల్..."

"ఇప్పుడు కళ్ళెం కోడలి చేతిలో వుందమ్మా!"

"తనకి మాత్రం ఇక్కడికి రావాలనీ అయిన వాళ్ళతో కలిసుండాలనీ వుండదూ? "

"ఆవిడకి అక్కడే బావుందట. నువ్వు కూడా చెప్పి చూడమ్మా. బాబుకి నీ మాటంటే ఎంతో గౌరవం"

"నాకస్సలు లెటర్స్ రాయట్లేదంకుల్. ఆమధ్య కొంచెం ఇదిగా రాస్తే ఇంట్రావర్ట్‌గా మారొద్దనీ అది డిప్రెషన్‌కి దారితీయొచ్చనీ రాశాను. ఆ తర్వాత ఉత్తరాలూ లేవు, ఫోన్లూ లేవు"

"పని వత్తిడి ఎక్కువగా ఉన్నట్టుందిలే. ఏం ఉద్యోగాలో ఏమిటో! ఒకరకంగా బతుకుల్ని తాకట్టు పెట్టేసినట్టే అనుకో!"

"వర్క్‌హాలిక్ అవడమూ మంచిది కాదు"

"కోడలి కడుపునో కాయ కాసుంటే అబ్బాయి ధోరణి కూడా మారేది. బిడ్డ ఆలనాపాలనా చూస్తూ ఆ రంధిలో పడేవాడు.




ఇద్దరు పిల్లలు పుడితే ఒకళ్ళని మేం తీసు కురావచ్చనుకున్నాం. మాకూ ఓ లక్ష్యం ఏర్పడేది కదా"

"పోనీ ఏదైనా వ్యాపకం పెట్టుకోండి అంకుల్"

"బాబే నా వ్యాపకం. బాబు ఉన్నతే నా వ్యసనం. బాబే నా బతుకు. నా లోకం, నా సర్వస్వం...." బరస్ట్ అవబోయి నిగ్రహించు కున్నాడు.

అయినా ఆయన పరిస్థితి గ్రహించిం దామె.

"ఇంద్రాణికి వాళ్ళమ్మా నాన్నలచేత చెప్పిస్తే ఇండియా వచ్చెయ్యడానికి అంగీకరి స్తుందేమో"

"వాళ్ళు చెప్పరమ్మా. వాళ్ళంతా డబ్బు మనుషులు"

'ఒకప్పుడు మీరూ అంతేకదా' అనుకుంది మనస్సులో.

"కోడలికి సంతానయోగం ఉందంటావా సుస్మితా? నువ్వు కరెక్ట్‌గా చెపుతావు. మన వల కోసం మీ ఆంటీ కలవరిస్తోందనుకో"

"ఇప్పుడప్పుడే పిల్లలు వద్దనుకుని వుంటా రంకుల్. లేకపోతే ఇప్పుడది సమస్యే కాదు".

"సలహా ఇస్తూ నువ్వైనా రాయి తల్లీ. పిల్లల్లేని ఇల్లూ కాయల్లేని చెట్టూ ఒకటే"

"అలాగే అంకుల్. నేవస్తాను. ఆంటీకి దగ్గూ, ఆయాసం ఎక్కువైతే గనుక ఫోన్ చెయ్యండి"

తలూపారు.

ఆమె వెళ్ళిపోయింది.

ఆ వెళ్ళినవైపే చూస్తూండిపోయాడు ముకుందం.

★ ★ ★

గీతోపన్యాసం ప్రవాహంలా సాగిపో తోంది.

"వ్యాసమహర్షి విరచితమైన మహాభా రతం ఒక మహాగ్రంథం. ఒక మహా కావ్యం. రాజు గురించి, రాజ్యం గురించి, ప్రజల గురించి, బంధాల గురించి, బంధు త్వాల గురించి, కోరికల గురించి, ఆశల గురించి, అనుబంధాల గురించి అదీ ఇదీ అని కాదు. అన్నిటి గురించీ విపులంగా రచింపబడిన పంచమవేదం. ఏ విషయ మైనా సరే ఏ సమస్య అయినా సరే ఎలాంటి ప్రవర్తన అయినా సరే తీసు కోండి. అవి భారతంలో వుండితీరతాయి. భారతం చర్చించని విషయమంటూ భూమ్మీద ఏమీ మిగల్లేదు. అందుకే అది పంచమవేదమైంది.

మనిషి ఎలా నడవాలి, ఎటు నడవాలి అని మార్గం చూపే మార్గదర్శి భారతం. ఎలా నడిస్తే ఎలాటి ప్రతిఫలం లభిస్తుందో సామాన్యులకి సైతం అర్థమయ్యేలా వివరిం చబడింది.

కేవలం కథ చెప్పి వూరుకోలేదు వ్యాసమ హర్షి. మానవప్రవృత్తుల్ని నభూతోనభవిష్య తిగా చిత్రించారు.

ఉదాహరణకి ధృతరాష్ట్రుడిని తీసుకోండి. అతడు అంధుడు. అతళ్ళా బిడ్డలమీద అంధప్రేమతో ప్రవర్తించేవాళ్ళు, బిడ్డల దుశ్చ ర్యలని సైతం వెనకేసుకొచ్చేవాళ్ళు కళ్ళున్నా సరే గుడ్డివాళ్ళే అవుతారు. అలాటి తండ్రు లకి ప్రతీక ధృతరాష్ట్రుడు. కౌరవ కులనాశ కుడు సుయోధనుడు కాదు ధృతరాష్ట్రుడే. అటువంటివాడికి ఏ తండ్రికీ పట్టని దౌర్భాగ్యం పడుతుంది. కడుపున పుట్టిన పుత్రుల చితికి నిప్పు పెట్టాల్సిన దౌర్భాగ్యం కన్నా విషాదం ఏముంటుంది ఏ తండ్రి కైనా? "

ఎంతో దాహంగా అన్పించింది ముకుందా నికి.

లేచి చక్కా వచ్చేశారు.

"ఏవిటప్పుడే వచ్చేశారు? స్వాములవారి

ఉపన్యాసం బావుండలేదా? " తలుపు తీస్తూనే అడిగింది పార్వతి.

"అహహ... అదేం కాదు"

"మరి...? "

"ఏవిటో కూర్చోలేకపోయాను"

"ఒంట్లో బావుందికదా? " కలవరపడింది.

"ఒంట్లో బాగానే వుంది"

బాత్‌రూమ్‌లో కాళ్ళు కడుక్కుని వస్తూ అన్నారు. "మనింట్లో మహాభారతం వుండాలికదా"

"ఇప్పుడదెందుకు గుర్తొచ్చింది? "

"బాబు చిన్నప్పుడు మా అమ్మా నాన్నా బాబుకోసం రామాయణ భారత గ్రంథాలు తెచ్చిచ్చారు. గుర్తుందా? "

తలూపింది.

"అప్పట్లో అవి పుక్కిటపురాణాలనీ, పనికి రాని పుస్తకాలనీ భావించాను. అవి చదవటం దండుగని అటకమీదికి విసిరికొట్టాను"

"మీకెంత తోస్తే అంతే. ఎవరి మాటా విన్పించుకోరుకదా!"

"అప్పుడు చాలా పిచ్చిగా ప్రవర్తించాను పార్వతీ. అది తల్చుకుంటే చాలు సిగ్గుగా అన్పిస్తోంది"

"అప్పుడు మావయ్యగారెంతో బాధపడ్డారు"

"వాళ్ళు జీవితాల్ని చూసినవాళ్ళు. అందుకే ఆ మహాగ్రంథాల్లో జీవితసారం వుందని గ్రహించారు. రామాయణ భారతాలు సామాన్య గ్రంథాలు కావు పార్వతీ. తల్లి, తండ్రి, కొడుకు, కూతురు, భార్య, తమ్ముడు, సేవకుడు, స్నేహితుడు, హితుడు, బంధువు- ఎవరు ఎలా వుండాలో ఎలా వుండకూడదో కథల రూపేణ అరటిపండు ఒలిచినట్టు చెప్పేరు. మానవనైజాన్నీ చిత్త ప్రవృత్తుల్నీ ఆవిష్కరించారు. ఎన్నెన్నో జీవిత సత్యాల్నీ జీవన పరమార్థాన్నీ వివరించారు. అది గ్రహించలేకపోవటం నా దురదృష్టం!"

విస్మయంగా చూస్తోంది పార్వతి.

"వాటిని పారాయణం చెయ్యాలన్పిస్తోంది పార్వతీ"

"ఆ భగవంతుడే మీలో ఆ కోరిక నాటి వుంటాడు. తప్పకుండా చదవండీ. పుణ్యం పురుషార్థం వస్తాయి. మన బాబు త్వరగా వచ్చి మన కళ్ళముందు మసుల్తాడు"

ఆనందోద్వేగంతో వూగిపోతూ పూజ గదిలోకెళ్ళిందామె.

పూజామందిరం క్రిందనున్న సొరుగు లాగి అందులోంచో మూట బయటికి తీసింది. దుమ్ముదులిపి పసుపు గుడ్డ ముడి విప్పింది. రామాయణ భారత గ్రంథాలని బయటికి తీసి కళ్ల కద్దుకుంది.

"అప్పుడు మావయ్యగారు తెచ్చిచ్చినవే. మీ కంటబడితే కోప్పడతారని జాగ్రత్తగా దాచాను" భర్త చేతికందిస్తూ అంది.

అభినందిస్తూ చూశారు.

వాటిని చేతుల్లోకి తీసుకుని ఆప్యాయంగా నిమిరారు ముకుందం.

★ ★ ★

ఫోన్‌మీద మళ్ళీ మళ్ళీ ప్రయత్నించారు ముకుందం.

నో రెస్పాన్స్.

ఎన్నిసార్లు చేసినా రిసీవర్నెవరూ ఎత్తటంలేదు.

బాబులేకపోయినా ఇంద్రాణి అయినా రిసీవర్ తీయాలి గదా!

ఎందుకు తీయట్లేదు?

ఒకటి కాదు రెండు కాదు గత పది రోజుల్నుంచీ ఇదే పరిస్థితి!

ఆపాదమస్తకం ముచ్చెమటలు ధారలుగా




కారిపోతోంటే బేలగా చూశాడు భార్యవంక.

"నా బిడ్డ ఏమయ్యాడండీ. వెళ్ళను వెళ్ళను అంటే వాడ్ని మీరే బలవంతపెట్టి పంపారు. నాకు డబ్బూ వద్దు డాలర్లూ వద్దు. నాకు నా బాబు కావాలి. నా బంగారు తండ్రి కావాలి. నాకు తెచ్చివ్వండి" భర్త చొక్కా పట్టుకుని గుంజేస్తూ హిస్టీరియా పేషంట్లా అరిచింది పార్వతి.

"అసలేం జరిగిందో తెలుసుకోకుండా ఏవిటా ప్రేలాపన"

"ఆ డబ్బూ దస్కం అన్నీ మీరే వుంచుకోండి. నాకు బాబు కావాలి. ఇంకేం వద్దు. ఎలాంటి సంపదలూవద్దు. బాబు... బాబు..." బావురుమంది.

"ఛా వూరుకోవే. ఇప్పుడేవయ్యిందనీ ఆ ఏడుపు. ఏ కేంపుకో వెళ్ళుంటారు. మనకి చెప్పడానికి వీలు కుదిరివుండదు. ఆ మాత్రానికే బెంబేలు పడిపోతే ఎలా చెప్పు" గుండెల్ని తొలుస్తోన్న భయాల్ని తొక్కిపట్టి అనునయంగా అన్నారు.

"అంతే అంటారా? నా బాబు..."

"క్షేమంగా వున్నాడు. సరేనా?"

"ఎక్కడికెళ్ళినా వారానికి ఒక్కసారైనా ఫోన్ చేసేవాడు కదా"

"పని ఒత్తిడిలో మునిగిపోయి వుంటాడు"

"నాకేవిటో భయంగా వుందండీ"

"నీవన్నీ ఉత్త భయాలు"

ఇంకేదో అనబోతూ లోపలికొస్తోన్న సుస్మితని చూసి ఆగారు.

ఆమె చాలా ఆందోళనగా వుంది. కళ్ళు ఎర్రగా వున్నాయి. కన్నీళ్ళతో ఉబ్బి ఉన్నాయి. సన్నగా కంపిస్తోంది కూడా.

ఆమెనెన్నడూ అలా చూళ్ళేదేమో అదిరిపడ్డారు ఆలుమగలిద్దరూ.

"సుస్మితా అంతా బాగున్నారు కదా"

"బాబుగురించేమైనా వార్తవచ్చిందా అంకుల్" ఆయన మాటలు పట్టించుకోకుండా అడిగింది.

"లేదే"

"ఫోన్‌గాని, ఉత్తరంగాని, పార్శెల్‌గాని"

"ఏమీ రాలేదే. ఎందుకలా అడుగుతున్నావు?"

"ఏమీరాలేదా" నిస్త్రాణగా కూలబడుతూ అడిగింది.

"మా ఫోన్‌కి రెస్పాన్స్‌లేదు. బాబుతో మాట్లాడి పదిరోజులు పైనే అయ్యింది" అన్నారు ముకుందం.

"అలావున్నావేం సుస్మితా. నా బాబు క్షేమంగా వున్నాడు కదా?" గాభరాపడింది పార్వతి.

"ఆ... అహ... బాగానే వున్నాడు"

"మరలా వున్నావేం? నిన్నెన్నడూ ఇలా చూళ్ళేదు" అనుమానంగా గుచ్చిగుచ్చి చూస్తూ అడిగారు.

"అబ్బే. ఏదో పీడకల వచ్చింది. అందుకనీ... అంతే అంకుల్"

"వాడిదగ్గర్నుంచి ఫోనులేదు. నీకేమో పీడకల వచ్చింది. నాకు చాలా భయంగా వుందండీ. బాబు స్నేహితులకి ఫోన్ చేసి కనుక్కోండి. వియ్యంకుడికి ఫోన్ చెయ్యండి. నా బాబు ఎక్కడున్నాడో ఏవిటో కనుక్కోండీ" ఏడ్చేసింది పార్వతి.

"ఆంటీ ఆంటీ... ధైర్యంగా వుండండి మరి. అసలే మీ ఆరోగ్యం బాగుండలేదు"

"నా బాబుని చూడకుండా వుండలేను. ఒక్కక్షణంకూడా వుండలేను" బిగ్గరగా ఏడ్పు సాగింది.

చేష్టలు దక్కి చూస్తుండిపోయారు ముకుందం. ఆయనకంతా అయోమయంగా వుంది.

పార్వతి పరిస్థితికి విచలితమయ్యింది సుస్మిత.




ఇటువంటప్పుడు అణువంత వార్త కూడా విస్ఫోటించే అవకాశముందని భయపడింది.

కన్నీళ్ళు ఆపుకుందామన్నా ఆగటంలేదు.

ఏం చెప్పాలో ఎలా చెప్పాలో ఏం చెబితే ఏమవుతుందో అర్థంగాక విచిత్రమైన అవస్థలో పీకలదాకా కూరుకుపోయింది.

"ఆమధ్య ఓ మంచి ప్రాజెక్టు వర్కు లభించేట్టుందన్నాడు బాబు. అది లభిస్తే కొన్నాళ్ళ పాటు ఆస్ట్రేలియాలో వుండాల్సొస్తుందని కూడా చెప్పేడు. ఒకవేళ ఆ పని మీద అక్కడికెళ్ళేడేమో? !" తనలో తను అనుకున్నట్టుగా అంది సుస్మిత.

ఆమె మాటలు పార్వతి మీద బాగా పని చేశాయి.

"మా తల్లే! ఎంత మంచి వార్త చెప్పేవే. నా ఆయుష్షు కూడా పోసుకుని నూరేళ్ళు వర్థిల్లు. నీకు పుణ్యం వుంటుంది గానీ వాడెక్కడున్నాడో ఎలా వున్నాడో తెలుసుకో తల్లీ. ఎంత డబ్బు ఖర్చయినా ఫర్లేదు. నేనిస్తాను. వాడితో ఒక్కసారి-ఒక్కసారి మాట్లాడాలి. వాడి మాట చెవిన పడకపోతే ఈ ముసలి గుండె ఆగిపోతుంది సుస్మితా..." సుస్మిత గడ్డం పట్టుకుని బతిమాల్తూనే ఆమె భుజం మీదకి ఒరిగి విలపించింది.

"మీరు ధైర్యంగా ఉండండి ఆంటీ. అన్ని వివరాలూ నేను తెలుసుకుంటానుగా, మీతో మాట్లాడకుండా తను మాత్రం వుండగలడేమిటి"

"వాడెక్కడున్నా చల్లగా వుంటే అంతే చాలు. చల్లగా వున్నాడు కదా! నువ్వు చెబితే నిజమవుతుంది. చెప్పు తల్లీ. నా బాబు, నా కన్న క్షేమంగా వున్నాడు కదూ? "

సిక్స్త్‌సెన్స్ ఏదో చెప్పినట్లు మాట్లాడుతున్న ఆమెవంక నీళ్ళునిండిన కళ్ళతో చూసింది సుస్మి.

నిజం చెప్పలేదు, అలాగని అబద్ధమూ చెప్పలేదు.

"మీ ఆశీర్వాదమున్న బిడ్డ ఎక్కడున్నా ఏ స్థితిలో వున్నా క్షేమంగానే వుంటాడు. మీరేం దిగులు పడకండి ఆంటీ"

సరిగ్గా అప్పుడు సుస్మి కడుపులోని బిడ్డ కదిలాడు.

విస్మితమయ్యింది సుస్మిత.

ఏదో భావవీచిక అలా వీచి ఇలా మాయమైంది.

ఆమె మొఖంలో క్షణకాలం మెరుపు మెరిసింది.

"అలా జరుగుతుందా? దాని కవకాశముందా? తను డాక్టరై వుండి కూడా"

ఆమె తర్కాన్ని సెంటిమెంటు డామినేట్ చేసింది.

"త్వరలోనే మనం బాబుని చూస్తాం" అంటూ లేచింది.

"నీ ఫోన్ కోసం ఎదురుచూస్తుంటాను తల్లీ. నా బాబు జాడ చెబుతావు కదూ? "

తలూపి భారంగా అడుగులేస్తూ వెళ్ళింది సుస్మి.

ఆ రాత్రి ముకుందానికి ఫోన్ వచ్చింది.

"సుస్మికి బాబు పుట్టాడు" చెప్పేడు రామారావు.

★ ★ ★

సుస్మిత కొడుక్కి బారసాల చేస్తున్నారు.

ఇదివరకు చాలా వేడుకగా చెయ్యాలనుకున్నారట. కాని ఎంచేతో సింపుల్‌గా చేద్దామని సుస్మి పట్టుబట్టడంతో నిరాడంబరంగా చేస్తున్నారు.

ఇరువైపులకీ చెందిన పెద్దలతోబాటు ముకుందం దంపతులు కూడా వేడుకలో పాల్గొన్నారు.

ముకుందం, పార్వతీ కూడా ఒక్కసారే

పదేళ్ళు పైబడినట్టుగా వున్నారు. మనో వ్యాధి పీడితుల్లా వున్నారు.

దొరబాబునుంచిగాని, ఇంద్రాణినుంచిగాని ఫోనులేదు. ఉత్తరంలేదు. వార్తలేదు.

హైదరాబాదులోని వియ్యంకుడికి కూడా ఫోన్ చేశారు.

"మీ కొడుకెంతో బుద్ధిమంతుడను కున్నాం. అలా తయారవుతాడని కలలో కూడా అనుకోలేదు" అన్నాడాయన కోపంగా.

"ఎలా తయారయ్యాడు? భార్యా భర్తలి ద్దరూ గొడవపడ్డారా? "

"అంతకంటే ఎక్కువే చేశాడు. చెప్పుకుంటే సిగ్గుచేటు!" ఫోన్ పెట్టేశాడు. హతాశుల య్యారు.

కొడుకూ కోడలూ మాటామాటా పెరిగి విడాకులవరకూ వెళ్ళేరేమో అన్పించింది. అందుకనే వేరడిపోయినందునే ఫోన్లో దొర కటంలేదేమో అన్పించింది.

ఆ మాట చెబితే పార్వతి మరింత బెంగ పెట్టుకుంటుందని చెప్పలేదు.

"అబ్బాయీ కోడలూ గొడవపడ్డట్టున్నారు. నచ్చచెప్పడానికి వియ్యంకుడు వెళ్తున్నాట్ట" అబద్ధం చెప్పేరు.

"అబ్బాయి తెగేదాకా లాగడే. పోనీ మనం కూడా వెళ్దామండీ. బాబు మీమాట కాదనడు. ఎలావోలా వాడి సంసారాన్ని ఒడ్డున పడేద్దామండీ"

"అలాగే వెళ్దాంలే. ముందెక్కడున్నాడో తెలుసుకోనీ. ఒకసారి సంగతేంటో బాబున డిగి తెలుసుకునెళ్దాం"

"త్వరగా తెలుసుకోండి మరి. సుస్మితకి బాబు పుట్టేడని తెలియజేసే వుంటారు. బాబు బారసాలనాడు తప్పక ఫోన్‌చేసి శుభాకాంక్షలు చెబుతాడండీ. బాబుకి సుస్మి అంటే ఎంతో..."

స్వరం వణకడంతో వాక్యం పూర్తి చేయ లేకపోయింది.

అయినా గ్రహించారాయన.

బాబు ఫోన్ చేస్తాడన్న ఆశతో ఆరోగ్యం సరిగాలేకపోయినా పార్వతి కూడా బయ ల్దేరి వచ్చింది.

బారసాల వేడుకని చూస్తోంటే దొరబాబు బారసాల నాటి ఘటనలు గుర్తొచ్చాయి ముకుందానికి.

అవాళ తనెంత హడావిడి చేశాడూ. తొలి సారిగా మగబిడ్డ పుట్టినందుకు వాడిదిమంచి రాశి అయినందుకు వాడి జాతకం దివ్యంగా వుందని తెలిసినందుకు ఎంత పొంగిపో యాడో! నాన్నా, మావగారూ తమతమ పేర్లు పెడతారని ఎంతగానో ఆశపడ్డారు పాపం. వాళ్ళ ఆశల్ని వమ్ముచేస్తూ దొర బాబు అని పేరుపెట్టాడు, తను!

బాబు దొరబాబు కావాలని ఆ క్షణం నుంచీ కూడా తపించాడు. కలలు కన్నాడు. వ్యూహాలు అల్లాడు. అన్నీ ఫలించి చకచకా అందలంఎక్కేశాడు. తీరా ఎక్కేశాక ఏదో శూన్యత! మరేదో నిశ్శబ్దత!

తను మెటీరియలిస్టే. తనకి సెంటి మెంట్సు తక్కువే. బాబుని కూడా అలాగే పెంచాడు. అందుకనే వాడూ అలాగే తయారై దేశంకాని దేశంలో...!

అసలంచేతే ఫోన్ చెయ్యట్లేదా?

లేకపోతే తల్లీతండ్రీ ఎలావున్నారోనన్న ఆత్రుత అభిమానంలేకుండా నెల రోజులైనా కబురు, కాకరకాయా లేకుండా!

నిట్టూర్చారు.

ఇంతలో పురోహితుడు పిలవడంతో లేచి వెళ్ళారు ముకుందం.

"మీ దంపతులిద్దరూ వచ్చి ఇలా కూర్చోండి. మీచేత పేరు పెట్టించమంటు న్నారు డాక్టరుగారు"





సుస్మివంక వింతగా చూశారు.

అవునన్నట్టు తలాడించింది సుస్మి.

ఇలాటి అనుభవాలకీ, అనుభూతులకీ తాము నోచుకోలేకపోయామని చెప్పి ఈ అవకాశం కల్పించినట్టుగా భావించారు.

ఏదో తెలీని బాధ గుండెల్ని మెలిపెడు తోంటే వెళ్ళి పీటలమీద కూర్చున్నారు.

"బాబు అని బియ్యంలో రాయండి"

ఉలిక్కిపడ్డారు. "కేవలం బాబు అంటే బాగుండదమ్మా ముందింకేమైనా తగిలిస్తే"

"రెండక్షరాలు చాలు" అంది సుస్మి.

మరేమన్లేక అలాగే రాశారు. ఎంచేతో ఆయన చేయి వణికింది. బాబుని ఒళ్ళోకి తీసుకుని "మా బాబు" అని బాబు చెవిద గ్గర చెప్పింది పార్వతి.

అపరిమితమైన ఆనందంతో ఆమె మురిసిపోవడాన్ని సజలనేత్రాలతో చూశారు సుస్మీ ఆమె భర్తా.

తన మెడలోని గొలుసు తీసి బాబు మెడలో వేసి ఆ పసివాణ్ణి ముద్దుపెట్టుకుంది పార్వతి.

బాబు కాళ్లూ చేతులూ ఆడిస్తూ మందహాసంచేశాడు.

"నా బాబే నా తండ్రే..." గుండెలకి హత్తుకుంది.

ఆ దృశ్యాన్ని అపురూపంగా చూశారు ముకుందం.

"బాబుని నాకిచ్చెయ్యి సుస్మితా. మేం పెంచుకుంటాం" అంది పార్వతి.

"పెంచుకోండి..." వెంటనే బదులిచ్చింది సుస్మిత.

అంతా సరదాగా నవ్వేరు.

సుస్మి మాత్రం కళ్ళు తుడుచుకుంది. ఆమె భుజాలు నొక్కుతూ అనునయించాడామె భర్త డాక్టర్ రవి.

"అబ్బాయి ఫోన్ చెయ్యలేదేమండీ. నాకేదో భయంగా వుంది" కారెక్కుతూనే అంది పార్వతి.

కారు పోనిమ్మని సైగచేసి "నాకూ అదే అర్థంకావట్లేదు" అన్నారు.

ఇంట్లో అడుగుపెడుతోంటే ఫోన్ మోగింది.

పరుగునెళ్ళి తీశారు.

హైదరాబాదులోని ఓ బంధువు లైన్లోకొచ్చాడు.

"నిన్న అబిడ్స్‌లో ఇంద్రాణి కన్పించింది"

"మా కోడలా? హైదరాబాదులో కన్పించడం ఏమిటి?"

"ఇక్కడి కొచ్చిందిట. పలకరించినా సరిగ్గా మాట్లాడలేదు. మీవాడి గురించి అడిగినా సూటిగా చెప్పలేదు. ఆమె వచ్చినట్టు మీకు తెలుసో లేదోనని ఫోన్ చేశాను"

"చాలా థాంక్స్. ఇప్పుడే కనుక్కుంటాను"

రిసీవర్ పెట్టేసి నుదుటికి పట్టిన చెమట తుడుచుకున్నారు.

"కోడలంటున్నారేవిటి?" ఆత్రంగా అడిగింది పార్వతి.

"ఇంద్రాణి అమెరికానుంచి వచ్చిందిట"

"మరి బాబు?"

"కనుక్కుంటానుండు"

హైదరాబాద్ ఫోన్ చేశారు.

"హలో... ఎవరూ..."

"నేనమ్మా... మీ మావయ్య ముకుందాన్ని"

"చెప్పండి"

"నువ్వెప్పుడొచ్చావు?"

"మొన్ననే"

"అబ్బాయి కూడా వచ్చాడా?"

"రాలేదు..." ఠకీమని ఫోన్ పెట్టేసింది.

"అబ్బాయి రాలేదుట" నీరసంగా.

చెప్పేరు.

"మరెక్కడున్నాట్ట? ఇదివరకటి చోటే వున్నాడా? ఫోన్ ఎత్తడేం? "

"ముక్తసరిగా మాట్లాడింది. ఇద్దరూ గొడవపడ్డారేమో"

"అయితే మాత్రం మన బాబు గురించి చెప్పడానికి నోర్రాదా? ఫోన్ చేసివ్వండి నేను మాట్లాడతాను"

పార్వతి మాటప్రకారం మళ్ళీ ఫోన్ చేసిచ్చారు.

ఇంద్రాణి రిసీవరెత్తింది.

"ఇంద్రాణీ... నేనమ్మా మీ అత్తని. నా బాబు ఎక్కడున్నాడు? "

"లాంగ్ కేంపులో వున్నాడు"

"ఫోన్ నెంబరియ్యి తల్లీ"

"దొరకరు"

"నువ్వెందుకొచ్చావు ఇంద్రాణీ. మీ ఇద్దరూ గొడవలేమైనా పడ్డారా? "

"నన్ను విసిగించకండి"

లైన్ కట్ చేసింది.

పార్వతి మోము జేవురించింది.

"అదోలా మాట్లాడుతోందేవిటి? "

"అదే అర్థంకావట్లేదు"

"మనస్సులో ఎలా వున్నా పైకి ఎంత అభిమానంగా మాట్లాడేదీ! ఇప్పుడేమయ్యిందంటారు? "

"కాస్సేపున్నాక ఫోన్ చేసి వియ్యంకుడితో మాట్లాడతాను"

"ఏదో గడబిడ వున్నట్టేవుందండీ" కళ్ళల్లో సన్నని కన్నీటి పొర కదుల్తోంటే దిగులుగా అంది పార్వతి.

ఆయన మాట్లాడలేదు. ఇద్దరూ దుస్తులైనా మార్చుకోకుండా కూర్చుండిపోయారు.

ఏదో గుర్తురాగా చటుక్కున లేచి వెళ్ళి సుస్మికి ఫోన్ చేసింది పార్వతి.

"సుస్మితా దొరబాబు ఏవన్నా ఫోన్ చేశాడా తల్లీ"

"లేదు ఆంటీ... చేస్తే అన్ని విషయాలు కనుక్కుంటాను"

"ఇంద్రాణి హైదరాబాదు వచ్చేసిందిట. మాకు మాట మాత్రమైనా చెప్పలేదు చూడు. దూరపు బంధువుకి బజార్లో కన్పిస్తే ఫోన్‌చేసి చెప్పేరు"

"అయితే ఇంద్రాణి వచ్చేసిందన్నమాట!"

"అదేదో మామూలు సంగతైనట్లు మాట్లాడతావేంటి"

"అహహ అది కాదు ఆంటీ... మరి... ఇంద్రాణి బాబు గురించేంచెప్పలేదా? "

"అదేదో కేంపులో వున్నాడంది. ఫోన్లో దొరకట్ట. ఫోన్లేని పూరెక్కడుంటుంది అమెరికాలో. దానిదంతా చోద్యంగాపోతే! అసలు ఇంద్రాణి పద్ధతే బావుండలేదు. మావగారన్న గౌరవంలేకుండా మీ అంకుల్ మాట్లాడుతుండగానే ఫోన్ పెట్టేసింది. మా బాబు లక్షలూ, కోట్లూ సంపాదించి దాని చేతికిచ్చేసరికి దాని నెత్తిమీదకి కళ్ళొచ్చాయి!" ఉక్రోషంగా అంది.

"మీరు ఆవేశపడకండి ఆంటీ. నేను ఫోన్ చేసి సంగతేంటో తెలుసుకుంటాను"

"ఆ తలతిక్కది ఏమందో మళ్ళీ ఫోన్‌చేసి చెప్పే. మర్చిపోకుసుమా" అంటూ ఫోన్ పెట్టేసింది.

"సుస్మిత కనుక్కుంటానంది"

ముకుందం బదులివ్వలేదు. ఆయనకి చాలా భయంగా వుంది. ఇన్నాళ్ళూ ఏదేదో అనుకుంటూ ధైర్యం చెప్పుకుంటూ వచ్చారు. మంచు కరిగినట్టుగా అవన్నీ కరిగిపోతోంటే రెక్కలు తెగిన పక్షిలా విలవిల్లాడసాగారు.

మరి తిన్నగా కూచోలేక మళ్ళీ హైదరాబాద్ ఫోన్ చేశారు. సమాధానం సవ్యంగా ఇవ్వకపోతే చెడామడా తిట్టెయ్యాలనుకున్నారు.




ఈసారి వియ్యంకుడు రిసీవర్ ఎత్తాడు.

"నేనండీ ముకుందాన్ని. ఇంద్రాణి ఎప్పు డొచ్చింది? "

"ఇరవైరోజులవుతోంది"

"మరిన్నాళ్ళూ మాకు చెప్పలేదేం? "

"చెప్పేందుకేముంది అంతా అయిపో యాక"

"ఏమయ్యిందంటారు? నాకేం అర్థంకావ ట్లేదు"

"అదే మంచిది"

ఫోన్ పెట్టేశాడతడు.

మొఖంలోని రక్తమంతా ఇంకిపోగా నిస్త్రాణగా కూర్చుండిపోయారు.

"ఏమంటున్నారు? అలా అయిపోయారేవండీ" వురికి రాబోతోన్న కన్నీటిని అదుపు చేస్తూ అడిగింది.

"ఇంద్రాణి వచ్చి ఇరవైరోజులయ్యిందిట"

"ఆ తిప్పులాడి సంగతెవడిక్కావాలిగాని ముందు నా బాబు సంగతి చెప్పండి"

"తిన్నగా చెప్పట్లేదు. నాకేదో భయంగా వుంది పార్వతీ. అవునూ. బాబు గురించి ఏమైనా వార్త వచ్చిందా అంటూ ఆందోళన పడ్తూ, సుస్మిత వచ్చి ఇరవైరోజులవ్వ లేదూ? "

"ఎందుకవ్వలేదూ. ఆ రాత్రే కదా పురు డొచ్చింది"

ఒంట్లోని రక్తమంతా తోడేసినట్టుగా అయిపోయారు.

ఆయనవంక భయవిహ్వలయై చూసిందామె.

సుస్మితకి ఫోన్ చేసి "నిజంచెప్పు. బాబు క్షేమంగా వున్నాడు కదా? " అనడిగారు.

"ఇప్పుడే ఇంద్రాణితో మాట్లాడాను. ఏదో స్పెషల్ ఎసైన్‌మెంటుమీద కెనడా వెళ్ళాట్ట. దాని గురించి ఇద్దరూ గొడవపడ్డారట. అందుకని ఇంద్రాణి పుట్టింటికొచ్చేసిందిట. అదంతా మీకు తెలిస్తే బాధపడతారని బాబు ఫోన్ చేసివుండడు"

"హమ్మయ్య. గుండెలమీంచి కొండంత బరువుని తీసేసినట్టుంది సుస్మితా నా ఆయుష్షు కూడా పోసుకుని నూరేళ్ళు బతుకు"

ఎంతో రిలీఫ్‌గా ఫీలైన భర్తని చూసి గబగబా పూజగదిలోకెళ్ళి దేవుడిముందు సాష్టాంగపడింది పార్వతి.

★ ★ ★

ముకుందం చొక్కా తొడుక్కొంటోంటే "ఎండాకెళ్తున్నారూ" అనడిగింది పార్వతి.

"మన పాత ఇంటిదాకా వెళ్ళొద్దామనీ. ఇంటినీ, మామిడిచెట్టునీ చూసి చానాళ్ళయ్యింది. వాటిని చూస్తే బాబుని చూసినంత తృప్తిగా వుంటుంది"

"కాస్సేపాగండి నేనూ వస్తాను"

"కారు డ్రైవర్ రాలేదే"

"నడిస్తే పట్టుమని పదినిమిషాలు పట్టదు. ఈ కార్లూ, ఈ భోగాలూ ఇప్పుడొచ్చాయిగాని ఇదివరకు నడిచేవాళ్ళంకాదూ"

"ఆ కాలంవేరు, ఆ వయస్సు వేరు"

"ఇంకేం చెప్పకండి. నేనూ వస్తున్నాను అంతే"

"సరే... త్వరగా తెములు మరి"

చీర మార్చుకుని వచ్చింది పార్వతి.

"బాబు కెనడానుంచి వచ్చేక ఇక్కడికి తీసుకొచ్చెయ్యాలి. లేదా మనమే వాడిదగ్గరికెళ్ళి వుండాలి. ఆనక మాట మారిస్తే కాదు"

"సరే అన్నాను కదే. నాకూ వాడ్ని చూడాలని తహతహగా వుంది. మనకున్నది వాడొక్కడే కదా. కళ్ళముందే వుండమంటాను. సరేనా? నువ్వురోజుకి నాలుగుసార్లా విషయం గుర్తుచెయ్యక్కర్లేదు"

"మీకు మతి మరుపొస్తోందికదా. అందుకని" చిన్నగా నవ్వింది.

"అప్పుడే ఎందుకొస్తుందోయ్ ఇంకా మనవల్ని ఎత్తుకోవాలి. వాళ్ళకి కథలు చెప్పాలి. వారి పెళ్ళిళ్ళు చూడాలి"

"అబ్బో ఎంత ఆశ!"

"నేను గనుక అక్కడితో ఆగుతున్నాను. నువ్వైతే ఏకంగా మునిమనవల్ని ఎత్తుకోవాలనుందంటావు"

"ఏడుకొండలవాడు కరుణిస్తే మునిమనవల్నీ ఎత్తుకుంటామేమో. అధ్సరేగాని మీరో సారి హైదరాబాద్వెళ్ళి ఇంద్రాణితో మాట్లాడి రాకూడదూ"

"వెళ్ళాలనేవుంది. కాని నిన్ను వంటరిగా వదిలి ఎలా వెళ్ళగలను. ఎప్పుడు నీ ఆరోగ్యం ఎలా వుంటుందో తెలీదాయె. పోనీ ఇద్దరం వెళ్దామంటే దూరాభారానికి తట్టుకోలేవు"

"సరే లెండి. ఇంకో వారం పదిరోజుల్లో బాబు వచ్చేస్తాడుగా"



ఇంటికి తాళంవేసి కబుర్లు చెప్పుకుంటూ నడవసాగారు.

"ఊరు చాలా మారిపోయిందండీ"

"చాలా వేగంగా మారిపోతోంది. మనం ఇల్లు కట్టినప్పుడు ఈ ఏరియాలో అక్కడొ కటి ఇక్కడొకటి చొప్పునున్నాయి. ఇప్పుడు చూడు ఎన్ని కొత్త భవనాలు లేచాయో"

"అవునుసుమండీ. ప్రతీ వీధీ ఓ బజారుగా మారిపోయిందండీ"

పాత ఇంటి పరిసరాలని ఆశ్చర్యంగా చూస్తూ ఇంటికెళ్లారు.

ప్రహరీ గోడ కూల్చబడి వుంది!

బుల్ డోజర్తో ఇల్లు పడగొట్టేస్తున్నారు!

మరోపక్క మామిడిచెట్టుని గొడ్డళ్ళతో అడ్డంగా నరికేస్తున్నారు!

ఆ దృశ్యాలు చూసి నోరువెళ్ళబెట్టారు. కంపిస్తూ భయంభయంగా చూశారిద్దరూ.

"పార్వతీ మనిల్లు మన చెట్టు!" గొడ్డలితో తననే నరికేస్తున్నట్టు ఆందోళనపడ్డారు.

"వెళ్ళిపోదాంపదండి" ఆయన చెయ్యి పట్టుకుని లాగుతూ అంది.

నవనాడులూ కృంగిపోయినట్టు విలవిల్లాడుతూ ఆమె చేతిని విసిరికొట్టారు.

"ఆగండాగండి" ఆవేదనతో రగిలిపోతూ అరుస్తూ వెళ్ళారు.

"చక్కని ఇంటిని కూల్చేస్తారేం? పచ్చని చెట్టుని నరికేస్తారేం? ఆగండాగండి" అంటూ వెళ్ళి పనికడ్డంపడ్డారు ముకుందం.

పనివాళ్ళంతా ఒక్కక్షణం ఆగి 'ఎవరీపిచ్చోడు?' అన్నట్టు చూశారు.

వారి చేతులూ, గెడ్డం పట్టుకుని బతిమాల్తూ "బాబ్బాబు... వీటినేం చెయ్యొద్దు. ఇవి మా ప్రాణమయ్యా. మా బాబు అక్షరాభ్యాసంనాడు పాతిన చెట్టయ్యా ఇది. వాడి చదువులానే ఎదిగి మరో వృక్షమయ్యింది. దాన్ని కూల్చొద్దు. మీకు దణ్ణం పెడతాను" అన్నారు.

"ఇప్పుడిది పరాయి సొత్తండీ. మనకేం హక్కులేదండీ" అంటూ వారించ సాగింది పార్వతి.

కానామె మాటల్ని పట్టించుకునే స్థితిలో లేరాయన.

"ఇల్లు కూల్చొద్దు. చెట్టు నరకొద్దు. మీకెంత డబ్బు కావలిస్తే అంత ఇస్తాను. ఆగండి ఆగండి"

ఆయన ప్రాధేయపడుతోంటే త్రోసిరాజన లేక పనిని నిలిపేశారు.

"ఈ ఇల్లు తవరిదాండీ" ఒకతనడిగాడు.

"అవునయ్యా. ఈ ఇల్లూ, చెట్టూ ఈ స్థలమూ అంతా మాదే. మా అబ్బాయి పుట్టిందీ, పెరిగిందీ ఇక్కడే. మా బాబు అమెరికా వెళ్ళడానికి డబ్బు అవసరమై అమ్మేశాం. ఇప్పుడు వాడు అమెరికాలో రెండుచేతులా సంపాదిస్తున్నాళ్ళే కోటీశ్వరుడైపోయాడనుకోండి. కాలనీలో పెద్ద మేడ లేదూ అది మాదే. ఇది కూడా కొనేద్దామనుకుంటూనే తాత్సారం చేశాను"

చుట్టూ చేరి ఆసక్తిగా వినసాగారంతా.

"వీటిని ఎవరు కొన్నారయ్యా? మేం తిరిగి కొనేసుకుంటాం. అమ్ముతారేమో కనుక్కుంటాము. నా బాబు చిట్టి చిట్టి పాదాలతో కేరింతలు కొడుతూ తిరిగిన చోటయ్యా ఇది. ఈ చెట్టు కాయలంటే మా బాబుకెంతో ఇష్టం" అంటూ ఆ నాటి సంగతులు చెప్పసాగింది పార్వతి.

ఇంతలో కాంట్రాక్టర్ వచ్చాడు.

పని ఆగివుండటం చూసి నిప్పులుకక్కేడు.

"ఏంట్రా. పనాపి కబుర్లేంట్రా"

"ఈయన కాళ్ళకడ్డం పడతన్నాడండి" ఓ కూలీ చెప్పేడు.

"ఏ ఊరి పిచ్చోడివయ్యా వెళ్ళెళ్ళు" ముకుందాన్ని కసురుకున్నాడు.





"ఇల్లూ, చెట్టూ అన్నీ కొనేస్తాను. ఎంత డబ్బు కావాలో చెప్పు"

"మేమేం అమ్మబోవటం లేదుగాని వెళ్ళవయ్యా స్వామి అవతల పనాగిపోయింది"

"నిజంగానే కొంటాను... నా దగ్గర డబ్బుంది"

"ఉంటే ఇనప్పెట్టెలో పెట్టుకుని తాళం వేసుకోగాని మా పనికి అడ్డురాకు" విసుక్కున్నాడు.

"తప్పుగా అనుకోకు బాబూ. ఇదివరకు ఈ ఇల్లు మాదే. ఇప్పుడు మా పరిస్థితి బాగుంది. మళ్ళీ కొనేసుకోవాలనుకుంటున్నాం. ఎంతో కొంత లాభం వేసుకుని మాకు అమ్మెయ్యి బాబూ. తల్లిలాంటి దాన్ని... నా మాట కాదనకు" అర్థింపుగా అంది పార్వతి.

"చూడమ్మా... నేను కాంట్రాక్టర్ని. యజమానిని కాదు. ఇక్కడ షాపింగ్ కాంప్లెక్స్ నిర్మించడానికి కాంట్రాక్టు తీసుకున్నాను. మీరేమైనా మాట్లాడదలిస్తే వెళ్ళి యజమానితో మాట్లాడండి. మా పనికి మాత్రం అడ్డు రాకండి" అన్నాడతను.

"ఊహూ... పనిసాగనివ్వను. ఇంటిని గాని, చెట్టునిగాని ముట్టుకోడానికి వీల్లేదు. ఇవన్నీ నావి. నేనే అమ్మేను. మళ్ళీ నేనే కొనేసుకుంటాను. ఎంత డబ్బుకావాలో చెప్పు" ఉద్రేకపడ్డారు ముకుందం.

"అబ్బో మొనగాడొచ్చాడు చూడండి"

"అవును... నేను మొనగాడ్నేనయ్యా. ఏం చేస్తావ్" మీదిమీదికెళ్ళాడు.

"అడ్డొస్తే తోసి పారేస్తాను"

"తోయి చూస్తాను..." రెచ్చిపోయాడు.

తోశాడు.

చిన్నగానే తోశాడు. కానీ ఆవేశంతో వూగిపోతున్నారేమో వెళ్ళి అంతదూరంలో పడ్డారు.

సరిగ్గా అప్పుడు ఫెళఫెళమని శబ్దం చేస్తూ కూలిపోయింది మామిడిచెట్టు.

కెవ్వుమని అరచి గుండె పట్టుకుని కుప్ప కూలిపోయాడు ముకుందం.



ముకుందాన్ని ఐ.సి.యు.లో ఉంచారు.

సుస్మితా ఆమె భర్త డాక్టర్ రవీ ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకున్నారు.

వరండాలో శోకదేవతలా కూర్చునుంది పార్వతి.

రామారావూ సరస్వతీ వచ్చి ధైర్యం చెప్పారు. అయినా ఉలుకూ పలుకూ లేకుండా వుండిపోయింది.

"పరిస్థితి నిలకడగా వుంది. ధైర్యంగా వుండు ఆంటీ. అంకుల్‌కి ఏమీకాదు..." పార్వతితో చెప్పింది సుస్మి.

"ఆయనకేం కాదు కదా? "

"ఏమీకానివ్వం. మాసివ్ ఎటాక్ వచ్చింది. ఎందుకంతగా టెన్షన్‌కి గురయ్యారో అర్థంకాదు..."

"నీకు తెలుసుకదమ్మా. పాత ఇల్లన్నా చెట్టు అన్నా ఆయనకెంతో మమకారం. మనస్సు బావుండనప్పుడు అర్ధరాత్రీ, అపరాత్రీ అని లేకుండా చెట్టుకింద కుర్చీ వేసు

క్కూర్చునేవారు. అక్కడెంతో ప్రశాంతత లభిస్తుందనేవారు..."

"అంకుల్ కి ఇన్ని సెంటిమెంట్లున్నాయని నేనెన్నడూ ఊహించలేదు"

"ఇదివరకంతగా వుండేవికాదు. తను పట్టిన కుందేటికి మూడేకాళ్ళనేవారు ఎలా తోస్తే అలా చేసేవారు. కానీమధ్య బాబు రాకపోకలు తగ్గాక, బాబుకీ మాకూ దూరం పెరిగాక..." ఆపైన చెప్పలేక ఏడ్చేసింది.

"ఊరుకోండి ఆంటీ. అంకుల్ గుండె ఇప్పుడు వేడెక్కిన చిమ్నీలా వుంది. నాలుగు నీటిచుక్కలు పడితే చాలు టఫేల్ మని పేలే ప్రమాదముంది. ఆయనకె లాంటి షాకింగ్ న్యూసూ చెప్పకుండా మనం జాగ్రత్తపడాలి..." అతికష్టంమీద చెప్పింది సుస్మి.

తన గొంతునెవరో నొక్కిపట్టి వున్నట్టుగా మాట్లాడేసరికి వింతగా చూసింది పార్వతి.

"బాబు రావాలి. వాడొస్తే ఆయన చెంగున లేచి లేడిపిల్లలా గంతులేస్తారు. బాబు ఎక్కడున్నాడో తెలుసుకుని వెంటనే ఉన్నపళాన రమ్మని చెప్పు తల్లీ. చచ్చి నీ కడుపున పుడతానమ్మా..." కన్నీటితో అర్థిం చింది.

"అలాగలాగే..."

"బాబు రావటం అంటూ జరిగితే అది నీవల్లే సాధ్యమవుతుంది. వాడ్నెలాగైనా రప్పిస్తానని మాటివ్వు. వాడు రాకపోతే నా పసుపుకుంకాలు నిలవ్వు..." బావురుమంది.

ఆమెని ఓదార్చడం సుస్మివల్ల కాదు. సర స్వతి వచ్చి పక్కకి తీసుకెళ్ళింది.

ఆమెనే చూస్తూ నిశ్చేష్టయై నిలబడిపో యింది.

"సుస్మీ!"

డాక్టర్ రవి పిలుపుకి ఇహానికొచ్చింది. కళ్ళు తుడుచుకుంటూ అనుసరించింది.

కన్సల్టింగ్ రూంలో కూర్చున్నారిద్దరూ.

ఫ్లాస్క్ లోని కాఫీ రెండుకప్పుల్లో పోశాడు రవి.

కాఫీ సిప్ చేస్తోందిగానీ కళ్ళనుంచి కన్నీ టిబొట్లు జారిపడుతూనే వున్నాయి.

"సుస్మీ! కంట్రోల్ యువర్ సెల్ఫ్..."

"ఈ పరిస్థితిని భరించలేకపోతున్నాను. ఇక ఈ నాటకాన్ని ఆడటం నాకు సాధ్యం కాదు..."

"నిజం చెబుతానంటావు. చెప్పెయ్. అప్పుడేం జరుగుతుందో తెలుసా?"

"ఏం జరుగుతుంది?"

"మీ అంకుల్ గుండె శాశ్వతంగా ఆగిపో తుంది. లేదా కోమాలోకైనా వెళ్ళిపోతారు. అది చూసి ఆంటీ కూడా..."

"నో...నో... ఊహించడానికే భయమే స్తోంది. అలా జరక్కూడదు..."

"సో... నాటకం కొనసాగించక తప్పదు"

"ఎన్నాళ్ళు?"

"సాగినన్నాళ్ళు. అసలప్పుడే మెల్లగా చెప్పేసి వుంటే బావుండేది"

"వాళ్ళకి తెలియజేస్తారుకదా అనుకు న్నాను. నా నోటితో చెప్పడానికి సాహసిం చలేకపోయాను. వారి ఆశలూ, ఆరాటాలూ చూసి మొద్దుబారిపోయాను. ఇంద్రాణీ వాళ్ళూ అంతలా మేనేజ్ చేస్తారని వూహిం చలేకపోయాను"

"అనవసరంగా బాధపెట్టడం ఎందుకను కున్నారేమో. లేదా ఆస్తి గొడవలొస్తాయని భయపడ్డారో"

"తన సంగతులు మమ్మీ డాడీలకి తెలి యకూడదని బాబు నోట్ రాశాడేమో?"

"దాన్ని వాళ్ళు లెక్కచేస్తారా?"

"అదీ నిజమే?"

"మరిప్పుడేం చేస్తానంటావు? ఏదో రక మైన ఆశ కల్గించకపోతే వాళ్ళ పరిస్థితి విష




మించే ప్రమాదముంది"

"నాకేం తోచటంలేదు. నువ్వే సలహా ఇవ్వాలి రవీ..."

"పేషెంటుని రక్షించడం ముఖ్యం గనుక శ్రీను చేత చిన్ననాటకం ఆడిద్దాం"

సాభిప్రాయంగా చూసింది.

"అనుమానం రాదంటావా?"

"రాదు. శ్రీను మంచిగాయకుడు. గొంతు అనుకరించగలడు"

"పొరపాటున తెలిసిపోతే..."

"గ్రహపాటు అనుకోవడమే"

మరో మార్గమేమీ కన్పించలేదు.

"ఓకే. శ్రీనుకి ఫోన్ చేసి చెబుతాను. నాకు మనస్సు బావుండలేదు. ఇంటికెళ్తాను. పేషెంట్సుని నువ్వు చూసుకో"

"ఇట్సాల్ రైట్. కానీ ఒంటరిగా వుంటే లేనిపోని ఆలోచనలు పీడిస్తాయి. డ్యూటీలో పడితే అవన్నీ మర్చిపోవచ్చు" సానునయంగా అన్నాడు రవి.

"నిజమే కానీ నిలవలేకపోతున్నాను. కన్నీళ్ళాగటంలేదు"

"డోంట్ బీ ఫూలిష్... నువ్వు డాక్టర్వి..."

"కావచ్చు కానీ నేనూ మనిషినేకదా..."

"ఓ.కే. దెన్..."

ఆమె భుజంమద చెయ్యేసి ఆప్యాయంగా నొక్కాడు.

"థాంక్యూ..." కళ్ళు తుడుచుకుంటూ లేచింది.

ముఖ్యమైన కేసులగురించీ జాగ్రత్తల గురించీ చెప్పి ఇంటిముఖం పట్టింది సుస్మిత.

బాబుకి పాలిస్తోంటే రెండ్రోజుల క్రితం కలిసినప్పుడు పార్వతి అన్నమాటలు గుర్తొచ్చాయి.

"అస్తమానూ ఆసుపత్రి ఆసుపత్రి అంటూ తిరిగి బుజ్జిగాడ్ని అశ్రద్ధ చెయ్యకు. అమ్మతనం ఓ బంగారువరం సుస్మితా. దాన్ని సద్వినియోగం చేసుకో. అడ్డాలనాడే మన బిడ్డలు కానీ గెడ్డాలొచ్చాక మనబిడ్డలు కాదు. వాళ్లకోసం మనం తపిస్తాం. గాని మనం వాళ్ళకి గుర్తుండం. బాబుని చూశావుగా. ఒక ఫోను లేదు పాడూ లేదు..."

కన్నీళ్ళు తుడుచుకుంటూ బాబుని ముద్దెట్టుకుంది.

సరస్వతి ఆసుపత్రి నుంచి వచ్చింది.

"కాస్సేపుండలేక పోయావా అమ్మా..."

"వంటచేసి తీసుకెళ్దామనీ..."

"ఆంటీ ఎలావుంది"

"అలాంటి పరిస్థితి పగవారిక్కూడా రాకూడదు. అవతల కొడుకు ఏమయ్యాడో తెలీదు. ఇవతల ఇంటాయన ఏమవుతాడో తెలీదు"

సుస్మి మౌనం వహించింది.

"సుస్మీ! నాకో సంగతి దాచకుండా చెబుతావా?"

"ఏవిటి అమ్మా..."

"దొరబాబు ఎందుకంత కోపంగా వున్నాడు? అతడిదెంతో సున్నిత మనస్తత్వం. ఒకర్ని నొప్పించే స్వభావమేకాదు. తను బాధపడతాడు గానీ ఇతరుల్ని బాధపెట్టడు. అలాంటిది ఇన్నాళ్ళుగా ఫోన్ చెయ్యకుండా ఇంటికి రాకుండా..."

తలొంచుకుంది సుస్మి.

"ఏం జరిగిందో నీకు తెలిసే వుంటుంది. నువ్వే దాస్తున్నావు"

"ఇప్పుడేం చెప్పలేనమ్మా"

బాబుని తల్లికి అందిచ్చి గదిలోకెళ్ళి తలుపేసుకుంది.

మంచానికడ్డం పడి బావురుమంది సుస్మిత.



కాస్సేపటికి తేరుకుంది.

బీరువాలో దాచిన ఉత్తరం తీసి చది వింది. కన్నీటి పొరల్లోంచి మళ్ళీ మళ్ళీ చది వింది.

అది దొరబాబు రాసిన ఆఖరి ఉత్తరం.

దాన్నిండా పరచుకున్నది అతడి స్వగతం. అతడి మనస్సుగోడు!

చిన్నప్పట్నుంచీ ఊహ తెలిసినప్పట్నుంచీ అతడి మెదడులో ముద్రపడిన సంఘటనల గురించి భావాలగురించి అనుభవాల గురించీ ఆశల గురించి తండ్రి విధించిన ఆంక్షల గురించి అన్నిటి గురించీ మనస్సు విప్పి రాశాడు. మనస్సు లోలోతులకి చూసి రాశాడు!

సంజాయిషీ ఇస్తూ రాశాడు.

★ ★ ★

"సుస్మీ!

ఇవాళ నా మనఃక్షోభని నీముందు పర చాలని ఈ నాలుగుముక్కలూ రాస్తు న్నాను. నన్ను ఒక ద్రోహిగా ఒక పిరికిపం దగా నువ్వు - యస్ నువ్వొక్కదానివీ భావించకూడదని నా తపన, తాపత్రయం!

చిన్నప్పట్నుంచీ కూడా నేనేమిటో నీకు తెలుసు. నా కోరికలూ ఇచ్ఛలూ అన్నీ నీకు తెలుసు. కానీ వాటిని డాడీ నెరవేరనివ్వ లేదు. ఆయన చెప్పినట్టు నడవాలి. ఆయన చెప్పినట్టు తినాలి, ఆయన చెప్పినట్టు చదు వుకోవాలి.

నా ఇష్టాల్ని చంపుకుని డాడీ చెప్పినట్టు డాడీ గీచినట్టు నడుచుకున్నాను. పురాణా లని చదవలేదు. కవిత్వంజోలికి పోలేదు. మెడిసిన్లో చేరలేదు. స్వదేశంలో వుండలేదు. నిన్ను పెళ్ళి చేసుకోలేదు. నవ్వకు సుస్మీ. నువ్వంటే నాకెంతో ఇష్టం... ప్రేమ... కానీ నీమీది నా ప్రేమ కన్నా డాడీకి నామీదున్న ఆశ, నమ్మకం అధికం. అందుకే ఆయన మాట తీసిపారె య్యలేకపోయాను. ఆయన సంతోషం కోసం ఇంద్రాణిని పెళ్ళాడేను.

తర్వాతైనా నా బతుకు నావ సాఫీగా సాగిపోతుందనుకున్నాను. కానీ ఆ ఆశ అడియాస అయ్యింది నా సంపాదనతో డాడీ తృప్తి పడ్డారో లేదో ఇంద్రాణిలో అసం తృప్తి మొదలయ్యింది. ఆమెకోసం డబ్బు యంత్రంగా మారాల్సివచ్చింది.

ఆ పరుగులు, డాలర్లు ఇవేనా జీవిత మంటే?

ఇంతకంటే మరేమీలేదా? ఇంకేమీ అక్కర్లేదా?

అభిమానంకోసం ఆప్యాయతకోసం ప్రేమకోసం అలమటించాను.

అవి దక్కలేదు.

డాడీమమ్మీల దగ్గరికి రానీకుండా కాళ్లకి బంధం వేసింది ఇంద్రాణి.

నువ్వన్నట్టు నేను ఇంట్రావర్ట్‌నే. నాలో నేనే మథనపడతాను. కుంచించుకుపో తాను. ఎవరూ లేని ఏకాకిని సుస్మీ. వున్నా వాళ్ళెవరూ నా గుండె దరిదాపులక్కూడా రారు!

ఫలితంగా అంతులేని అసహాయత. ఒంటరితనం. వైరాగ్యభావన డిప్రెషన్లో పడే శాయి. డ్రగ్స్‌కి అలవాటుపడ్డాను.

అయినా ఇంద్రాణిలో మార్పులేదు. ఆమె తృష్ణ తీరనూలేదు.

పరుగెత్తి పరుగెత్తి అలసిపోయాను సుస్మీ.

అందుకే శలవు తీసుకోవాలన్న నిర్ణయా నికొచ్చాను.

ఇది తప్ప మరోమార్గం లేదా అని నువ్వు ప్రశ్నించొచ్చు

చాలా ఉండొచ్చు

కానీ నాకేమీ కన్పించట్లేదు. నా చుట్టూ




చీకటి ముసిరేసింది. కళ్ళు పొడుచుకుని చూడాలన్న కోరికాలేదు, ఆశాలేదు. అందుకే శాశ్వతంగా కళ్లు మూసుకోవాలనుకుంటు న్నాను.

ఇతరుల తీరని కాంక్షల్నీ తీరని ఆశల్నీ తీర్చడానికి అశ్వమేధయాగంలోని పంచక ళ్యాణిలా పరుగెత్తలేను సుస్మీ!

వద్దు. ఈ బ్రతుకు వద్దు. అనుభూతులెె రుగని అనుబంధంలేని రసహీనజీవితం వద్దు.

డాడీ కోరికలన్నీ తీరాయి. పెద్దగా అప్ సెట్ కారు. ఇంద్రాణి కూడా డిటోయే. పూర్ మమ్మీ నాకోసం విలపిస్తుంది. ఇక నా స్థానం నీదే. నువ్వే మమ్మీని ఓదార్చాలి. దరిచేర్చాలి. మిత్రుడి కోసం ఆ బాధ్యత స్వీకరిస్తావుకదూ?

శలవంటూ నిన్నొదిలి తల వంచుకుని వెళ్ళిపోతున్న నేస్తాన్ని క్షమిస్తావు కదూ?

-బాబు

ఉత్తరం చదవటం పూర్తిచేసి వెక్కివెక్కి ఏడ్చింది సుస్మిత.

ఆ లెటర్ రాగానే అమెరికా ఫోన్ చేసింది. అంతకుముందురోజే బాబు ఆత్మ హత్య చేసుకున్నాడని చెప్పారు!

"మిత్రమా! డబ్బే పరమావధి అంటూ ప్రేమరాహిత్యంలో బిడ్డల్ని పెంచే తల్లిదండ్రు లకి నీ అకాల నిష్క్రమణ ఓ హెచ్చరిక" అనుకుంటూ కళ్ళు తుడుచుకుంది.

★ ★ ★

ముకుందం కొంచెంగా కోలుకున్నాడు.

ఐసియునుంచి స్పెషల్ వార్డులోకి మార్చారు.

పార్వతి టౌన్లోని అన్ని దేవాలయాలకీ వెళ్ళి అర్చనలు చేసివచ్చింది.

భర్తకి బొట్టుపెట్టి ఫలహారం నోట్లోవేసి పక్కనే కూర్చుంది.

"భగవంతుణ్ణి ఏం కోరావు పార్వతీ"

"మీ ఆరోగ్యం త్వరగా కుదుటపడాలని. మీ చేతులమీదుగా సుమంగళిగా వెళ్ళిపోవా లని. బాబు పిల్లా పాపల్తో సుఖంగా వర్ధి ల్లాలి"

"డబ్బూ సంపదా ఆస్థీ ఐశ్వర్యం ఏమీ వద్దా? "

"నెయ్యి కావాల్సిందే... అలాగని నెయ్యి నీళ్ళలా తాగలేంకదా? "

"తాగలేం అనీ, తాగకూడదనీ తెలుసుకో వడానికి ఇన్నేళ్ళు పట్టింది నాకు"

"నాకేం అర్థంకావట్లేదు"

"బాబు ఏమైనా ఫోన్‌చేశాడా? "

"సుస్మి చేసిందట. రెక్కలు కట్టుకుని రమ్మని చెప్పిందిట"

"వాడు రాడు" నిస్పృహగా అన్నారు.

ఇంతలో "ఆంటీ ఆంటీ బాబు దగ్గర్నుంచి ఫోన్..." అని అరిచింది సుస్మి.

రెండంగల్లో దూసుకెళ్ళి రిసీవర్ అందు కుంది పార్వతి.

"మమ్మీ... నీవు ఎలా వున్నావు మమ్మీ..." సుస్మి తమ్ముడు శ్రీను లో గొంతుకతో అన్నాడు.

"నాకేంరా... గుండ్రాయిలా వున్నాను. మీ డాడీకేమీ బావుండలేదురా. నీకోసం తపిస్తున్నార్రా. నువ్వు వెంటనే వచ్చెయ్యరా. మనకి అమెరికా వద్దు, ఆ డాలర్లూ వద్దురా. ఇక్కడే కలోగంజో తాగుదాంరా. వచ్చె య్యిరా నా తండ్రీ. అయినవాళ్ళూ ఆప్యాయ తలూ లేని ఆ బతుకొద్దురా. నలుగుర్తో నారాయణా అన్నార్రా. వచ్చెయ్యిరా. సంపా దించింది చాలురా. ఒరే బాబూ, నా మాట వినరా. నువ్వూ దగ్గర్లేకపోతే ఇక మేం ఎవ రికోసం బతకాల్రా. ఏం చూసుకుని బత కాల్రా... వచ్చెయ్యిరా. నా మాట విని వెంటనే వచ్చెయ్యిరా..."

"వచ్చేస్తాను మమ్మీ. డాడీని బెంగపెట్టుకో

వద్దను. బై..."

"ఉంటాన్రా..."

రిసీవర్ పెట్టెయ్యబోతోంటే ముకుందం గబుక్కునందుకున్నారు. కానప్పటికే లైన్ కట్టయ్యింది.



డీలా పడిపోయాడు.

"అయ్యో, మీరెందుకొచ్చారు అంకుల్" ఆయనకి సాయం వస్తూ అంధి సుస్మిత.

"బాబుతో మాట్లాడాలని... నాది శల్యసారథ్యం అయిపోయిందిరా అని వాడికి చెప్పాలని..."

"మీరు త్వరగా కోలుకోండి. బాబు వచ్చేస్తాడు"

"అవునండీ. మిమ్మల్ని బెంగపెట్టుకోవద్దన్నాడు. తప్పకుండా ఇండియా వచ్చేస్తానన్నాడు..." ఆనందబాష్పాలు రాలుస్తూ అంది పార్వతి.

"వాడు నా కొడుకే. వస్తాడు. నాకోసం తప్పకవస్తాడు..."

★ ★ ★



ముకుందం ఆసుపత్రినుంచి డిశ్చార్జై ఇంటికొచ్చేశారు.

గుండె కుదుటపడినా నీరసం తగ్గలేదు. మానసిక ఘర్షణా తగ్గలేదు.

అనుక్షణం బాబు గురించే ఆలోచిస్తూ ఆందోళన పడుతున్నారు.

"మీరిలాగే మధనపడితే మళ్ళీ హార్ట్ ఎటాక్ వస్తుంది. ఈసారి దేవుడుకూడా రక్షించలేడు" హెచ్చరించింది సుస్మిత.

అయినా ఆయన్లో మార్పురాలేదు. పైగా ఆకలి మందగించింది.

"అవాళ బాబు నీతో నిజంగా మాట్లాడాడా పార్వతీ"

"మాట్లాడాడండీ... నా మీదొట్టు"

"ఏం మాట్లాడాడు? "

"వాడేమో రెండుమాటలు మాట్లాడాడు. నేనే పిచ్చిగా ఏదేదో వాగేశాను..."

"మరి మళ్ళీ ఎందుకు ఫోన్ చెయ్యలేదు? నేను చావుబతుకుల మధ్య కొట్లాడుతున్నానని తెలిసి కూడా ఎందుకు రాలేదు? "

"నాకూ అదే అర్థంకావట్లేదండీ..."

"ఇక వాడురాడు. వాడికి నామీద కోపం. వాడు కోరిందేదీ వాడికి దక్కనివ్వలేదని నేనంటే వాడికిద్వేషం. అసహ్యం..." సజల నేత్రాలతో అన్నాడు.

"మీరలా ఇదవ్వొద్దు. బాబు తప్పక వస్తాడు. వాడికోసం మీరెన్ని చేశారో వాడికి తెలీదూ? ఏనాడైనా ఇష్టమైంది తిన్నారా? ఇంపైనది ధరించారా? పైసాపైసా కూడ బెట్టి వాడికోసం వాడి ఉన్నతికోసం ఖర్చుపెట్టారు..."

విరాగిలా నవ్వాడు.

"మీరలా నవ్వకండి. నాకు భయమేస్తోంది"

"అంతా పోవాల్సినవాళ్ళమేనే. ఒకరు ముందు ఒకరు వెనుక. అంతే. ఇక భయాలెందుకు చెప్పు? "

"నేను మీకన్నా ముందు పసుపుకుంకాల్తో పోవాలి. నాకన్యాయం చెయ్యకండి" వల వలా ఏడ్చేసింది.

ఆమె తల మీద చేయివేసి నిమురుతూ ఓదార్పుగా చూశాడు.

ముకుందం ఆరోగ్యస్థితీ మనఃస్థితీ కూడా రోజురోజుకీ దిగజారుతున్నాయి.

బీపీ సుగరూ పెరిగాయి. మందులు సరిగ్గా పనిచెయ్యట్లేదు.

ఒకరకంగా మంచానికి అతుక్కుపోయాడు.

బంధుమిత్రులొచ్చి చూసి సానుభూతి చూపి వెళ్ళిపోతున్నారు.

ఆ సానుభూతి భరించలేక వారిమాటలు వినలేక కళ్ళు మూసుకుని మత్తులో వున్నట్టుగా నటిస్తున్నాడు.

బాబు వస్తాడన్న ఆశకూడా అడుగంటింది.

"ఆయన బాధ చూళ్ళేకపోతున్నాను. బాబుకోసం కొట్టుకుపోతున్నారు. నేనే పిలుస్తాను. వస్తే వస్తాడు. లేకపోతే కొడుకే లేడనుకుంటానని చెప్పేస్తాను" అంటూ ఆవేశపడింది పార్వతి.

తనకి తెలిసిన అన్ని నెంబర్లకీ ఫోన్ చేసింది.

కానీ ఫోన్ కలవలేదు.

డాక్టర్ సుస్మిత వచ్చి పరీక్షిస్తోంటే "బాబుకి నామీద కోపం. గుర్రుగా వున్నాడు. రాడంటే మీరు నమ్మలేదు. వచ్చాడా చెప్పు? " అన్నాడు ముకుందం.

"బాబుకి మీమీద ఎలాంటి కోపమూ లేదంకుల్. వూరికే ఏదేదో వూహించుకుని మధనపడొద్దు. రాలేని పరిస్థితి గురించి





చెప్పి అశక్తుడ్నని బాధపడ్డాడు"

నిజమా అన్నట్టు చూశారు.

తన తండ్రి మరణశయ్యమీద వుండి బాబుని చూడాలని తపించడమూ అప్పుడు బాబు వచ్చేస్తున్నాడంటూ తను మాయమాటలు చెప్పడమూ గుర్తొచ్చాయి.

"నామీద ఒట్టేసి చెప్పమ్మా. నిజంగా వస్తానని నీతో చెప్పాడా? " ఆయాసపడుతూనే ఆశగా అడిగారు.

ఆమె కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి.

జాలిగా చూసింది. వేదనగా చూసింది.

"వాడు రాడు. తల కొరివి పెట్టే దిక్కులేకుండా పోతాను" ఏడ్చేశాడు ముకుందం.

"అలా ఫీలవుతారేం అంకుల్. మీరు మెటీరియలిస్ట్ కదా? "

చెళ్ళున కొరడాతో కొట్టినట్లు అదిరిపడి చూశారు.

కళ్ళు పెద్దవి చేసుకుని చూశారు.

వెర్రిగా చూశారు.

నిజమే. తను మెటీరియలిస్టుగానే జీవించాడు. కొడుక్కీ అదే నూరిపోశాడు. ప్రేమానుబంధాలు కాళ్ళకి బంధాలవుతాయని పదే పదే నొక్కిచెప్పాడు. ఎవర్తోనూ దేనితోనూ అనుబంధం పెంచుకోవద్దన్నాడు. సెంటిమెంట్సు పెట్టుకోవద్దన్నాడు.

ధన సంపాదన తప్ప మరేదీ సత్యంకాదనీ చెప్పాడు.

ఇప్పుడు తనదగ్గర ధనం మూల్గుతోంది.

అది గంధపు చెక్కల్తో తన శవాన్ని కాల్చడానికి పనికొస్తుందేమోగాని ఈ ఆఖరి ఘడియల్లో ఓదార్పునీ అనునయాన్నీ సంతృప్తినీ ఇవ్వగలదా?

ప్రేమానురాగాలూ బంధాలూ అనుబంధాలూ అమృతంలాంటివి. మనిషిని ఆశతో ఉత్సాహంతో తృప్తితో నింపుతాయి. మేమున్నామన్న భరోసా కల్గిస్తాయి. తోడుగా నీడగా అండగా నిలుస్తాయి.

కానీ తను ఏకంగా అమృతభాండాన్ని చేజార్చుకున్నాడు.

ఇప్పుడవన్నీ కావాలని కలవరిస్తున్నాడు. ఆరాటపడుతున్నాడు. తపిస్తున్నాడు.

చూసిచూసి దుఃఖం పొంగిరాగా ఏడ్చేసింది సుస్మిత.

ముకుందంతో సహా అంతా వింతగా చూశారు.

వారెదుట ఆమె ఇంత బేలగా ప్రవర్తించడం ఇదే ప్రథమం!

"బాబు లేడు! లే...డు..." అరిచినట్టుగా చెప్పింది సుస్మిత.

"ఏమయ్యాడు? "

"ఆత్మహత్య చేసుకున్నాడు"

"ఆఁ...!" చిన్నగా అరిచాడు ముకుందం.

బావురుమంది పార్వతి.

"ఎంతన్యాయం జరిగిపోయింది. ఏదో ఉద్ధరిస్తాడని విదేశాలకి పంపితే అక్కడే బలైపోయాడా. బాబుకప్పుడే నూరేళ్ళూ నిండిపోయాయా? " ఏడ్చింది అక్కడే ఉన్న ముకుందం అక్కయ్య.

ముకుందం కళ్ళు గాజుగుళ్ళలా అయిపోయాయి.

ఉలుకూ పలుకూ లేకుండా శూన్యంలోకి చూస్తుండిపోయాడు.

కనుకొలుకుల్నుంచి మాత్రం సన్నగా కన్నీటి ధార ఆగిఆగి కారసాగింది.

ఆయన ప్రాణం ఆ శరీరపు బందిఖానాలో వుండలేక ఇమడలేక కొట్టుకుని కొట్టుకుని నవరంధ్రాలనుంచి పారిపోయింది.

ఘొల్లుమన్నారంతా.

చాలామందే వచ్చారుగానీ, ఆ వచ్చినవారిలో తలకొరివి పెట్టడానికి వరసైనవారెవరూ లేరు.

❋

# చతురప్రపంచం

## సినీతారలు - చిత్రమైన షరతులు

హాలీవుడ్ స్టార్స్ ఓ చిత్రంలో నటించడానికి ఎన్నో షరతులు పెడతారు. నిర్మాత ఇచ్చే పారితోషికం నచ్చడంతోపాటు, వాళ్ళ షరతులన్నీ నిర్మాత ఒప్పుకుంటేనే ఆ సినిమాలో నటించడానికి ఒప్పందం కుదుర్చుకుంటారు. చిత్రం ఎక్కువరోజులు ఆడి, సూపర్‌హిట్టయితే, వారి షరతులు మరిన్ని పెరుగుతుంటాయి.

'గన్స్ ఆఫ్ నవరోన్' చిత్రంలో నటించడానికి గ్రగరీపెక్ తన పేరును ఆ చిత్రం తాలూకూ అన్ని ప్రకటనలలోనూ బోల్డ్ అక్షరాల్లో కొట్టవచ్చేట్టు కనిపించాలన్నాడు. చిత్రం పేరు ఏ సైజులో, ఏ రంగులో ఎంత ఘమకంగా వుంటుందో తన పేరు కూడా అలాగే రావాలన్నాడాయన.

'డోరిస్‌డే' అనే నటి తాను నటించే చిత్రానికి కెమేరామన్‌ని, దర్శకుణ్ణి తాను చెప్పిన వాళ్ళనే నియమించాలనేది. సహనటుల ఎన్నిక విషయంలో పెద్దగా జోక్యం చేసుకోకపోయినా ఆమె వద్దన్నవాళ్లని మాత్రం తీసివేయాల్సివచ్చేది.




ఎలిజబెత్‌టేలర్ తన లొకేషన్‌లో బస చేసే హోటల్‌కి సంబంధించిన షరతులనేకం విధించేది. ఆ ఫ్లోర్‌లో లిఫ్ట్ ఆగకూడదనేది. తాను పేర్లు రాసి ఇచ్చినవాళ్లు ఫోన్ చేస్తే మాత్రమే తనకి కనెక్షన్ ఇవ్వాలనేది. తన గదికి అటూ ఇటూ వుండే గదులు కూడా తప్పనిసరిగా తనకే కేటాయించాలనేది.

యూల్‌బ్రిన్నర్ ఒకేఒక్క చిన్న షరతు విధించేవాడు. తన హోటల్ గదిలోని టెలిఫోన్ తీగ గది అంతా తిరిగేంత పెద్దదిగా




వుండాలనేవాడు. ఫోన్‌లో మాట్లాడుతున్నం తసేపూ అతను గదిలో పచార్లు చేస్తూవుం డాలనుకునేవాడు. ఆయన బతికున్న రోజుల్లో కార్డ్‌లెస్ ఫోన్లింకా రాలేదు.

చాలామంది పెద్ద తారలు తెరమీద తమ పేరు ముందు రావాలని కోరుకుం టారు. ఇద్దరు పెద్ద తారలున్న చిత్రంలో ఎవరిది ముందు రావాలన్న విషయంమీద గొప్ప గొడవగా వుండేది. చివరికి ఇద్దరి పేర్లూ 'అండ్'కి అటూ ఇటూ ఒకేసారి వెయ్యాలని నిర్మాతల అసోసియేషన్ నిర్ణ యించింది. కానీ దాన్ని హాలీవుడ్ స్టార్స్ ఖాతరు చేసేవాళ్లు కాదు. ఇంగ్రిడ్ బెర్గ్‌మన్ తన పేరు సినిమా పేరుకన్నా ముందు రావాలన్న వింత కండిషన్ పెట్టింది. 'ది విజిట్' అనే చిత్రంలో తెరపై ముందస్తుగా ఆమె పేరు వస్తుంది. ట్రెవర్‌హోవర్డ్ తన పేరు తర్వాత తను పోషించే పాత్ర పేరుతో సహా రావాలని కోరేవాడు. తెర మీద ముందుగానేకాక అన్ని పేర్లూ చూపిం చడమయ్యాక మరొక్కసారి అతని పేరు, అతని పాత్ర పేరు వచ్చేది. లేట్‌గా వచ్చే వాళ్లు కూడా అతని పేరు చూసే అవకాశం కలగాలన్నది అతని ఉద్దేశం.

హాలీవుడ్ తారల్లో ఈ పిచ్చి ముదర డంతో వాళ్ళ కండిషన్స్ పేజీలకు పేజీ లుండి అగ్రిమెంట్ చిన్న పుస్తకంలా తయా రయ్యేది. రిచర్డ్‌బర్టన్ అగ్రిమెంటు 50 పేజీ లుండేది. అతని డ్రెస్సింగ్ రూంలోని కర్టెన్స్ రంగునించి, ఆ గది టెంపరేచర్ ఎంతుం డాలో సహావుండేది అందులో. ఓ హాలీ వుడ్ స్టార్ ఓ కండిషన్ పెట్టాడని తెలిస్తే మిగిలిన వాళ్లు కూడా తమ తర్వాతి సిని మాల్లో అదే నిబంధనలను విధించేవారు. దాంతో నిర్మాతలు క్రమంగా ఈ నిబంధన లని టాప్ సీక్రెట్‌గా కాపాడి బయటకి పొక్కనిచ్చేవారు కాదు.

ఒకేసారి ఇద్దరు హాలీవుడ్ స్టార్స్ పేర్లు తెరమీద కనపడాల్సి వచ్చినప్పుడు పైన ఎవ రిది, కింద ఎవరిది అన్న విషయంమీద ఆ ఇద్దరూ విబేధించేవారు. ఈ సమస్యని రెండు రకాలుగా పరిష్కరించారు. ఇద్దరి పేర్లూ పక్కపక్కనే వేయడం. అయితే ఎవ రిది ఎడమవైపు, ఎవరిది కుడివైపు అన్న సమస్య తలెత్తినప్పుడు వారి పేర్లను X ఆకారంలో పైనుంచి కిందకి వేశాడో విసుగె త్తిన నిర్మాత. ఒక్కొక్కసారి నిర్మాతలు బొమ్మా, బొరుసూ వేసి టాస్ నెగ్గినవాళ్ల పేర్లు పైన వేసేలా నిర్ణయించేవారు. ఇవన్నీ స్టార్స్‌కున్న ఇగో ప్రాబ్లెంవల్ల మొల కెత్తిన సమస్యలు.

---

## ఎ.కె. 47

**రెండో** ప్రపంచయుద్ధంలో జర్మన్ సైనికుడి తుపాకీ గుండు దెబ్బతిని, గాయపడి, హాస్పి టల్ పాలయిన మిఖిలాయ్ కలష్నికోవ్ కనిపెట్టిన అద్వితీయ ఆయుధం ఎ.కె.47. నిముషానికి 600 గుళ్లని అంటే క్షణానికి 12 గుళ్ల చొప్పున పేలుస్తుందీ తుపాకి. వంద లాది దేశాల సైనిక బలగాలు దీన్ని ఆయు ధంగా చేసుకున్నాయి.

ఇరవైరెండేళ్ళ కలష్నికోవ్ 1941లో యుద్ధంలో గాయపడి హాస్పిటల్‌లో చేరాక నాజీలుపయోగించే తుపాకి కన్న శక్తివంత మైన తుపాకిని కనిపెట్టాలని, అదే విజయా నికి సోపానమని అనుకున్నాడు. చికిత్స పొందుతూనే తుపాకుల సమూనాలను పరి శీలించాడు. తను గాయపడడానికి వాడిన నాజీల 'యం.పి.44' రైఫిల్ నమూనాని ఆధారంగా చేసుకుని కలష్నికోవ్ ఎ.కె. 47ని రూపొందించాడు. ఇందుకు అతనికి 6 సంవత్సరాలు పట్టింది. 1947లో ఇతడు రూపొందించిన ఆ కొత్త తుపాకిని, దాని




లోని అద్భుత గుణాలని చూసి రష్యన్ సైనికాధికారులు ఆశ్చర్యపోయారు. కేవలం 4 కిలోల. 800 గ్రాముల బరువుండే దీని షూటింగ్ రేంజ్ 400 మీటర్లు. యుద్ధంలో అరక్షణం కూడా విలువైన సమయమే. అలాంటిది సెకనుకు 10 గుళ్లు పేల్చగల దీంతో ఒక రౌండు పేల్చగానే దాన్నించి వెలువడే గేస్‌ని పిస్టన్‌లోకి రీసైకిల్ చేస్తే తర్వాతి రౌండు ఆటోమాటిగ్గా లోడ్ అవుతుంది. మిషన్‌గన్ ప్రిన్సిపల్‌నే వాడుకుని ఎంతో సింపుల్ టెక్నాలజీతో సృష్టించిన ఆయుధాన్ని 'మోస్ట్- డెడ్లీ వెపన్ ఆన్ ఎర్త్' గా గుర్తించారు రష్యన్ సైనికాధికారులు. దానితో కలష్నికోవ్‌ని, అతని కుటుంబ సభ్యులని మిల్రటీ కంటోన్మెంటులోని రహస్య స్థావరంలో దాచారు. రెండే రెండు నిముషాల్లో నేర్చుకునే విధంగా డిజైన్ చేసిన ఈ ఆయుధాన్ని ఎడారుల్లో, సముద్ర జలాల్లో, అరణ్యాలలో ఎక్కడయినా వాడచ్చు. ఈ ఆయుధానికి, దానిని కనిపెట్టిన కలష్నికోవ్ గౌరవార్థం 'అవటోమాట్ కలష్నికోవ్ 47' అని నామకరణం చేశారు. దాని ముద్దుపేరు ఎ. కె. 47గా రూపొందింది.

ఈ ఆయుధం తయారీ పెద్ద ఎత్తున జరగడంతో దీని గురించి ప్రపంచానికి పొక్కింది. అమెరికన్ గూఢచారులు ఎ. కె. 47 డిజైన్ కోసం వేట ప్రారంభించారు.

ముందస్తుగా ఫిన్‌లాండ్, తరవాత చైనా, నార్త్‌కొరియాలకి దీన్ని తయారుచేసే సాంకేతిక నైపుణ్యం తెలిసింది. ఇప్పుడు ఫ్రాన్స్‌లో కూడా ఎ. కె. 47లు తయారవుతున్నాయి.

ఇప్పుడీ తుపాకులు కాశ్మీరు మిలిటెంట్లకి, రువాండా తిరుగుబాటుదార్లకి, ఆఫ్ఘన్ గెరిల్లాలకి, జార్‌ఖండ్ సెపరేటిస్ట్ గ్రూప్‌కి, కొలంబోలో తమిళ పులులకి, ఆంధ్రప్రదేశ్ అరణ్యాలలోనివారికి యథేచ్ఛగా లభ్యం అవుతున్నాయి. బ్లాక్‌మార్కెట్‌లో ఇవి లక్ష రూపాయలనుంచి, పాతికవేలదాకా తేలిగ్గా లభ్యం అవుతున్నాయి.




## టి.వి.ప్రభావం

ప్రయివేటు టెలివిజన్ ఛానల్స్ వచ్చాక మన సామాజిక దైనందిన జీవితంలో అనేక మార్పులు చోటుచేసుకున్నాయి. పుస్తకపఠనం తగ్గింది. అతిథులు వచ్చినా హోస్ట్‌లు వారినీ, వారు వీరినీ పట్టించుకోకుండా అంతా కలిసి తమ ఫేవరెట్ టి.వి. ప్రోగ్రాం. చూసుకుంటూ కాలక్షేపం చేస్తున్నారు.

పిల్లల హోంవర్క్, ఆటలు కూడా తగ్గాయి. అమెరికాలోని పరిస్థితీ ఇంతే, ఇటీవల ఓ అమెరికన్ దినపత్రిక చేసిన సర్వేలో ఈ క్రింది విషయాలు తెలిశాయి.

అమెరికన్లు తమ విరామసమయంలో 40 శాతం టీవీ చూడడానికే కేటాయిస్తున్నారు. వారిలో 13 శాతం మంది తాము టీ.వీ.కి బానిసలమని ఒప్పుకుంటున్నారు. సగటు అమెరికన్ వారానికి 30 గంటలు టీ.వీ. చూస్తూ గడుపుతాడు. శెలవులకి ఇంకో ఊరు వెళ్ళిన వారు కూడా అక్కడ రోజుకి 3 గంటలు టీ.వీ. చూడడంతో గడుపుతారు. ప్రోగ్రాం ముగియకుండానే ప్రతి ముగ్గురిలో ఇద్దరు ఛానల్స్‌ని మారుస్తుంటారు. అమెరికన్ ప్రజల్లో 3 శాతం మందికి తమ బాత్‌రూమ్‌లో కూడా టీ.వీ. లున్నాయి. 10 లక్షల డాలర్లిస్తే జీవితాంతం టీ.వీ. చూడడం మానేయడానికి సిద్ధమేనా అని అడిగితే ప్రతి నలుగురిలో ఒకరు అందుకు సమ్మతించమన్నారు. వార్తలు, యుద్ధపు వార్తలు లాంటి వాటి కన్న సీరియల్స్ చూడడానికే అధికశాతం ఇష్టపడుతున్నారు. అంటే యదార్థ విషయాలకన్నా కాల్పనిక కార్యక్రమాలకే వాళ్ళు ఎక్కువ ఓటేస్తున్నారు. టీ.వీ. కార్యక్రమాల కోసం చాలామంది పడక గది సౌఖ్యాన్ని కూడా విస్మరించి అర్థరాత్రిదాకా టీ.వీ. చూసి నిద్రమత్తులో మంచం మీద వాలిపోతున్నారు. ఒకేసారి రెండు టీ.వీ.లలో కార్యక్రమాలు చూసేవారు 9 శాతం మంది వున్నారు. ఒక ఛానల్ నిశ్శబ్దంగాను, మరో ఛానల్ శబ్దంతోనూ చూస్తారలా.

కాల్పనిక కార్యక్రమాల తరవాతి స్థానం క్రీడలది. టీ.వీ. చూడడంవలన సమయం వృథా అనుకునే బుద్ధిమంతులు 3 శాతం మాత్రమే.



# ఏరినముత్యాలు

★ తల్లిప్రేమ లేనివాడు దురదృష్టవంతుడు. ప్రపంచంలో ఆనందం అంతా ఒక ఎత్తు. తల్లి ఒక ఎత్తు.

–రిటార్ట్

★ ఏ పాపం చేయనివారికి కోపం వుండదు. కోపం వచ్చిందంటే మనసు పాపం చేస్తోందని అర్థం.

– సెకల్

★ పోరాటం లేని జీవితం పరిపూర్ణత చెందదు.

– సెనెకా

★ మనిషి గాలిలో ఎగరగలుగుచున్నాడు, నీటిలో మునిగి ఈదగలుగుచున్నాడు. కానీ భూమి మీద జీవించలేకపోతున్నాడు.

–బెర్నార్డ్‌షా

★ ధనవంతునికి విద్య అలంకారమయితే, పేదవానికి అదేవిద్య ఉపాధి అవుతుంది.

–అరిస్టాటిల్

★ చనిపోవడంవల్ల విడిపోవడం పెద్ద బాధాకరం కాదు. కానీ విడిపోయి బతకడం చాలా బాధ.

–లాన్స్

★ బిందెడు పాలకి ఒక చుక్క విషపుబొట్టు చాలు విరపడానికి, అలాగే జీవితానికి ఒక అల్పత్వం చాలు పతనానికి.

–ఠాగూర్

★ ముసలితనంలో ప్రేమ మంచుపైన పడే ఎండలాంటిది. దానిలో కాంతేగానీ వేడి వుండదు.

–జె.పి. సన్

★ మనకు రెండురకాల చదువులున్నాయి. ఒకచదువు బతకడం ఎలాగో నేర్పితే, రెండోది బతుకంటే ఏమిటో నేర్పుతుంది.

–ఏడమ్

★ దాంపత్యం అనేది తమలపాకులాంటిది. ఆదిలో లేత లౌజు, ఆపై కవటాకు, పైపై పండుటాకు.

–మల్లాది రామకృష్ణశాస్త్రి

★ అపవాదుకున్న ఆకర్షణ ఈ ప్రపంచంలో ఆడదానికి లేదు.

–గోపీచంద్

-సేకరణ : తాజీప్రసాద్

# 'స్వాములోరు' పై సమీక్షలు

ఆగస్ట్ 'చతుర' లో ప్రచురితమైన మొలకలపల్లి కోటేశ్వరరావు రచన 'స్వాములోరు' పై మాకందిన ఉత్తమ సమీక్షలు.



## మూఢాంధకారంలో చిరుదీపం

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

ఎవరు చెప్పినా, ఎంత వాదించినా ఈ సృష్టిని నడిపించే, శాసించే ఒక శక్తి ఉన్నదన్న నమ్మకంతోనే తనని నడిపిస్తున్న ఆశక్తి కనపడని కారణంగా ఒక రూపాన్ని ఊహించుకుని మానవుడు ఆ రూపాన్ని స్మరించుకుంటూ వస్తున్నాడు. అలా వివిధ రూపాలలో వెలసిన భగవంతునికి, మానవునికి మధ్య అనుసంధానకర్తల్లా స్వాములు, బాబాలు, అమ్మలు పుట్టుకువచ్చారు. ఈ 'స్వాములోరు' నవలలో నీళ్లస్వామి కూడా అలాంటి రకమే.

మనిషి కలవరపడే సమస్యలలో తొంభై తొమ్మిది శాతం ఎవరి ప్రమేయం లేకున్నా కాలక్రమంలో మంచుతెరలలాగా తొలగిపోయేవే. ఈలోపున మనిషిపడే కంగారుని క్యాష్ చేసుకోవటానికి అవతరించిన పేరిగాడి కథే ఈ స్వాములోరి కథ. నీళ్ళస్వామి ఇచ్చిన నీళ్ళు తాగకున్నా రాధిక గర్భం ధరించేది. ఆ దంపతుల తొందరపాటు ఫలితం రామక్రిష్ణ మరణం.

వారానికి ఒకస్వామి బండారం పేపర్లలో బయటపడుతున్నా రోజుకి ఒక కొత్త స్వామి ప్రతి ఊర్లోనూ తయారవటానికి కారణం ప్రజల అజ్ఞానమే. మేధావులే మూర్ఖుల్లా స్వాములు, బాబాల కాళ్ళ చుట్టూ తిరుగుతుంటే సామాన్యజనం సంగతేముంది. ఉభయతారకంగా స్వాముల్ని రాజకీయనాయకులు చేరదీస్తుంటే, వారి పనులకి స్వాములు ఉపయోగపడుతున్నారు. మోసపోయేవాడు ఉంటే మోసగించేవాడు ఉండడా?

ఎన్నుకున్న కథావస్తువు గంభీరంగా

ఉందిగానీ, శైలి నాసిగా ఉంది. దొంగస్వాముల గురించి పేపర్లో వచ్చిన ఒక వ్యాసంలా ఉందికాని, నవల చదువుతున్నట్టుగా లేదు.

నవల పాకాన పడుతున్నప్పుడు రచయిత పడిన తికమక స్పష్టంగా కనపడిపోతోంది. పేరయ్య నీళ్ళస్వామిగా అవతారం ఎత్తాడని మార్కండేయులు ప్రచారం మొదలు పెట్టినట్టుగా స్వామి పాత కథ అంతా చెబుతూ మళ్ళీ మార్కండేయులు "నీళ్ళస్వామి గురించి మనం ప్రచారం చేసినా జనం నమ్ముతారంటావా" అని భార్య దగ్గర సందేహపడతాడు. తన కాళ్ళమీద పడిన రాధికని స్వామి లేవనెత్తేదాకా నీళ్ళస్వామికి అనుకూలంగా ఉన్న రచయిత ఒక్కసారిగా వ్యతిరేకంగా మారిపోవటం ఆశ్చర్యకరం. చివరికి నీళ్ళస్వామికి ఏ జడ్జి వేయనంత శిక్ష మహిళా జడ్జిచేత వేయించి, మరే కోర్టుకి కూడా వెళ్ళకుండా చేయించి దొంగ స్వాములమీద ఉన్న కసి అంతా తీర్చుకున్నారు.

నవలకి ఉండవలసిన లక్షణాలలో కొన్ని లోపించినా కథావస్తువు సూటిగా అర్థం అవుతూనే ఉంది కనుక జనం ఇప్పటికైనా కళ్లు తెరిచి ఈ దొంగస్వాముల కాళ్ళ దగ్గరకి చేరుకోకుండా ఉంటే రచయిత కృషి ఫలించినట్టే.

–కె.వి.యస్. భానుమూర్తి,
సంకిలి-532 440

## మేలుకొలుపు

*(ద్వితీయ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

ప్రజల అమాయకత్వాన్ని, వారి నమ్మకాల్ని దొంగస్వాములు, బాబాలు సొమ్ము చేసుకునే వైనాన్ని మొలకలపల్లి కోటేశ్వరరావు గారు తన 'స్వాములోరు'లో ఎంతో హృద్యంగా చిత్రీకరించారు.

కనికట్టు, గారడీలు ప్రదర్శించి ఎంతటి జబ్బులనైనా తగ్గించగలమనీ, సంతాన భాగ్యం కలిగించగలమనీ ప్రజల్ని నమ్మించి, వారిలో అంధ విశ్వాసాలు పెంచి డబ్బు దండుకునే ఈ స్వాములకు ప్రభుత్వోద్యోగుల అండదండలు ఉండటం, ఉన్నత పదవులలో ఉండేవారు సైతం సాష్టాంగ ప్రమాణాలు చేయడం శోచనీయం. విద్యాధికులు సైతం నిస్సహాయత, పరిస్థితుల ప్రభావం వల్ల ఎలా దొంగస్వాముల మాయలో పడి మోసపోతారో చక్కగా వర్ణించిందీ నవల.

దైవాంశ సంభూతులమని చెప్పుకునే ఈ స్వాముల జీవితాలలోని చీకటి కోణాలను, వారి పశువాంఛలకు బలయిపోయిన వనితల జీవితాలను చక్కగా ఆవిష్కరించారు. ప్రజలను మోసం చేస్తున్నామనుకొని, తామే ఆ ఊబిలో దిగబడిపోయి నిస్సహాయస్థితిలో, సర్వం కోల్పోయి ఆత్మహత్య చేసుకున్న సౌజన్య గాథ గుండెల్ని కదిలించింది.

ఆరంభంలో స్వామిని నమ్మి మోసపోయినా, కనబడకుండా పోయిన తన భర్త కోసం కేవలం ఒక సాధారణ గృహిణి అయిన రాధిక, స్వామికి వ్యతిరేకంగా ఉద్యమం లేవనెత్తడం అభినందనీయం. తనలాగా మరికొందరికి అన్యాయం జరగకూడదనుకొని పోరాటం జరిపిన సరస్వతి, వారికి సహాయాన్నందించిన కుమార్, భాస్కర్ లాంటివారు నేటి మన సమాజానికి ఎంతో అవసరం.

చాపకింది నీరులాగా సాగిపోతున్న ఈ స్వాముల ఆగడాలపై తమ దృష్టిని సారించి, వారి దుశ్చర్యలను ఎండగట్టిన రచయిత అభినందనీయులు. గారడీలకు, కనికట్లకు మోసపోయి దొంగబాబాలను దేవుళ్ళుగా భావిస్తున్న వారందరికీ ఈ నవల మేలుకొలుపు ఈ నవల చదివిన




తరువాతైనా వ్యక్తులనుదేవుళ్ళుగా పూజించడం కొందరైనా మానివేస్తే ఈ రచనోద్దేశం నెర వేరినట్లే!

-ఎం. శ్రీలత,
దేవరకొండ-508 248

## చౌకబారు లీలలు

*(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

మొలకలపల్లి కోటేశ్వరరావుగారి కలం నుంచి జాలువారిన 'స్వాములోరు' నేటి మన సమాజంలో 'అవతార పురుషులు'గా చలామణి అవుతున్న కొంతమంది 'దొంగ స్వాముల' గురించి చక్కగా తెలియజేసింది. మూఢనమ్మకాల ఉచ్చులో చిక్కుకున్న కొంత మంది అమాయక ప్రజల్ని నయవంచనతో ఈ స్వాములు ఏవిధంగా మోసం చేస్తారో ఈ నవల చక్కగా విశదపరచింది. తాను అందరినీ వదిలేస్తే 'సన్యాసట'. అందరూ తనను వదిలేస్తే సన్నాసట" అన్నాడు ఓ హాస్యరచయిత. అలాగే పేరయ్య అనే సన్నాసి ప్రేమానందస్వామి అనే సన్యాసిగా మారిన తీరు రచయిత చక్కగా చిత్రీకరించారు. ప్రజల్ని మోసగించే ఇటువంటి 'స్వాములోర్ల' గతజీవితాలు ఎంత దుర్భరంగా వుంటాయో రచయిత కళ్లకు కట్టినట్లు చూపించారు. ఇటువంటి స్వామీజీల ఆశీర్వాదాలు జనానికి ఎంత అవసరమో అని కొందరనుకుంటూంటే రాజకీయ ప్రముఖుల, కాంట్రాక్టర్ల, పారిశ్రామికవేత్తల 'ఆశీర్వాదాలు' తమ మనుగడకు నిత్యావసరమని ఆ స్వాములోర్లు అనుకుంటారు. స్వాములోర్లలో కూడా ఎన్ని పార్టీలుంటాయో. 'నీళ్లస్వామి' ఒకరైతే 'నూనెస్వామి' ఒకరు. వాళ్లలో వాళ్ళకి పడక 'గుట్టు' రట్టు చేసుకున్న తీరు, చెప్పిన ఖైనం అద్భుతం. పిల్లలు కలగలేదన్న చిన్న కారణంతో ఆశ్రమాన్ని ఆశ్రయించిన రాధికను స్వాములోరు 'పూజ' పేరుతో శీలాన్ని దోచుకోవటంతో నవల ఆసక్తికరంగా మారింది. హేతువాద సంఘ అధ్యక్షులు కుమార్ స్వామిజీ 'మహత్యాలను' సైంటిఫిక్‌గా అందరి సమక్షంలో రుజువు చేయటంలో ఈమహానుభావుల లీలలు ఇంత 'చౌకబారు'గా వుంటాయా అనిపించింది. మానభంగం అనేది కేవలం శరీరానికి అయిన గాయమేనని రాధికను ఓదార్చి ఆమెలో పోరాట స్ఫూర్తిని కలుగజేసిన కుమార్ పాత్ర ఈ నవల్లో మకుటాయమానంగా నిలిచింది. అండ దొరికితే దగాపడ్డ స్త్రీ ఏవిధంగా తిరగబడుతుందో నవల్లో మనం ప్రత్యక్షంగా చూశాం. స్వాములోరి కామదాహానికి బలైన శ్రీవాణి తల్లి సౌజన్యలో ఆఖరిదశలో మార్పు రావటం, ఆ తర్వాత ... మంలో జరిగిన రామకృష్ణ హత్య ఆమె రాసిన ఉత్తరం ద్వారా బయటపడటం కథలో భాగమే అయినా ఆశ్రమాల పేరిట జరుగుతున్న అక్రమాల్ని రచయిత చక్కగా చిత్రికపట్టారు. కోటేశ్వరరావుగారి నవలల్ని గతంలో చదివిన జ్ఞాపకం వుంది. ఇప్పుడు మరో నవల చదివే భాగ్యం కలిగించినందుకు 'చతుర'కు ధన్యవాదాలు.

-భమిడిపాటి వెంకటేశ్వరరావు,
రుద్రారం-502 329

## పదునైన అస్త్రం

*(నాల్గవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

మూఢవిశ్వాసాలమీద ఎక్కుపెట్టిన పదునైన అస్త్రం, హేతువాద ఆవశ్యకతని నొక్కి చెప్పిన చక్కని ప్రయత్నం "స్వాములోరు". గగనాంతర రోదసిలో మానవుడు కాలూనే ప్రయోగాలు చేస్తున్న ఈ కంప్యూటర్ యుగంలోనైనా కరడుగట్టిన పాత 'నమ్మకా

లకు పాతర వేయాలని బోధించే సందేశా త్మక నవల- 'స్వాములోరు'. వస్తువు ఎంపి కలోనూ... కథనంలోనూ జిగిబిగి ఉన్నాయి. విచక్షణ చూపాల్సిన రాధికవంటి విద్యావంతులు కూడా దొంగస్వాముల మాయాజాలానికి ఎలా బలైపోతుంటారో చాటిచెప్పిన రచన ఇది. అయితే అక్కడ క్కడా 'మెలోడ్రామా' కోసం రచయిత కొన్ని సంఘటనలు- జొప్పించడం కొంచెం ఎబ్బె ట్టుగా అన్పించింది. శ్రీవాణిపై అత్యాచారం, ఆశ్రమ సేవిక అనసూయని అమానుషంగా హత్య చేయడం, రామకృష్ణ దారుణ మరణం వంటివి లేకపోయినా కథాగమనా నికి వచ్చే ఇబ్బందులు ఏమీలేవు. స్వామీజీ పైశాచికత్వాన్ని నిరూపించడానికి బహుశా రచయిత ఇవి జొప్పించి ఉండవచ్చు దేశ విదేశాల్లో కోట్లాది భక్తులున్నారని ప్రచారం చేసుకునే ఒక 'బాబా' నిలయంలో సుమారు ఆరేళ్లక్రితం జరిగిన దుర్ఘటనలు ప్రతి పాఠ కుడి మదిలో మెదలకమానవు! మొత్తం మీద సగటు పాఠకుడి మెదడుకి మేతవేసే ఆలోచనాత్మక రచన- స్వాములోరు!

–కిల్లాన మోహన్‌బాబు,
బొబ్బిలి-535 558

## వంచితులెందరో...!

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

నేడు దేశంలో పుట్టుకొస్తున్న స్వామీజీలు, అమ్మలు, ప్రజల అమాయకత్వంపై, అజ్ఞా నంపై ఆధారపడి బతికేవారే! వ్యభిచారు లుగా బతికినవారు, హంతకులు, స్మగ్లర్లు, అమ్మలుగా స్వామీజీలుగా వేషాలు వేసు కొని దేశంమీదపడి ప్రజలను దోచుకుతిం టున్నారు. స్వామీజీల ఆశ్రమాలపై ప్రభు త్వంవారు నిఘా కమిటీ వేసి, అక్కడ జరిగే చీకటిపనులు, అక్రమాలను వెలికితీ యవలసిన అవసరం ఎంతైనా వుంది. అందరికి జాతకాలు చెప్పే మాయలఫకీరు లాగా వుండే ఒకస్వామి ఆరునెలలపాటు కటకటాలలో వున్నాడు. అయినా ఆయన దగ్గరకు పెద్ద పెద్ద రాజకీయులు ఇప్పటికీ పోతున్నారు. ఇది ఈ దేశానికి పట్టిన దౌర్భాగ్యస్థితి.

ప్రకాశం జిల్లాలో అతిపేదవాడుగా ఉన్న ఒకవ్యక్తి, "నీళ్ళస్వామి" అవతారమెత్తి, తాని చ్చిన నీళ్లు తాగితే పిల్లలు పుడతారని ఏజం ట్లతో ప్రచారం చేయించుకొని, లక్షలాది రూపాయలు సంపాదించాడు. సుమారు నూరుమంది చావుకు కారణమైన "నీళ్ళ స్వామి"ని అరెస్టు చేయించేందుకు జిల్లా హేతువాదసంఘం, విద్యార్థి సంఘం, స్త్రీ విముక్తి మహిళాసంఘం, రైతుకూలి సంఘాలు కలిసి సంయుక్తంగా ఉద్యమం నడిపిన ఫలితంగా నీళ్ళస్వామి అరెస్టు చేయబడ్డాడు. ఈ సంఘటన ప్రేరణగా కోటేశ్వరరావుగారు ఆగస్టు చతురలో "స్వాములోరు"ని అతిసహజంగా నవలీకరిం చారు. అందుకు అభినందనలు. నవలలోని అనసూయ, రాధిక పాత్రలు లాంటివాళ్ళు, దేశంలో స్వామీజీల వలన వంచించబడ్డ వనితలు చాలామంది వున్నారు. ప్రజలను మూఢనమ్మకాలనుండి చైతన్యపరచేందుకు ఇలాంటి నవలను ప్రచురించినందుకు 'చతు ర'ను అభినందిస్తున్నాం.

–నార్నె వెంకటసుబ్బయ్య,
ఒంగోలు-523 001

★

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942. Nellore: 331250.



ప్రేమిక స్మృతి, విశాఖపట్నం

ఫొటో: పి.ఎ.ప్రభాకరదత్

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78